


ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ 4-2-62 న విశాఖపట్నం నుంచి రాజధానికి వచ్చినప్పుడు విమానం దిగడానికి ముందు శ్రీ డి. సంజీవయ్య, డా. సంజీవరెడ్డిగార్లతో మాట్లాడుతున్న దృశ్యం.

# విషయసూచిక



ముఖచిత్రం:— విజేత—1962 రిపబ్లిక్ దినోత్సవం నాడు శ్రీ సంక్షేమశాఖ ప్రదర్శించిన ప్రతిమకు ప్రథమ బహుమతి వచ్చినది.

వెనుక అట్ట:— రిపబ్లిక్ దినోత్సవ పెరేడ్—1962 రిపబ్లిక్ దినోత్సవంనాడు సికింద్రాబాదులో రాష్ట్ర గవర్నరు, పెరేడును తనిఖీ చేస్తున్నారు.



# సత్వర పారిశ్రామిక అభివృద్ధి

శ్రీ యం.పి. పాయ్, ఐ సి.యస్.



**1948**లో కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన పారిశ్రామిక విధాన తీర్మానంతో మన రాష్ట్రపు పారిశ్రామిక విధానం ఆరంభమైనది ఇది నిర్దిష్టమైన సూత్రాలుకలది. సోషలిస్టు విధానం ప్రాతిపదికగా గలది వస్తూత్పత్తిని క్రమంగా హెచ్చించి, అందరకూ దానిని న్యాయంగా పంపిణీ చేయాలని అది నొక్కి చెప్పినది. పరిశ్రమల అభివృద్ధికై ప్రభుత్వం క్రమేణా యెక్కువగా పనిచేయాలని కూడా అది వచించినది ఈ తీర్మానం, ప్రభుత్వానికి గుత్తాధికారం గల ఆయుధాలు, మందుగుండు సామాను, అణుశక్తి, రైల్వేలనే కాక మరి ఆరు మూల పరిశ్రమల అభివృద్ధి అధికారమును కూడ (ప్రైవేటు వ్యక్తుల సహకారానికి అవకాశం వుంచి) ప్రభుత్వానికి యిచ్చి, మిగిలిన వాటిని ప్రైవేటు విభాగానికి వదిలివేసినది.

ఈ విధానం ప్రకటన పిమ్మట మన రాజ్యాంగం ఆమోదింపబడి, ఆర్థికాభివృద్ధికి మనం చేసే కృషిలో ప్రణాళికలు ముఖ్య స్థానాన్ని ఆక్రమిస్తున్నవి. సోషలిస్టు పద్ధతి సమాజం జాతీయాశయంగా పార్లమెంటు కూడా అంగీకరించినది.

## ఇతోధిక కృషి

ఈ ఆశయాన్ని ఆమోదించటంతో దేశ పారిశ్రామికాభివృద్ధికై ప్రభుత్వం యితోధికంగా కృషి చేయవలసి వచ్చినది. ప్రభుత్వ కృషి సాగే ప్రాంతానికి "ప్రభుత్వ విభాగం" అని పేరు వచ్చినది. దీని క్రింద ప్రధానంగా భారీ పరిశ్రమలు, ఆర్థికాభివృద్ధి హేతువులైన యితర మూల పరిశ్రమలు వుంటాయి. భూరి మొత్తములు పెట్టుబడులు కావలసిన పరిశ్రమలు వున్నవి. ఆ పైన, ప్రైవేటు లాభాలతో నిమిత్తం లేకుండా సంఘ క్షేమానికై వస్తూత్పత్తిని జరుపవలసిన రంగాలు కొన్ని వున్నవి. మన ప్రణాళికల యొక్క, రాజ్యాంగం యొక్క సాంఘిక ఆశయాలకు అనుగుణంగా వుండుటకై కొందరి చేతులలోనే సంపద పేరుకొనకుండ చూడవలసి వున్నది. ఈ కారణాలచే పారిశ్రామికాభివృద్ధి విషయంలో ప్రభుత్వం ప్రధాన పాత్ర వహించవలసి వున్నది.

ఈ హేతువు చేతనే పరిశ్రమలను మూడు తరగతులుగా విభజించే 1956 పారిశ్రామిక విధాన తీర్మానం వెలువడినది. మొదటి తరగతిలోని పరిశ్రమల భావి అభివృద్ధి కేవలం ప్రభుత్వ బాధ్యత. రెండవతరగతిలోని పరిశ్రమలకు క్రమేపీ ప్రభుత్వ

యాజమాన్యం యేర్పడుతుంది. కాబట్టి సాధారణంగా యీ తరగతిలో కొత్త పరిశ్రమల స్థాపనకు ప్రభుత్వం పూనుకొంటుంది అయితే యిందులో ప్రభుత్వ కృషికి తోడు ప్రైవేటు వ్యక్తుల పూనిక కూడా లభించకలదని భావించబడుతుంది. మిగిలినవన్నీ మూడవ తరగతి క్రిందకు వస్తవి. వీటి అభివృద్ధి మొత్తం మీద ప్రైవేటు విభాగానికి వదలివేయబడుతుంది అయితే, ప్రభుత్వం తలచుకుంటే యెప్పుడైనా యే రకం పారిశ్రామిక వస్తువునైనా వుత్పత్తి చేసే అవకాశం వుంటుంది.

ఆరంభంలో యీ విధాన తీర్మానానికి ప్రైవేటు పారిశ్రామిక వేత్తలు మిక్కిలి వ్యతిరేకంగా వున్నారు. అయితే, పరిమితమైన తమ పెట్టుబడి వనరులతో భారీ పారిశ్రామిక ప్రాజెక్టులను చేపట్టుట యేమి, యావత్తు పారిశ్రామిక రంగాన్ని తగినంత కాలంలో తమ స్వాధీనం చేసుకొనుట యేమి సాధ్యం కాదని యిప్పుడు వారు తెలుసుకొన్నారు.

పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ విభాగం పని చేస్తున్నా కూడా జనాభావృద్ధికి తగినంత వేగంగా అభివృద్ధి కొనసాగడం లేదు. పూర్వం మంచీ పారిశ్రామికంగా వెనుకబడి వున్న మన రాష్ట్రంలో, పరిశ్రమల స్థాపనకు ప్రైవేటు పారిశ్రామికులు మరీ వెనుకాడుతున్నారు. ఈ విషయంలో ప్రభుత్వమే ముందుకు రావలసి వస్తున్నది.

దేశంలో వ్యవసాయోత్పత్తికి పేరుపడ్డ ప్రాంతాలలో మన రాష్ట్రం ఒకటి. దాని విస్తీర్ణం 2,74,674 చ. కిలోమీటర్లు జనసంఖ్య 3 898 కోట్లు. జనసాంద్రత చ. కిలోమీటరు ఒకటికి 131. విస్తీర్ణంలో అది దేశంలోని పెద్ద రాష్ట్రాలలో అయిదవది. జనాభా ప్రాతిపదికపై నాల్గవది.

## అవకాశాలు

విస్తీర్ణం, జనాభా, అందుబాటులో నున్న వనరులు, సౌకర్యాల దృష్ట్యా మన రాష్ట్రంలో భారీ, మధ్యతరగతి, చిన్నరకం పరిశ్రమల స్థాపనకు అద్భుతమైన అవకాశాలున్నవి. మన రాష్ట్రంలో పారిశ్రామిక ముడి పదార్థాలుగా పనికి వచ్చే ఖనిజాలు, వ్యవసాయ, అటవీ వస్తువులు పుష్కలంగా వున్నవి. దానికి సుదీర్ఘమైన తీర ప్రదేశమున్నది. రోడ్డు, రైలు, కాలువ, సముద్రములపై చక్కని రవాణా సౌకర్యాలున్నవి. అది దేశం యితర ప్రాంతాలకు మధ్యగా వున్నది.

అయితే, మన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వ్యావసాయికం కావటాన దాని వనరులు తగినంతగా పారిశ్రామిక రంగంలో వినియోగించుకొనబడటం లేదు. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ హెచ్చుతగ్గులను సరిజేసి యేకీకృతం చేయవలసిన అవసరాన్ని గుర్తించినదై, రాష్ట్ర ప్రభుత్వం సత్వర పారిశ్రామికాభివృద్ధికై వివిధ చర్యలను గైకొన్నది.

## కొత్త కార్పొరేషన్లు

ఈ సందర్భంలో ప్రభుత్వం గైకొన్న ముఖ్య చర్యలలో మూడు కార్పొరేషన్ల స్థాపన ఒకటి. 1. భారీ, మధ్య తరగతి పరిశ్రమలకై ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్. 2. ఆంధ్రప్రదేశ్ చిన్నరకం పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్. 3. ఆంధ్రప్రదేశ్ ఖనిజాభివృద్ధి కార్పొరేషన్. ఈ సంస్థలు రాష్ట్రంలోని పరిశ్రమలకు మార్గదర్శులై వాటి సత్వరాభివృద్ధికి తోడ్పడగలవని భావించబడుతున్నది. ఈ సంస్థలు ప్రైవేటు పారిశ్రామికులకు అవసరమైన ప్రాజెక్టు నివేదికలు, సాంకేతిక వివరాలు అందజేసి తగిన పరిశ్రమల స్థాపనకు తోడ్పడుటే కాక అప్పులు లేక భాగస్వామ్య రూపేణా ఆయా సంస్థల పెట్టుబడి వ్యవస్థకు ఆర్థిక సహాయం కూడ చేస్తవి.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ మొదట్లో కోటి రూపాయల పెట్టుబడితో ప్రారంభమైనది ఈ పెట్టుబడి చివరకు 3 కోట్ల రూపాయలకు పెరుగగలదు. చిన్నరకం పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషను, ఖనిజాభివృద్ధి కార్పొరేషను మొదట చెరి 50 లక్షల రూపాయల పెట్టుబడితో ఆరంభమైనవి. మొత్తం మీద పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించే పై మూడు సంస్థలు కాక రాష్ట్ర ప్రభుత్వ విభాగంలో దిగువ ముఖ్య సంస్థలున్నవి.

పూర్వ ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాల ఆర్థిక సహాయ సంస్థల యేకీకరణ ఫలితంగా 1956 నవంబరు 1 న ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్థిక సహాయ సంస్థ యింత వరకు రాష్ట్రంలోని 161 పారిశ్రామిక సంస్థలకు మొత్తంమీద రూ. 1.59 కోట్లను అప్పులుగా యిచ్చినది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రోడ్డు రవాణా సంస్థ పని ప్రారంభించి మూడు సంవత్సరాలు నిండినది. ఈ కాలంలో యిది.

( మిగతా 85 వ పేజీలో )

# సౌందర్యలహరి*

డా. బూర్గుల రామకృష్ణరావు

శివుఁడున్ శక్తినిఁగూడి శక్తుఁడగు సృష్టింపంగఁ; గాకున్నపి
లవునే యీశునకేనియున్ మెదలగా? నట్లౌట, నాభారతీ
ధవ, గౌరీపతి, మాధవాద్యమరవంద్యన్ నిన్నుఁ బ్రాక్పుణ్యుఁడై
భవమార్జింపనివాని కంబరో! నుతింపన్ మ్రొక్కఁగన్ శక్యమే.

వారిజసూతి నీచరణవారిజసంభవపాంసులేశసం
భారముఁ బూని యీజగముఁ బ్రజ్ఞమెయిన్ రచియించు; దానినే
శౌరి సహస్రశీర్షముల శ్రాంతతనెట్లొ భరించు; మారసం
హారియు మెత్తగాఁ మెదిపి యవ్వియభస్మముగా ధరించెడిన్

అదె యజ్ఞానులలోని చీఁకటుల సూర్యద్వీపసంవాసమో;
నదెమూఢాత్ములచేతన ప్రసవగుచ్ఛాసారమారందమో;
నదెచింతామణియౌ దరిద్రులకుఁ బ్రాపై; జన్మపాథోధిస
య్యాదినిర్మగ్నులనేలు నాదికిటిదంష్ట్రాంకూరమై యొప్పెడిన్.

దేవతలన్యులెల్లరును. దీర్పవరాభయముద్రహస్తముల్
నీవయొకర్తవట్టి యభినీతవరాభయ హస్తగావు; లో
కావళిభీతిఁ బాపి మదినర్థితవాంచల కన్ననెక్కుడే
దేవి! యొసంగుగాదె భవదీయ పదాబ్జయుగంబె మేటియై.

హరిపూర్వంబునినున్ భజించి, నతలోకైశ్వర్యసంధాయినీ!
పురసంహారినిక్షోభపెట్టెఁగద తాముగ్ధాంగనారూపుఁడై
స్మరుడున్ నిన్నుస్మరించి మ్రొక్కి, రతివీక్షాస్వాద్యరూపంబుతో
పరమౌనీంద్రుల మోహపాశములచే బంధింపశక్తుండగున్.

---

★ శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య కృతికి అనువాదము.

పువ్వులే విల్లఁట, నారి తేఁటులఁట, తూపుల్ గట్లనెటంట, వా
ల్యవసంతుండఁటమంత్రి, దక్షిణమరుత్తౌ సంగ పోరంగరథం
బవనిన్ సర్వముఁ దాసనంగుఁడౌఁ గదే యైగెల్వనెట్లో; ఘన
స్వనహాలక్ష్మీకటాక్షముంట్ గనకయే; శ్రీశీతశైలాత్మజా!

క్వణదంచన్మణికాంచియై, కలభకుంభాభ స్తనానమ్రయై
యణుమధ్యాంచితయౌచు, శారదశశాంకాస్యమ్ము శోభింపఁగా
సృణిబాణాసన, బాణ, పాశకరయై, శ్రీ శంభ్వహంకార రూ
పిణియౌ, దేవిభవాని మాయెదుట, దీప్తిన్ బ్రీతితో నిల్చుతన్.

పీయూషాంబుధిమధ్య దేవతరు సంవీతంబునై యొప్పి, సు
శ్రేయంబౌ మణిదీవి, నీపవనికాచింతామణీ గేహమం
దాయోగీశ్వరపీఠమందు, శివపర్యంకస్థపై యున్ననిన్
శ్రేయోదాయిని, చిత్ప్రమోదలహరిన్, సేవింతు ధన్యాత్ములే.

మొదటమూలాధార ముఖ్య చక్రంబునం
దలరు పృథ్వీతత్వమధిగమించి
మణిపూర చక్రమందణిగిన జలతత్వ
మునుదాటి, స్వాధిష్ఠమునవెలుంగు
యగ్నితత్వముఁదాకి యవలననాహత
వలయస్థ పవనతత్వమునుగడచి
యూపైవిశుద్ధారయందు వియత్తత్వ
మును నాజ్ఞయన్ చక్రమున మనస్సు

తత్వమునుమించి యవలీలఁదల్లి! నీవు
నకలకులపథమునుఁ జీల్చిశంభుఁజేరి
యలసహస్రార పద్మచక్రాంతరమునఁ
గలసివిహరింతు పతితొ, నేకాంతరతిని.

పరజాజ్జద్వయ నిస్సృతంబగు సుధాసారంబుచేనాడికా
సరణిన్ నేచనమాచరించి, శశిదాట్సందీప్తిఁ స్వస్థానమౌ
*ధరణిఁ జేరి, వికోరగాకృతిని నాధారాఖ్యచక్రంబులోఁ*
**కుణిలన్ జుట్టుచు నిద్రబోవుదు, సుషుమ్నామూలకుండంబునన్**

దళపత్రములు నాలుగవి గాఁ వేర్వైన
శివశక్తిచక్రముల్ చెలఁగన్నైదు
మూలప్రకృతులు తొమ్మిదులుగా నీయింట
వెల్గుచుండును వేఱువేఱుగాఁగ
ఎనిమిదిదళముల నెసగు పద్మంబొండు
పదునారుదళముల పద్మమొండు
మూడువలయములున్ మూడురేఖలుఁగూడ
బిందువుతోఁగూడి విస్తరిల్ల

శివుఁడుశక్తియుఁగూడిన చిద్విలాస
మందిరమ్మైన నీమహామహితచక్ర
వలయరేఖల బిందువుఁగలిపిచూడ
నలువదియు నాలుగంచుల నలరునంబ!

కమలభవాదులౌ కవులు కల్పన లెట్టులొ చేసిచూచినన్
హిమగిరికన్య! నీచెలువమెవ్వరితో సరిబోల్పనేర, రా
యమర లలామలే కనుల నందముగాంచెడి వాంఛచేతఁ జి
త్తములనె కొంతురే తపసి తాకగలేని శివైక్య సంపదన్.

ముదుసలియైనఁ, గ్రీడలను మోటయినన్. వికృతస్వరూపుడై
పొదలిన, నీ కటాక్షమును బొందినవానిని వేలజవ్వనుల్
ముదమున వెంటనంటెదరు మోహమదంబునఁ గొప్పులూడఁగ
య్యెదలును జారఁ, గాంచితిగ. నెందఱొకోకలు వీడిపోవఁగన్

పృథివితత్త్వమ్మునఁ బొడము నేఁబదియారు;
నందునేఁబదిరెండు నుదకమునను;
నరువదిరెండుండు నగ్నితత్త్వమునందుఁ;
బవనమందుండు నేఁబదియు నాల్గు;
దివితత్త్వమున డెబ్బదియు రెండునుండును;
నరువదినాల్గుండు స్వాంతమందు;
నాధార, మణిపూర, స్వాధిష్ఠములు, ననా
హత విశుద్ధాజ్ఞలౌ నారు చక్ర

ములను వహ్న్యర్కచంద్రులు మువ్వురుగలసి
కల్పిప్రసరింత్రు కిరణ సంఘాతములను

వానిపై నుండు బైందవస్థానమందు
నీదుపాదాబ్జయుగమంబ! నిలిచియుండు

శరదిందుప్రభలీను శుభ్రవదనన్ జంద్రోల్లసచ్చూడపై
వరదానాభయముద్రలున్ స్ఫటికజపవ్యన్మాలయున్ బుస్తకం
బురుహస్తాంబుజ భూషలై వెలుఁగునిన్నొక్కప్పుడేన్ బ్రొక్కుచున్
దరమేపొందబుధాళికిన్. మధుపయోద్రాక్షాదిరుచ్యోక్తులన్.

సరసకవీంద్ర చిత్త జలజాతవనిన్ బులకించుబాలభా
స్కరరుచిఁ మించునిన్నరుణగాఁ మదినెంచి భజింత్రుకొందఱా
సరసులె. వాక్సతీతరుణ. సార. గభీర. రసాత్మ. మాధురీ
ధురులగు. వాక్కులన్. బుధులఁ సంతసమొందగ జేతురెప్పుడున్.

శశికాంతోపలభంగకాంతలయి వాచామాతలై యొప్పునా
వశినీముఖ్యుల శక్తులన్ గలుగునిన్ భావించు ధన్యాళికిన్
వశమై వర్తిలెడిన్ మహాకవి వచోవైదగ్ధ్యముల్; కావ్యముల్
యశముఙ్గాంచును వాక్సతీవదన దివ్యామోదకప్రోక్తులన్.

తరుణాదిత్యవిభావిభంబులగు త్వద్భవ్యాంగసంఛాయలన్
ధరణీవ్యోమము లెల్లనై వెలయుటన్ ధ్యానించి, భావించినిన్
స్మరియింపంగలవానిగెల్తురిలఁ ద్రస్యద్వన్యసారంగ సుం
దరనేత్రల్ సురవేశ్యలూర్వశిముఖల్ తామెందఱో వశ్యలై,

బిందువొనర్చి నీమొగము; పీనకుచద్వయిదానిక్రింద; నా
క్రిందహరార్ధముంచి! యటఁబ్రీతిగ మన్మథబీజపూజనే
యందగువాడు సుందరులనందఱ క్షోభలబెట్టుచెంత! సూ
ర్యేందుకుచత్రిలోకముల నెల్లభ్రమింపగఁ జేయఁజాలెడిన్

సకలాంగంబులఁ గాంతిపుంజము సుధాసారంబు వర్షించు చం
ద్రకలాకాంత శిలాస్వరూపముననిన్ దానాత్మలో నిల్పుసా
ధకుడాతార్క్ష్యుని సర్పదర్పదళనా దక్షత్వముంబొందుచున్
సుకమిచ్చున్ జ్వరజుష్టులౌజనులకున్ జూడ్కుల్సుధానాడులై.

తటిదాకారత సూక్ష్మమై వెలసి శీతాంశ్వర్క వహ్నిప్రభా
పటలిన్నిండుచు! నారుచక్రములపైఁ బద్మాటవీస్థానవౌ

చటః నీదివ్యకళఁ మనోమలినమాయాతీతచిత్తంబులన్
స్ఫుటదృష్టిఁగనుయోగులొందుదురు సంపూర్ణ ప్రమోదంబులఁ.

'గిరిజా! నన్నృపతోడదాసుని విలోకింపమ్మనీ' వంచునే
నరుడుత్కంఠతఁ వేడనెంచి. 'గిరికా! నన్న'ంచనుఁ; వెంటనే
హరి. వాగీశ. సురేశ శీర్షమకుట వ్యావిద్ధ రత్నప్రభా
కరనీరాజిత పాదపద్మములనైక్యమ్ముఁ బ్రసాదింపవే?

ఎడమసగంబుమున్నెహరించితి శంభునిమేనః నాపయిఁ
గుడిసగమున్ హరించితివా? కోరికతీరక, యంచుశంకతో
నడిగెదః నీదురూపమరుణాభము. కన్నులుమూడు. నాదటన్
గడుకుచభారనమ్రతయుఁ గ్రమళశాంక కిరీటమెందుటన్

నలువ సృజించులోకము. జనార్దనుఁడర్మిలిఁబ్రోచు. నాశమున్
నలుపుహరుండు; నీత్రితయసత్వతిరస్కృతిఁ జేసియీశుడా
వలఁదనమేను గన్పడకవర్తిలఁజేసి. సదాశివత్వమున్
గలిగిసృజించుఁ గ్రమ్మర జగంబుల నీకనుబొమ్మసన్నలన్

భగవతి! నీపదాబ్జమ్ములఁభక్తినొనర్చెడి పూజలా భవ
త్త్రిగుణజులౌ త్రిమూర్తులొనరించెడిపూజ. లదెట్టులన్న నీ
మొగసలఁబాద పీఠికడఁ మోములపైన ఘటించియంజలుల్
బగలునురాత్రిమ్రొక్కుచుఁ గృపన్మముగావుమటంచు గొల్వరే?

విలయంబొందవిరించి. విష్ణువుపయోఽబ్ధిఁ లీనుడైయుండగా
నలకీనాశుడునాశమొంద. ధనదుండందంగనైధన్యముఁ
గలఁగన్ జిత్తములెల్ల దేవవితతుల్ గన్మూతలుఁబొందని. ని
శ్చలుడై నీపతియాడుచుండుగద! యీ సంసారమందోసతీ!

నాజల్పమ్ముజపమ్ము. శిల్పములగున్ నాహస్తముద్రాకృతుల్
సాజమ్మౌనడకల్ పరిక్రమలు. నాసాపాట్లుహోమక్రియల్
నేజారన్ భువిఁదొర్లుటల్ బ్రణతులౌ; నీకైనయాత్మార్పణల్
పూజల్గావె? సమస్తసౌఖ్యములు సంపూర్ణంబు లౌనీయెడఁ

రాష్ట్ర ప్రభుత్వ పశుసంవర్ధక శాఖ ప్రజలకు ఎంతో ఉపయోగపడుతున్నది. కీలు గ్రామ కేంద్రాలు, కృత్రిమ సంతానోత్పత్తి కేంద్రాలు, పశు పోషణ కేంద్రాలు, కోళ్ళ పెంపకం కేంద్రాలు, గొర్రెల ఉన్ని అభివృద్ధి కేంద్రాల నిర్వహణ, వైద్య విద్యా పరిశోధనలతోబాటు నగర ప్రజలకు శ్రేష్ఠమైన పాలను సరస ధరకు సరఫరా చేస్తున్నది

తృతీయ పంచవర్ష ప్రణాళికలో యీ శాఖకు రు. 385 లక్షలు కేటాయించబడినవి. ఈ మొత్తం గాక పాల సరఫరాకు రు. 296 లక్షలు ప్రత్యేకించ బడినవి. ఇందులో రు. 72 లక్షలు సహకార శాఖ ద్వారా ఖర్చు చేయబడుతాయి. మిగిలిన రు. 224 లక్షలలో మిల్క్ కమీషనర్ ద్వారా రు. 188 లక్షలు పశుసంవర్ధక శాఖద్వారా రు. 36 లక్షలు ఖర్చు చేయబడుతాయి.

హైద్రాబాద్ నగరంలో పైలట్ పాల సరఫరా పథకాన్ని ప్రారంభించి, దాన్ని సమీకృత పథకంగా రూపొందించే సందర్భంలో పశు సంవర్ధక శాఖలో పాల సరఫరా విభాగం నెలకొల్పబడింది. ఇప్పుడు మిల్క్ కమీషనర్ పదవి నెలకొల్పబడి ఒక ఐ.ఏ.యస్. ఆఫీసర్ ఆధీనంలో దానిని ప్రత్యేక విభాగంగా రూపొందించారు.

రాష్ట్రంలో పాల సగటు వాడకం 6 ఔన్సులు మాత్రమే. మనిషి ఆరోగ్యానికి రోజుకు 10 ఔన్సుల పాలు అవసరం. ఈ లోటును తీర్చడానికి పాల సరఫరా పథకాన్ని ప్రభుత్వం చేపట్టింది. తృతీయ ప్రణాళికా కాలంలో "యునిసెఫ్" అనే అంతర్జాతీయ సంస్థ సహాయాన్ని కూడ స్వీకరించి యీ పథకాన్ని అమలు జరపడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ప్రస్తుతం అమలులో ఉన్న పైలట్ పథకం ద్వారా హైద్రాబాద్ సమీప గ్రామాలలోని పాలను సేకరించి నగరంలోని ఆసుపత్రులు, హైస్కూళ్ళకు, కొందరు ప్రజలకు పాలు సరఫరా చేయబడుతున్నవి. దీన్ని సమీకృత (Integrated) పాల సరఫరా పథకంగా విస్తృతపరిచి విజయవాడ సమీప ప్రాంతాలలో పాలు సేకరించి హైద్రాబాద్‌కు సరఫరా చేసే ప్రయత్నం జరుగుతున్నది. మిగిలిపోయిన పాలను పాలపొడి చేయడానికి కూడా విజయవాడలో ఫ్యాక్టరీ నెలకొల్ప బడుతుంది. ఈ పథకం పూర్తయితే హైద్రాబాద్ నగరంలో పాల సమస్య ఉండదు. ఈ పథకాన్ని అమలుజరిపే సందర్భంలో పశు సంవర్ధక శాఖ మంత్రి అధ్యక్షతన అధికార, అనధికార సభ్యులతో ప్రభుత్వం ఒక కమిటీని యిటీవలనే ఏర్పాటు చేసింది.



"ఉదయభాను"

పశు సంవర్ధక శాఖకు తృతీయ ప్రణాళికలో కేటాయించిన రు. 385 లక్షలలో 1961–62 సంవత్సరానికి ప్రత్యేకించబడిన రు. 48 లక్షలున్నీ దాదాపు ఖర్చయిపోయింది. ఆ మొత్తం గాక పాల సరఫరాకు రు. 2 లక్షలు కేటాయించబడినవి. వచ్చే సంవత్సరం అంటే 1962–63 కు కూడ పశు సంవర్ధక శాఖకు రు 48 లక్షలు కేటాయించబడుతున్నవి. ఈ డబ్బుతో క్రొత్తగా 49 పథకాల్ని అమలు జరపాలని సంకల్పించబడుతున్నది. గతంలోని 43 పథకాలు కొనసాగించబడుతున్నవి.

పశు సంవర్ధక శాఖ సుమారు 13 లైవ్‌స్టాక్ క్షేత్రాల్ని నిర్వహిస్తున్నది. ఇక్కడ ఉత్తమజాతి పశు సంతతిని అభివృద్ధి చేయడానికి కృషి జరుగుతుంది. బనవాసి, చింతలదీవి, గుంటూరు, పలమనేరు, మున్నగు చోట్ల గల క్షేత్రాల విస్తరణకు కార్యక్రమం చేపట్టబడింది. ఇటీవలనే నాగార్జున సాగర్ ఎడమ ఒడ్డున ఒక క్షేత్రం నెలకొల్పబడింది. త్వరలో కుడి ఒడ్డున మరో క్షేత్రం నెలకొల్పబడుతుంది. తృతీయ పంచవర్ష ప్రణాళికలోని మిగిలిన భాగంలో మరో మూడు క్షేత్రాలు ప్రారంభించబడుతాయి.

కోళ్ళ పెంపకంలో కూడా యీ శాఖ అధిక శ్రద్ధ తీసుకొంటున్నది రాష్ట్ర ప్రభుత్వ పశు సంవర్ధక శాఖ డైరెక్టర్ డాక్టర్ పి.ఎం.ఎన్. నాయుడు మొత్తం దేశంలోనే కోళ్ళ పెంపకంలో నిపుణుడని భారత ఆహార శాఖ ఉపమంత్రి శ్రీ ఎం. వి. కృష్ణప్ప చెప్పి ఉన్నారు.

రాష్ట్రంలో జిల్లా కోళ్ళ పెంపకం క్షేత్రాలు గాక 24 కోళ్ళ పెంపకం విస్తరణ కేంద్రాలున్నవి. వీటిలో ఐదింటిని — నిర్మల్, మెదక్, గన్నవరం, బనవాసి, ముదివర్తిపాలెం (నెల్లూరు జిల్లా) యిటీవలనే కోళ్ళ పెంపకం క్షేత్రాలుగా అభివృద్ధి పరిచారు.

ఈ కేంద్రాలన్నిటిలోనూ మంచిరకం కోడి గ్రుడ్లను ఉత్పత్తి చేసి ఆ ప్రాంతాలలోని వారికి పంపిణీ చేయడం జరుగుతున్నది. ఈ విషయంలో యునిసెఫ్ అనే అంతర్జాతీయ సంస్థ కూడా కోడిపిల్లల్ని సరఫరా చేసి సహాయపడుతున్నది. స్థానికంగా ఉన్న కోళ్ళ జాతిని అభివృద్ధిపరచడమే యీ కేంద్రాల లక్ష్యం.

రాష్ట్రంలో మంచిరకం పందుల పెంపకానికి కృష్ణా జిల్లా ముక్త్యాలలో ఒక కేంద్రం నెలకొల్పబడింది. తరువాత మరో పది పందుల పోషక కేంద్రాలు నెలకొల్పబడినవి. ఈ కేంద్రాల నుండి మంచిరకం పందుల్ని సరస ధరలకు పంపిణీ చేయడం జరుగుతుంది. మంచిరకం మగ పందుల్ని పెంచేవారికి నెలకు రు. 5 సబ్సిడీ యివ్వబడుతుంది.

గొర్రెల అభివృద్ధికి కూడా ముఖ్యంగా తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలలో అధిక శ్రద్ధ తీసుకోబడుతున్నది. చాల మంది యీ విషయంలో అశ్రద్ధ చేస్తున్నారు. జాగ్రత్తగా వాటి పెంపకం కార్యక్రమాన్ని నిర్వహిస్తే యిది చాల లాభదాయకమైనది. నెల్లూరు, దక్కని, బళ్ళారి గొర్రెలతో మంచి జాతి గొర్రెల సంపర్కం ద్వారా గొర్రెల జాతిని పెంపొందింప జేయడానికి కృషి జరుగుతున్నది. అనంతపురం జిల్లా పెనుకొండలో నెలకొల్పబడిన గొర్రెల అభివృద్ధి కేంద్రంలో మంచిరకం గొర్రె పోతుల్ని బ్లాకులలో పంపిణీ చేసే కార్యక్రమం అమలు జరుగుతున్నది. ఉన్ని వినియోగానికి కూడ తగు ఏర్పాట్లు చేయబడ్డాయి. హైద్రాబాద్‌లోని రాజేంద్రనగర్‌లో ఉన్ని పరిశోధనాలయం నెలకొల్పబడింది. గొర్రెలు, ఉన్ని అభివృద్ధి కేంద్రాలు, ఉన్ని ప్రదర్శన కేంద్రాలు నంద్యాల, విజయవాడ, విశాఖపట్నం, ఆదోని, అనంతపురం, నెల్లూరు, కాకినాడ, మహబూబ్‌నగరం మున్నగు చోట్ల పనిచేస్తున్నవి.

అలాగే మేకల అభివృద్ధికి కూడ పశు సంవర్ధక శాఖ చాలా కృషి చేస్తున్నది. మేకను పాలిచ్చే జంతువుగా పెంపొందించేందుకు పలమనేరులో మేకల అభివృద్ధి కేంద్రం నెలకొల్పబడింది. మంచిరకం మేకల్ని సేకరించి వాటి పోషణ విధానాల్ని వ్యాప్తిపరచడానికి అనంతపురం, కాకినాడ, నెల్లూరు మున్నగు చోట్ల కేంద్రాలు పనిచేస్తున్నవి. మహానందిలోని మేకల పెంపకపు క్షేత్రంలో ఒంగోలు, దూపడ్, గిర్ జాతి మేకల్ని పోషిస్తూ అందులోని మేకపోతుల్ని రాయలసీమ జిల్లాలకు సరఫరా చేయడం జరుగుతున్నది.

వాలంటరీ సంస్థలు నిర్వహిస్తున్న గోశాలలకు గోశాల అభివృద్ధి పథకం క్రింద ఆర్థిక సహాయం చేయబడుతున్నది. గుంటూరు జిల్లా మెల్లవాగులో ఒక గోసదన్ నిర్వహించబడుతున్నది. గోశాలలు గోజాతి అభివృద్ధికి దోహదం చేస్తున్నవి. గోసదన్‌లో ఉపయోగం లేని ముసలి పశువులుంటాయి.

కీలక గ్రామ పథకం క్రింద పశు జాతి అభివృద్ధికి కొన్ని ప్రత్యేక ప్రాంతాలలో కేంద్రీకృత కృషి జరుగుతున్నది. కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాల ద్వారా మంచిరకం ఆబోతుల వీర్యాన్ని నిల్వచేసి ఆవులకు గర్భోత్పత్తి కల్గిస్తున్నారు. మంచిరకం ఆబోతులు, దున్నపోతులను ఆ ప్రాంతాలలో పోషిస్తూ, యితర ఆబోతులు, దున్నపోతుల నుండి ఆవులు, బర్రెలకు గర్భోత్పత్తి జరగకుండా చేయడానికై అలాంటి పశువులన్నిటికీ "బుడ్డ కొట్టివేయడం" జరుగుతున్నది. ఈ కీలక గ్రామాలలోని మొత్తం పశు జాతి నాలుగైదు తరాలలో బాగా అభివృద్ధి చెందగలదని ఆశించబడుతున్నది. రాష్ట్రమంతటా కీలక గ్రామ కేంద్రాలు విరివిగా నెలకొల్పబడుతున్నవి.

ప్రతిజిల్లాలో—ఒకజిల్లాలో ఒకటికంటె ఎక్కువగా—కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు పనిచేస్తున్నవి. ప్రతి గ్రామంలో అనుకొన్న సమయానికి ఆబోతు లేక దున్నపోతును సరఫరా చేయడం వీలుపడదు గనుక మంచిరకం పశువుల వీర్యాన్ని తీసి శాస్త్రీయ పద్ధతులలో భద్రపరిచి దానిని రైతుల కోర్కెపై ఆవులు, బర్రెలకు ఎక్కించి పిండోత్పత్తి గావిస్తున్నారు.

ఆరోగ్యకరమైన అన్నిరకాల పశువుల పోషణకు యీ విధంగా శ్రద్ధ తీసుకొంటూనే పశువుల వ్యాధుల విషయంలో కూడా మరింత శ్రద్ధ తీసుకోవడం జరుగుతున్నది. రిండర్‌పెస్టు అనబడే పశువుల మహామారి నిర్మూలనకు రాష్ట్ర వ్యాపితమైన

పథకం అమలు జరపబడింది. ఫలితంగా రాష్ట్రంలోని అనేక ప్రాంతాలలో ఆ వ్యాధి పూర్తిగా తొలగిపోయింది. పశువులకు వచ్చే యితర వ్యాధుల చికిత్సకు విరివిగా పశు వైద్యశాలల్ని రాష్ట్రమంతటా నెలకొల్పుతున్నారు. తిరుపతిలోని ఆంధ్ర పశు వైద్య కళాశాల, విశాఖపట్నం, హైద్రాబాద్‌లలోని పశు వైద్య పాఠశాలలు అనేక మంది పశు వైద్యుల్ని, కాంపౌండర్లను తయారు చేస్తున్నవి. హైద్రాబాద్‌లోని వెటరినరీ, బైలాజికల్ సంస్థ పశువుల వ్యాధుల నిరోధానికి ఇంజక్షన్ మందును తయారు చేస్తున్నది.

వధించబడే జంతువుల ఆరోగ్యాన్ని వెటరినరీ అసిస్టెంట్ సర్జన్లు పరిశీలిస్తారు. కసాయిశాలలవారు యిలాంటి పరీక్ష జరగనిదే జంతువుల్ని కోయరాదు.

ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పథకాన్ని అమలుజరుపుతూ నిర్వహిస్తున్న సమాజాభివృద్ధి బ్లాకులలో పశు సంవర్ధక శాఖ విస్తరణాధికారులు నియమించబడినారు. వీరు ఆయా బ్లాకులలోని రైతులకు సలహాలిచ్చి తోడ్పడుతున్నారు.

పశు క్షేత్రాల నిర్వహణ సందర్భంలో అనేక పరిశోధనా కార్యక్రమాలు కూడ చేపట్టబడుతున్నవి. కాకినాడలోని కేంద్ర కోళ్ళ పెంపకం పరిశోధనా కేంద్రంలో కోళ్ళ పోషణ సమస్యల్ని గురించి పరిశోధన జరుగుతున్నది. అలాగే పశువుల రోగాల్ని సకాలంలో అంచనా వేయడానికి ప్రతి జిల్లాలో క్లినికల్ పరిశోధనా లయాలు ఏర్పాటు చేయబడుతున్నవి. చాల జిల్లాలలో వీటిని నెలకొల్పే కార్యక్రమం యిప్పటికే పూర్తయింది.

పరిశోధనా కార్యక్రమంతోబాటు శిక్షణ కార్యక్రమం కూడా చేపట్టబడింది. వివిధ రంగాలలో శిక్షణకు ఏర్పాట్లు చేయబడినవి. లైవ్‌స్టాక్ నిర్వహణ, పశు వ్యాధుల నివారణలో శిక్షణ కార్యక్రమానికి ప్రభుత్వం యిటీవలనే మంజూరి యిచ్చింది. అలాగే కోళ్ళ పెంపకం ఆఫీసర్ల శిక్షణకు కూడ అవకాశం కల్పించబడింది.

ఈ కార్యక్రమాలన్నిటినీ ప్రజలకు తెలియరావడానికి అప్పుడప్పుడు రాష్ట్ర స్థాయిలో, జిల్లా స్థాయిలో పశు ప్రదర్శనలు ఏర్పాటు చేయబడుతున్నవి.

ప్రపంచంలో సంఖ్యాబలంలో ఎక్కువ పశువులున్న మన దేశంలో సాధారణంగా పశుపోషణ విషయం శ్రద్ధ తీసుకోబడదు. ఫలితంగా తక్కువ పశువులున్న ఇంగ్లండ్, అమెరికా, న్యూజిలాండ్‌లలో ఎక్కువ పాలు లభిస్తుంటే మనదేశంలో "పశువులెక్కువ—పాలు తక్కువ" అవుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో పశువుల సంఖ్య మరీ ఎక్కువ. దేశంలోకెల్లా భారీ పరిమాణం గల ఒంగోలు జాతి ఎద్దులు, చిన్న ప్రమాణంలోని పుంగనూరు ఆవులు మన రాష్ట్రంలో ఉన్నవి. ఇవి మొత్తం దేశంలోనే గాక అంతర్జాతీయంగా కూడ ప్రసిద్ధిగాంచినవి. అలాంటప్పుడు పశువుల సంఖ్యాబలాన్ని గాక వాటి స్వభావాన్ని పెంపొందింపజేయడానికి తగు ఏర్పాట్లు జరగడం చాల అవసరం. ఒక ఆవు, బఱ్ఱె ఎక్కువ పాలిచ్చేటట్లు దోహదం చేయాలి. ఇందుకు పశు సంవర్ధక శాఖ చేస్తున్న కృషి ప్రశంసనీయం. అయితే దీని నుండి రైతాంగంలో చాల తక్కువ మందే యిప్పుడు ప్రయోజనాన్ని పొందుతున్నారు. ఇంకా యితోధికంగా రైతులు ప్రభుత్వ కృషిని సద్వినియోగం చేస్తే మన రాష్ట్రంలో పశు జాతి అభివృద్ధి చెందగలదనడంలో సందేహం లేదు



# చిన్నయ్య జీవితము

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

చాత్తాద వైష్ణవులకే తెలుఁగులో 'సాతాని' వారని వ్యవహారము. ఆ వంశములో మనకు తెలిసిన మహావ్యక్తి పరవస్తు వేంకటరంగ రామానుజాచార్యులు. ఆయనకు వేంకట రంగయ్య అన్నది వ్యవహార నామము. ఆయన భార్యపేరు శ్రీనివాసమ్మ. చెన్నపురిలో తిరువల్లిక్కేణి రామానుజకూటము వీధిలో ఆ దంపతులు నివసించెడివారఁట. ఈ కథ పదునేడవ శతాబ్ది లోనిది. మంత్రములను మంత్రార్థములను బోధించుచు పంచసంస్కారములను గావించుటలో వేంకటరంగయ్యకున్న ప్రతిభకు పరిజ్ఞానమునకు మెచ్చుకొని, అప్పటి వైష్ణవులలోని పెద్దలు ఆ కుటుంబమును శ్రీ పెరుంబూదూరు పట్టణమునకుఁ దీసికొనిపోయి వారికిఁగావలసిన వసతులు చక్కఁగా ఏర్పఱిచిరి.

శ్రీ పెరుంబూదూరు రామానుజులవారి జన్మవాసమైన పట్టణము. అక్కడి కోవెలలో వేంకట రంగయ్యను ద్రవిడ వేద పారాయణాధ్యాపక పదవిలో నియమించిరి సంస్కృత ప్రాకృత ద్రావిడాంధ్రములలో వేంకటరంగయ్యకు విశేష పాండిత్యమున్నదఁట. ఆ పైని ధర్మశాస్త్రనిష్ణాతుఁడని పేరు ప్రతిష్ఠలు గడించుటచే . అక్కడి అగ్రహారములోని విద్యాశాలలో ఆచార్యకము వహించెను. ఆయన నివాసమిదిగోనని ఇప్పటికిని ఆ పట్టణమున పదిమంది చెప్పుకొందురఁట.

అప్పటికి వారికున్న ఒక్క కొమార్తయు వితంతువగుటచే సంతాన విషయమై ఆ దంపతులకున్న చింత కంతులేదు. ఎన్నో నోములు నోఁచిరి. వ్రతము లాచరించిరి. పుత్త్రకామేష్టివంటి ఒకానొక హోమము జరిపిరి. తత్పుణ్యవిశేషమున శ్రీనివాసాంబ గర్భము దాల్చెను. పది మాసములు గడచిన పిదప ప్రభవ నామ సంవత్సరములో రేవతీ చతుర్థ పాదములో 1806వ యేట మగ బిడ్డ పుట్టెను. అతఁడే మన చిన్నయ్య. ఆతని కుడికంటిలో కనీనిక కొంచెము స్థలము మాఱియుండెనఁట.

కానికి కన్న సంతానము కావున ఆ తల్లి దండ్రులా బిడ్డను అల్లారుముద్దుగా ఆదరించుచు ఆనందములో మునిఁగిపోయిరి. గారాబము పెరిఁగి పిల్లవాఁడెమగుచుండెనేగాని చదువుసంధ్యలు మందునకైన ఆతని కంటలేదు. పదునాఱేండ్ల ప్రాయము చాలబడునందాఁక చిన్నయ్యకు చదువులో చాలవయే లేదు. పండువులకు పబ్బములకు ఆయింటి కీయింటికి అమ్మవెంటఁ బోవుచు పాటలు పాడుచు ఆటలాడుచు కాలము గడపెనఁట.

ఒకనాఁడు. వేంకటరంగయ్య మిత్త్రులొకరు కంచిరామానుజాచార్యులు ఆయింటికి వచ్చి ఏవేవో ముచ్చటించు కొనుచుండఁగా వీధిలోనుండి చిన్నయ్య ఒక్కదూఁకున లోనికి వచ్చెనఁట ఆ ధోరణి కేపగించుకొని, ఈతఁడెవ్వఁడని ఆమిత్త్రుఁడు ప్రశ్నింపఁగా వేంకటరంగయ్య చిన్నబోయి తన బిడ్డయేయని బంకుచు పలికి ఆతనిచే ఆచార్యుల కభివందనము చేయించెనఁట. అయ్యోయని ఆచార్యులు విచారపడి చిన్నయ్యను దగ్గఱకుఁ దీసికొని, బాబూ! మీ నాయనగారు విద్యావయోవృద్ధులు. వీరి సన్నిధిలో మాపిల్లలెందఱో చదువులు చదివిరి, వీరి సాహచర్యమువలన ఎన్నెన్నో విశేషములను మేముకూడ గ్రహింతుము. పనివానికడుపునఁ దిమవాఁడు పుట్టినట్లు ఈ మహాపండితునకు బిడ్డవైతివా బాబూ! నాలుగు ముక్కలు దొక్కకంటనిది నిన్నెవ్వరు మెత్తురయ్యా! ఎందులకయ్యా నీజన్మమని చీవాట్లుపెట్టి నిగ్గఁదీసెనఁట. ఆదెబ్బతో చిన్నయ్య సిగ్గుపడి తలవంచి నిశ్చేష్టుఁడయి కాలుసేతులు కంపమెత్తుకొని కన్నీరు మున్నీరుగా ఏడ్చుచు, ఇఁకతప్పక చదువుకొందునని పలికెను. ఆచార్యులవారి మందలింపులు చిన్నయ్యలో చిద్విలాసముగాఁ బనిచేసెను,

చిన్నయ్య ఆనాఁడే అక్షరాలు దిద్దుకోవలెనని ముచ్చటపడి తండ్రిని బలవంతపెట్టెను. తండ్రియు సరేయని యుత్తరమువ్రాసి శ్రీనివాసాచార్యుల వద్దకు పిల్లవానిని బంపెను. ఆచార్యులు పిల్ల

వానిని జూచి యుత్తరము చదివి పెదవివిఱిచి, ఓహో! నీకు చదువుకావలెనా! ఈ మాటనమ్మలేనని యీసడించెను. స్వామీ! తప్పక చదువుకొందును; మీమాట గట్టిగావిందునని చేతుల మోడ్చి చిన్నయ్యపలికెను. వల్లెయని యాచార్యులప్పుడే ఆతనికి ఇసుకలో 'ఓనమాలు' వ్రాసి దిద్దుకొమ్మని హెచ్చరించెను. అవ్వంటము తొక్కసారి దిద్దెనో లేదో అప్పుడప్పుడే ఆతఁడా యక్షరములను స్వయముగా వ్రాసి చూపెను దానికాచార్యులు ముచ్చటపడి అచ్చులు వ్రాసియిచ్చెను. భోజనము వేళకు వానిని సైతము వ్రాసి చూపెను. ఆచార్యులు ఆశ్చర్యపడి చిన్నయ్య మహామేధావియై ఏకసంథా గ్రాహి కాఁగలఁడని విశ్వసించి క్రమక్రమముగ గుణింతము గణితము లోనగునవి చక్కఁగా బోధించెను.

చిన్నయ్య త్వరలోనే బాలరామాయణము పఠించెను. అమరము వల్లించెను. శబ్దములప్పగించెను. ఆంధ్రనామ సంగ్రహము చదివెను, పిల్లవానికి చదువుచక్కఁగా అంటుచున్నదని వేంకట రంగయ్యకు వార్త వచ్చె. సందేహముతీరక బిడ్డను బిలిచి అవియు నివియు ప్రశ్నింపఁగా పద్యములు శ్లోకములు చక్కఁగా వినిపించెను. తండ్రియానందపడి, నాయనా! పుస్తకాలు లేవుగదా! ఈ పద్యములెట్లు వచ్చినవయ్యా! అని యడిగెను ఛాత్రులు సహాధ్యాయుల వద్ద పుస్తకములు తెచ్చుకొని కోవెలలో దీపముమెలుఁగునఁ జదువుకొందుననియు పగలు వారి పుస్తకములను వారికే యిత్తుననియు చిన్నయ్యచెప్పెను. బిడ్డయభినివేశమునకు తండ్రి యాశ్చర్యపడి వానికిఁ గావలసిన పుస్తకములు తెప్పించి యిచ్చుచు వాని విద్యా వ్యాసంగమునకు ప్రోత్సాహము కావించెను. ప్రాథమిక విద్యను త్వరలో ముగించుకొని ఉన్నతవిద్యనాతఁడు తండ్రి యొద్దనే శ్రద్ధగా నేర్చెను.

అది 'ఈస్టిండియా కంపెనీ' పరిపాలనము భారతీయుల సంప్రదాయము లెఱుఁగని ఆంగ్లపుత్రులే అప్పుడీదేశములో న్యాయాధిపతులుగా నుండిరి, న్యాయసభలో న్యాయనిర్ణయము సేయవలె నన్న విజాతికి దురవగాహమగుటచే దేశములోని పండితులను గొందఱను, న్యాయాధిపతులకు సాయముగా నియమింపసాగిరి

చెన్నపురిలోని యున్నతన్యాయసభలో ఆ యుద్యోగమునకై వేంకటరంగయ్యను బిలిచిరి, దానికోసమై ఆకుటుంబము చెన్నపురము చేరెను.

అక్కడ చిన్నయ్య, తండ్రిగారివద్దనే సంస్కృత ప్రాకృత శాంధ్ర ద్రావిడములను కూలంకషముగా నేర్చెను. వ్యాకరణ శాస్త్రమభ్యసించెను. కంచి రామానుజాచార్యుల సన్నిధిలో తర్కాలంకారమీమాంసలను క్షుణ్ణముగా పఠించెను. శ్రీ రామశాస్త్రుల వలన వేదమును వేదార్థమును గ్రహించెను ఆశాస్త్రివర్యుఁడు చిన్నయ్యశేముషీవైభవమునకు విద్యావినయ సంపదకు మిక్కిలిగా మెచ్చుకొని ప్రియశిష్యునిగా ఆదరించి హయగ్రీవమంత్ర ముపదేశించెను. స్వయంకృషిచే చిన్నయ్య ఆంగ్లముకూడ నేర్చుకొనెను. హయగ్రీవమంత్ర ప్రభావమునఁజేసి చిన్నయ్య, సర్వతోముఖపాండిత్యము కుదిరి సరస్వతీమూర్తియై నలువురిలో రాణింపఁ జొచ్చెను. అప్పటికి విద్వద్వరిష్ఠుఁడైన ఆ తనయునిపేరు ప్రఖ్యాతులు గుర్తించిన వేంకటరంగయ్య, తన జన్మము ధన్యమయ్యెనని పరమానంద మందెను. చెన్నపురిలో సర్వపండిత సభలలో ఆతండ్రి కొడుకుల పాండిత్య ప్రతిభలు మిక్కిలిగా చెప్పుకొనెడివారు. అధికారులయు ననధికారులయు మెప్పును మిక్కిలిగాఁ బడసిన వేంకట రంగయ్య నూటపది సంవత్సరముల వయస్సులో స్వర్గస్థుఁడయ్యెను

అప్పటికి చిన్నయ్య ముప్పదియేండ్ల వయస్సువాఁడు తండ్రిని మించిన పండితుఁడై విశేషించి తెలుఁగులో కృషిచేసిన చిన్నయ్యను చెన్నపురిలో గౌరవింపని పండితుఁడేలేఁడు. వేదము వేంకటరమణ శాస్త్రిగారికి చిన్నయ్య సహాధ్యాయి. తర్కవ్యాకరణ వ్యాసంగములో చిన్నయ్యచూపెడి నేర్పునకు వేంకటరమణశాస్త్రి గారెంతో సంబరపడి మిక్కిలి యభిమానము చూపెడివారఁట, ఆ శాస్త్రిగారే మనమెఱిఁగిన వేంకటరాయ శాస్త్రిగారికి జనకులు, పంచాంగము తేపప్పెరుమాళ్లయ్య చిన్నయ్యకడనే చదివి మహాపండితుఁడాయెను ఆయనయే ఆంధ్రవిశ్వగుణాదర్శకర్త. ఆయనకు శిష్యుఁడు తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య. ఈ విద్వాంసునకు దేవరాజసుధియని నామాంతరమున్నది. చిన్నతనములో నీతనికి 'చిన్నయ్య' యని సైతము వ్యావహారిక నామము కలఁదట చిన్నయ్య కీతడు ప్రశిష్యుఁడు. అనఁగా—పంచాంగము పెరుమాళ్లయ్య సన్నిధిని తంజనగరము పెరుమాళ్లయ్య . కావ్య నాటకాదులు సంస్కృతాంధ్ర వ్యాకరణములు పఠించెనన్నమాట ఇఁక శబ్దరత్నాకరకర్తలు 'బహుజనపల్లి' వారు చిన్నయ్యకు శిష్య రత్నమే గదా!

తండ్రి, పరమపదించిన పిదప చిన్నయ్యకు సంసారభారము మీఁదఁబడెను. ఏదో యుద్యోగమొకటి చూచుకొన వలసివచ్చెను. మున్మొదట 'మిషన్ పాఠశాలలో' ఉపాధ్యాయుఁడుగా కుదిరెను.

సంస్కృత ప్రాకృతాంధ్ర ద్రావిడములందలి పాండత్యముతోపాటు ఆంగ్లభాషలో సైతము ప్రవేశముండుటచేసి ఆయనవద్ద అప్పటి పాదరీలు–ఆంగ్లేయోద్యోగులు–బ్రౌన్ మున్నగు విద్యాధికులు అనేకులు పాఠములు చదువుకొనెడివారు. చిన్నయ్య కీర్తిచంద్రికలు చెన్నపురిలో నలుమొగాల వ్యాపించెను. చెన్నపురిలో అప్పుడు రాజకీయ నాయకులందఱు తెలుఁగువారే. వారిలో గాజుల లక్ష్మీనృసింహముసెట్టివంటి ప్రముఖులకు చిన్నయ్య అన్న పెద్ద అభిమానముండెడిది. మున్ముందట గ్రంథ రచనోద్యమములో చిన్నయ్యకు చేయూఁత నిచ్చినది లక్ష్మీనృసింహముసెట్టియఁట. విక్టోరియా రాణి పట్టాభిషేక సందర్భమున చెన్నపురిలో మహాసభ యొకటి జరిగెను. ఆ సభలో మహారాజ్ఞీ మకుటాభిషేక మహోత్సవ పర్యరత్నములను పేర చిన్నయ్య తొమ్మిది పద్యములను వ్రాసి చదివెను ఆ ఘట్టములో పురప్రముఖులాతని నెంతో మెచ్చుకొనిరి. అతని వయస్సుతోపాటు పాండితీ ప్రకర్ష–పేరు ప్రఖ్యాతులు పెరిగి పదిమందికిఁ దెలియసాగెను. అతని శరీర సౌందర్యముతో పాటు చేతివ్రాలు సైతము అందమును గ్రుమ్మరించుచుండునని చెప్పుకొందురు. అందమైన యాదేహమునకు తోడు సుందరమైన దుస్తులను దాలిచి అతఁడు పాండిత్య సౌందర్యమును మఱింతగా పెంచుకొనెను. ఉపన్యాసఘట్టములోఁగాని, కావ్యపఠనములోఁగాని, అతని కంఠధ్వని అత్యంత శ్రావ్యమై శ్లాఘ్యమై యుండెడిదఁట.

ఆరోజులలో పచ్చయప్ప మొదలియారను మహావదాన్యుఁడు తాను గడించిన ధనముతో విద్యాలయములు స్థాపించి దేశమునకిచ్చిపోయెను. చెన్నపురిలో నేఁడు మనమువినుచున్న 'పచ్చయప్ప కళాశాల' ఆయన నెలకొల్పిన విద్యా సంస్థయే ఆయన యనంతర మాసంస్థలు చక్కఁగా నిర్వహింపవలెనని పరిపాలక వర్గము ఏర్పడెను. అప్పుడా వర్గమున కధ్యక్షుఁడుగా శ్రీనివాస పిళ్లెయను ప్రముఖు నెన్నుకొనిరి. అతఁడు చిన్నయ్య ప్రఖ్యాతి లెస్సగా గుర్తించి తన యాధ్వర్యములో నున్న పచ్చయప్ప పాఠశాలలో పండితుఁడుగా అతనిని నియమించెను. చిన్నయ్య నాలుగేండ్లు ఆ పదవిలోనుండి ఏఁటేఁటను వార్షికోత్సవ సభలలో పచ్చయప్ప యశోమండనమను పేర సంస్కృతాంధ్రములలో పద్యములను వ్రాసి పారితోషికముల నందుకొనెడివాఁడు.

ఆంగ్లేయభాషా ప్రాభవమువలన ఈ దేశములో దేశ్యభాషలు నన్నగిలి పోవుచున్నవని అప్పటి రాజకీయవేత్తలు కొందఱు గుర్తించి ఆందోళన మొనర్పసాగిరి. దానిఫలితముగా ఆంగ్లమున కంగభాషగా విద్యాశాలలో దేశ్యభాషలు వెలయఁజొచ్చెను. నేఁడు మద్రాసులో పేరుమోసియున్న రాజధాని కళాశాల–అనాఁడొక యున్నత పాఠశాలగా పిలువఁబడు చుండెడిది. ఆ సంస్థలో ఇద్దఱు పండితులు కావలసివచ్చిరి. విశ్వవిద్యాలయ కార్యదర్శియైన ఏ జే. అర్బత్తునాటుదొర. పండితసభ నేర్పఱిచి మువ్వురు మహావిద్వాంసుల పెత్తనములో పోటీ పరీక్ష పెట్టించెనఁట. ఆ పదవికి పెక్కురు పండితులు అభ్యర్థులుగా నిలచిరి. వారిలో చిన్నయ్య ఒకఁడు పరీక్షకులు మూవురు, వచ్చినవారి నెల్లరను బరీక్షించి వారిలో చిన్నయ్యనే ప్రథమ గణ్యుఁడుగా ఏకగ్రీవముగ ఎన్నికచేసిరి. రెండవ పండితుఁడుగా పురాణము హయగ్రీవ శాస్త్రిగారిని నిర్ణయించిరి. అయనయే మున్ముందట ఆంధ్రభాగవతమును ముద్రింపించినవారు. అపరీక్షలో జయమందిన ఆ యిరువురు పండితులు ఆ విద్యాశాలలోని యుద్యోగములో నిర్ణీతులైరి. అందు చిన్నయ్య ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు; హయగ్రీవశాస్త్రులు సహాయోపాధ్యాయులు.

అర్బత్తునాటుదొరకు పండితులనఁగా పెద్ద యభిమానముఁట. అతఁడా విద్యాశాలకు కార్యదర్శియేగాక చెన్ననగర రాజధానికంతకు విద్యాధికారిగ సైతముండెను. విద్యావిషయమున అతని పలుకుబడి పెద్దగానుండెడిది. విద్యాధికులకేదేని బిరుద ముండుననియు 'శాస్త్రి–పండిత' ఇత్యాదులట్టివనియు చిన్నయ్యకు బిరుదములేదనియు ఆ దొరకు తోఁచినది. పండిత మండలికే తలమానికమైన చిన్నయ్యకు ఇంతపాండిత్యమున్నను బిరుదము లేకుండుట విశ్వవిద్యాలయమునకే తలవంపని ఆ విద్యాధికారి భావించి చెన్నపురిలో పండితులనేకులను సమావేశపఱిచి చిన్నయ్య బిరుదమును గూర్చి ప్రస్తావించెను. పండితులందఱు పరిశీలించి యేకగ్రీవముగ 'సూరి' యను బిరుదమును నిర్ణయించిరి. ఆ నిర్ణయము ప్రకార మా విద్యాధికారి 'చిన్నయసూరి'యని బంగారుకడియమును సీమలోచెక్కించి దొరతనమువారి యాజమాన్యమున చెన్నపురికిఁ దెప్పించి పండిత గోష్ఠిలో చిన్నయ్యకు బహూకరించెను. ఆ గోష్ఠిలో పండితులనేకులు చిన్నయ్యను సూరివర్యుఁడని వేనోళ్లఁగొండాడుచు ముచ్చటించిరఁట. నాఁడు మొదలు చిన్నయ్య 'చిన్నయసూరి' యను పేర ప్రసిద్ధి పొందెను.

పదునాఱేండ్లవఱకు అక్షరజ్ఞానమేలేక పదునాలుగేండ్లలో సర్వవిద్యావిశారదుఁడై, ముప్పదవయేఁట ఉద్యోగములోజేరి నలువదేండ్ల వయస్సులో పండితుల నెల్లరకు తలమానికమై చిన్నయ్య చిన్నయసూరి యాయెను. చెన్ననగరములో చిన్నయసూరి

గడించిన ఈ ప్రఖ్యాతి కొందఱకీర్ష్య కలిగింపకపోలేదు. పండిత పరీక్షలో ప్రథమ గణ్యుఁడుగా చాత్తాదవైష్ణవుఁడు నెగ్గుట— ఇతరులకందఁగారాని ప్రధాన పండిత పదవి అతనికి దక్కుట ఆపైని సూరియనుబిరుదముతో రాణించుట, ఇవి యన్నియు ఇతరులు మాపెడి ఈర్ష్యకు కారణములాయెను. ఈ యీర్ష్యయే పెరిఁగి చిన్నయసూరి నెట్లయినను సభలో నోడింపవలెనని కొందఱు పన్నాగము పన్నిరి. ఈ పన్నుగడకు మూలపురుషుఁడు రంగనాథ శాస్త్రులు. ఆయన ఆనాఁడు స్మాల్ కాజ్ కోర్టులో న్యాయాధికారి. ఆయనకు సంస్కృత సాహిత్యమందే కాక సర్వశాస్త్రములందును ప్రావీణ్యము కలదఁట. ఆపైని పదునైదు భాషలలో ఆరితేరిన మహాపండితుఁడఁట. ఆయన పౌత్రుఁడే 'హైకోర్టు జడ్జిగా' పేరు మోసిన కుమారస్వామి శాస్త్రిగారు.

రంగనాథ—హయగ్రీవ శాస్త్రుల ఇండ్లు ఒకే వీధిలో నుండుటచే పరస్పర పరిచయమేర్పడెను. హయగ్రీవ శాస్త్రిగారన్న రంగనాథ శాస్త్రిగారి కమితమైన యభిమానము. రంగనాథశాస్త్రి గారియెడ హయగ్రీవ శాస్త్రిగారి కెంతో గౌరవము ఈ గౌరవాభిమానము లాయిరువురకు గాఢానుబంధము కలిగించినవి. ఈ యనుబంధము మూలమున రంగనాథ శాస్త్రులు తన పలుకుబడిని వినియోగించి హయగ్రీవశాస్త్రులను ప్రధానాంధ్ర పండితులనుగాఁ జేయను సంకల్పించిరి. మాటలధోరణిలో ఈ సంకల్పమును ఆ న్యాయాధిపతి ఈ పండితునకు వినిపించెను. దానికి హయగ్రీవ శాస్త్రి లంగీకరింపక తనకన్నను పెక్కుమంది పండితులకన్నను చిన్నయసూరియే మహా పండితుఁడనియు — ఆ పదవి యన్ని విధాల అతనికే అర్హతమనియు ఈ సంకల్పమునకు కృతజ్ఞుఁడనియు—ఆపదవి అతని ప్రోలఁదనకు రావలెనని ఊహింపను సహింపననియు విప్పిచెప్పి సూరి పాండితీ వైభవము గుర్తింపను సమావేశమొకటి చేయింపఁగోరెను.

సమావేశమున కొక ఆదివారము నిర్ణయించిరి. ముందుగా సమావేశమన్నమాట చెప్పక హయగ్రీవ శాస్త్రులు సూరిని వెంటఁబెట్టుకొని రంగనాథ శాస్త్రుల యింటికిఁబోయెను. అది మధ్యాహ్నము మూఁడుగంటలవేళ కుశల ప్రశ్నములు ముగిసినవి. మాటయుమంతియు జరిగినది. అది పండిత సమావేశముగాఁ బరిణమించెను. దాని కధ్యక్షులు రంగనాథశాస్త్రులు. చిన్నయసూరి శబ్దశాస్త్రపారంగతుఁడేగాని అలంకారశాస్త్ర మెఱుఁగఁడని అధ్యక్షుఁడు భ్రమపడి అలంకారశాస్త్రమును గూర్చి ఉపన్యసింపుఁడని సూరిని గోరెను.

సరిగా మూఁడింటికి చిన్నయసూరి ఉపన్యసింపసాగెను.

అలంకార శాస్త్రములో ప్రాథమికసూత్రము మొదలుకొని తుదివఱకు ఖండనమండనములను లక్ష్యలక్షణములను సలక్షణముగ మధురమైనవాగ్ధోరణితో వివరించుచుండఁగా అదియొకగంగాప్రవంతియై దిగ్భ్రమగొల్పఁగా ఆసభలో నోలలాడుచు సభ్యులెల్లరు పారవశ్యముపొందిరి. ఆ సుట్టములో ఆ పూర్వాంశము లెన్నింటినో ఆ పండితులు గ్రహింపఁజొచ్చిరి. అప్పటికి ఎంత వేళ అయెనో ఎవరికిని తెలియదాయె. సంధ్యావందనసమయము దాటిపోయె. పరిచారికవచ్చి దీపమువెలిగించెను ఉపన్యాసము— అవిచ్ఛిన్నముగా సాగుచుయున్నది. వినువారికి వినువుమాటలేని మాట యటుంచి తనివితీఱక తలలెత్తి చెవులు నిక్కించి అదే ధోరణిలో మునిఁగిపోయిరి. భోజన వేళ సైతము దాఁటిపోయెనని సూపకారుఁడు వచ్చి నివేదింపఁగా సభాధ్యక్షులు రంగనాధశాస్త్రులు నివ్వెఱవోయి సభామధ్యములో లేచి అయ్యా! నేఁటికీసభచాలింతము. మధ్యాహ్నము మూఁడింటికిముందు సూరిగారివిషయమై నాకున్నయభిప్రాయమంతయు అక్షరాలతప్పని ఒప్పుకొందును. చిన్నయసూరివర్యులు విద్వద్వరేణ్యులన్నమాట నేఁటికి నాకర్థమయినది. అయ్యా! సూరివర్యా! ఇది మొదలు తాము కూడ హయగ్రీవులతో పాటు మా యింటికి వచ్చి మమ్ముల నీతీరుగ ఆనందింపఁజేయవలసినదని కోరుచు— అంత్యోపన్యాసముగా అభినందించుచు సమావేశము ముగింపజేసిరి.

నాఁటినుండియు చెన్నపట్టణములోనున్న పండితులందఱకు చిన్నయ్యసూరి యెడ గౌరవముపెరిఁగెను. ఆ పట్టణములో భాషా విషయకోపన్యాసములు జరుగుచున్నవనఁగా అందు చిన్నయసూరి యుండవలసినదే. నాఁటి యాంగ్లేయపరిపాలనములో పాశ్చాత్యవిజ్ఞానముగల భారతీయోద్యోగులనేకులు చిన్నయసూరికి మిత్రులై యుండిరి. స్వసంఘసమావేశములు కావించుచు విశిష్టాద్వైతమును బోధించుచు సంఘోద్ధరణకు సైతము ఎంతో పాటుపడెను.

మద్రాసు విశ్వవిద్యాలయము స్థాపించి ఇప్పటికి నూట నాలుగేండ్లు గడచినవి. నేఁటి 'రాజధానీ కళాశాలయే' మొత్తము రాజధానిలో మొదటి కళాశాల. అప్పటికి పదేండ్లుగా ఆ సంస్థలో పనిచేయుచున్న చిన్నయసూరియే మదరాసు విశ్వవిద్యాలయమందు మున్మొదటి ప్రధానాంధ్ర పండితుఁడాయెను. దురవగాహములైన సర్వశాస్త్రములందును సాంగోపాంగముగ వ్యాసంగము కావించి, శాస్త్రవేత్తయై సాహిత్య చక్రవర్తియై

శేముషీమూర్తిగా ప్రఖ్యాతుండై సుగర్వచూడామణియై కవియై ఉద్యోగియై ఖ్యాతిగాంచిన చిన్నయసూరివంటి వ్యక్తులు అర్వాచీనులలోఁ గానరారు.

శ్రీ వేంకటరంగయ్య నూటపదేండ్లు బ్రదికియుండఁగా చిన్నయ్య ఏబదియైదేండ్లకే రాచకురుపువలన భౌతికముగా గతించెను. ఆయన బ్రతికిన ఏబది యైదేండ్లలో అద్భుతముగా ఇరువది యయిదేండ్లు స్వచ్ఛమైన స్వర్ణయుగమువంటి దనవచ్చును. ప్రౌఢ విద్య మొదలు బ్రహ్మవిద్య వరకు పదునాలుగేండ్లలోనే వ్యాసంగముచేసి మహా పండితుండయ్యెననఁగా – ఆ మహా ప్రజ్ఞను మన కొలతలతో కొలిచి నిర్ణయింపను వీలులేదు. మొదటి కారణము ఆ తల్లి దండ్రులు చేసికొన్న పుణ్య విశేషము. ఆ పైని పుత్రకామేష్టి వంటి హోమము చేసిరట. ఆ హోమమునకు ఆహుతులను వేల్చి పాయసము సిద్ధపఱచిరఁట. జలపూర్ణమైన తామ్రకుంభముమీఁద కలశముపెట్టి మామిడిరెమ్మలు దర్భకుర్చములు నారికేళములు పదిల పఱిచి కుంభమున పూర్ణపుంద్రములు చూఁడి ఆరతియిచ్చి. తల్లి తనముఖారవిందము అందు ప్రతిబింబించునట్లు చూచెనఁట. ఆ పుణ్యదంపతులు చేసిన క్రతు పట్టిది. ఆ బిడ్డ కుడి కంటిలోని కనీనిక స్థలము మారియుండుట పూర్ణకుంభము తల్లిని చాయ ప్రతిబింబించియున్నదనుటకు చిహ్నమని వైష్ణవులలో పెద్దలు పదేపదే ముచ్చటించెడివారఁట. అది యేమైనఁ గానిండు శ్రీనివాసాంశ గర్భశుక్తి ముక్తాఫలాయమానుఁడైన చిన్నయసూరి, ఏకసంథాగ్రాహి యగుటలో ఆశ్చర్యములేదు. ఆతని సర్వపాండిత్య ప్రకర్షకు హయగ్రీవ మంత్రోపాసనమే ప్రధానకారణము ఇది ఆతని దివ్య జీవిత సంగ్రహ గాథ.



ఒకరు నిదురింప నొకరు మేలుకొను చుండి,

ఒకరి హృదయాన నొక రాగుచుండి, మనము

క్రాంతిజీవన సర్వస్వ కందుకమ్ము

నందుకొని మీటి యాడుకొందము జగాన,

భీమన్న 'మధుగీత'

# అరకు లోయలో జరుగుతున్న కృషి

శ్రీ తుర్లపాటి వెంకట కుటుంబరావు

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను తిలకించే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల పత్రికా రచయితల పర్యటనను ఏర్పాటు చేసింది.

ఈ పర్యటనలో రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు చెందిన పత్రికా రచయితలు వున్నారు. ఈ బృందంలో సభ్యుడుగా రాష్ట్రంలోని కొన్ని అభివృద్ధి కార్యక్రమాలను పరిశీలించే అవకాశం నాకు కలిగింది.

ముఖ్యంగా అరకు లోయలో గిరిజనుల అభివృద్ధికి అజ్ఞాతంగా జరుగుతున్న అత్యద్భుతమైన కృషి ఎవరికైనా అచ్చెరువు కలిగించక మానదు.

అరకులోయ అంటే ఇదివరకు మలేరియాకు మాత్రమే పేరు. కాని, ఆ లోయ అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమం పూర్తి అయిననాడు దాని ప్రస్తుత స్వరూపమే పూర్తిగా మారిపోతుంది.

అరకులోయ విశాఖపట్నానికి 72 మైళ్ళ దూరంలో వున్నది విశాఖపట్నం నుంచి కొత్త వలస, శృంగవరపు కోటల మీదుగా అరకులోయకు చక్కని రోడ్డు వున్నది,

శృంగవరపు కోట నుంచి అరకులోయకు వెళ్ళే దారి చాలా మనోహరంగా వుంటుంది. ఇందులో 32 మైళ్లు కేవలం కొండల పైకే ప్రయాణం చేయాలి. రోడ్డు కిరుప్రక్కల దట్టమైన అడవులు, వాగులు, సెలయేళ్ళు, జలపాతాలు, పాతాళంలోకి తొంగి చూచే లోయలు—ఆ దృశ్యాలు చాలా రమణీయంగా వుంటాయి. కొన్ని చోట్ల కాశ్మీర్ ప్రకృతి సౌందర్యం తలంపునకు వస్తుంది. కారు అడుగడుగుకు మలుపులు తిరుగుతూ క్రమక్రమంగా సముద్ర మట్టానికి నాలుగువేల అడుగులు పైకివెళ్ళే ఆదృశ్యాన్ని చూస్తూ వుంటే తిరుపతి కొండలను ఎక్కే దృశ్యాలు జ్ఞాపకానికి వస్తాయి

రమణీయమైన ప్రకృతి దృశ్యాల మధ్య 32 మైళ్లు ప్రయాణించిన తరువాత అరకులోయ చేరుకుంటాము. ఈ లోయలోనే గిరిజనుల అభివృద్ధికి కృషి జరుగుతున్నది,

ఆ కృషిని గురించి తెలిపే ముందు అరకులోయ పూర్వ చరిత్రను కొంత వివరించడం అవసరం,

## లోయ పూర్వ చరిత్ర

అరకులోయ మొదట్లో పాచిపెంట ఎస్టేటులో భాగంగా వుండేది. ఈ ఎస్టేటులోనే శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలోని ఏజెన్సీ ప్రాంతం చాలావరకు వుండేది. 1903 లో జయపూర్ మహారాజా ఈ ఏజెన్సీ భాగాన్ని రు. 5,60,000 లకు కొన్నారు. 1955 జూన్‌లో రాష్ట్రప్రభుత్వం ఎస్టేట్లను స్వాధీనం చేసుకునే కార్యక్రమంతో భాగంగా—దీన్ని కూడా స్వాధీనం చేసుకున్నది.

1944–45 వరకు ఈ లోయ సంగతి బాహ్య ప్రపంచానికి అంత బాగా తెలియదు. ఆ సంవత్సరంలో సైనికులకు కూరగాయలు పంపించడానికి స్థలం కావలసివచ్చినప్పుడు ఇది ప్రభుత్వ దృష్టిని ఆకర్షించింది. బంగాళా దుంపలు పండించడానికి ఇది అనువైన ప్రదేశమని భావించబడింది.

ముఖ్యంగా ఇక్కడ నివసించే గిరిజనుల అభివృద్ధి ఆవశ్యకత ప్రభుత్వ దృష్టిని ఆకర్షించింది.

ఇక్కడ సుమారు 34 వేల మంది గిరిజనులున్నారు. వీరిలో పందొమ్మిది జాతులున్నవి.

అరకులోయ వైశాల్యం 240 చదరపుమైళ్లు. 399 శివార్లతో 64 గ్రామాలు ఈ లోయలో వున్నవి.

ఇక్కడ నివసించే గిరిజనులకు తెలుగు, ఒరియా వచ్చు. బాహ్య ప్రపంచంతో సంబంధంలేని కొండల జీవితాన్ని గడుపుతున్నందున వీరికి ఆధునిక జీవితమంటే ఏమిటో తెలియదు.

వీరికి ప్రధానమైన వృత్తి వ్యవసాయమే. అయితే, ఆధునిక వ్యవసాయ విధానాలు వీరికి బొత్తిగా తెలియవు. అందులో ఆ కొండలలో నీటి పారుదల సౌకర్యం లభించడం కష్టం. అందువల్ల, చాలా కష్టం మీద వ్యవసాయం చేసి, ఆ పండిన వానితో నే సంతృప్తిపడడం వీరికి అలవాటైపోయింది.

పోతే—వీరికి ఇంతకు పూర్వం విద్యా, వైద్య సౌకర్యాలు బొత్తిగా లేవు. ఆకొండల పైకి మొన్న మొన్నటి వరకు కార్లు వెళ్లే పనేలేదుగదా! అందువల్ల, మొన్న మొన్నటి వరకు కారును చూస్తే ఈ గిరిజనులకు ఏదో అద్భుతాన్ని చూచినట్లు వుండేదట.

ఇప్పటికీ ఇంచుమించు అంతే. మాకారును చూచి కొందరు గిరిజన యువకులు భయపడి, చెట్ల చాటుకు పారిపోయే వారు.

ఇలాంటి అమాయకులను అభివృద్ధి చేయడానికి 1956 మార్చి నుంచి ప్రభుత్వం అరకులోయ జాతీయ విస్తరణ పథకం అమలు జరుపుతున్నది. 1956 అక్టోబరులో ఇది బహుళార్థ సాధక పథకంగా మార్చబడింది.

ఈ పథకం కింద మొత్తం పాచిపెంట ఎస్టేటువున్నది.

ప్రభుత్వం తలపెట్టిన పథకం మొత్తంఖర్చు 27 లక్షలు.

ఇక్కడి ప్రజలకు ముందు నీటి పారుదల సౌకర్యం కల్పించడం అవసరమని ప్రభుత్వం భావించింది. ఇందునిమిత్తం 47 మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులను తలపెట్టింది.

ఆ కొండల స్లోపులలో జాలు వారీ చిన్నచిన్న నీటి ప్రవాహాలకు ఆనకట్టలు కట్టి, నీరు నిల్వచేసి, చేలకు మళ్లిస్తున్నారు.

ఇలాంటి మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులలో మేము చూచిన ముండజోల ప్రాజెక్టు మాకు చాలా నచ్చింది.

ముండజోల అనే చిన్నవాగుకు ఆనకట్టకట్టి, పొలాలకు నీటిని సప్లయి చేస్తున్నారు. ఈ ప్రాజెక్టు కట్టడానికి 15 వేలు ఖర్చయిందట. దీనికింద 60 ఎకరాలు సాగవుతున్నవి.

అనాస, గోధుమ, కమలాఫలాలు, కాఫీ, వరి, చెరకు, నువ్వులు, ఆముదాలు, జొన్న, మొదలైనవి ఇక్కడ పండుతాయి.

ఇక్కడ జపాన్ వరిసాగు కూడా అమలులో వున్నదని తెలుసుకుని ఆశ్చర్యపడినాము. కొన్నిచోట్ల బంగాళా దుంపకూడా పండిస్తున్నారు.

భూమిని సాగులోనికి తీసుకరావడానికి కొందరు రైతులకు ప్రభుత్వం అప్పులిస్తున్నది. మేలిరకం విత్తులను సప్లయి చేస్తున్నది. ఆధునికమైన పద్ధతులలో ఎలా పండించాలో ఈ గిరిజనులకు వ్యవసాయ నిపుణులు బోధిస్తున్నారు.

### పట్టుపరిశ్రమ

అన్నిటికంటె ఆనందం కలిగించే విషయం ఈ గిరిజనులు పట్టుపురుగుల పరిశ్రమను బాగా అభివృద్ధి చేస్తున్నారు. ఈ పురుగుల కోసం కర్జూర చెట్లను పెంచుతున్నారు. ఈ పరిశ్రమవల్ల ఎకరానికి కనీసం అయిదువందల రూపాయలు లాభం తీయవచ్చునని గిరిజనులు మాతో చెప్పారు.

ఇక్కడ ఉత్తమ పశుగణాభివృద్ధిని ప్రభుత్వం ప్రోత్సాహిస్తున్నది. ఇందునిమిత్తం ముర్రా, సింధీజాతి ఎడ్లను ప్రభుత్వం గిరిజనులకు సప్లయి చేస్తున్నది.

ఒక గ్రామంలో ప్రసూతి, శిశుపోషణ కేంద్రాన్ని కూడా ప్రభుత్వం నెలకొల్పింది. మొదట్లో ఇక్కడికి కాన్పులకు రావడానికి గిరిజన స్త్రీలు సందేహించేవారట. కాని, ఇప్పుడు క్రమేణా వారు ఈ కేంద్రం ఆవశ్యకతను గుర్తిస్తున్నారు.

ఈ గిరిజనులకు కుండలు తయారుచేసుకోవడం తెలిసేది కాదు. అందువల్ల, 30 మైళ్ల దూరంలో మైదానంలోవున్న కాశీపట్నం అనే గ్రామానికివెళ్లి కుండలు తెచ్చుకునేవారట.

ఇప్పుడు ప్రభుత్వం వీరిలో కొందరికి కుండలు తయారుచేయడంలో శిక్షణ ఇప్పిస్తున్నది. శిక్షణ పొందినవారికి కుండలు చేసే సారెను ప్రభుత్వం ఇస్తున్నది. ఇందువల్ల, ప్రతిశిక్షణార్థి వాటివల్ల ఆరునుంచి ఏడురూపాయల వరకు సంపాదిస్తున్నాడు.

పోతే, ప్రతిగ్రామానికి ఒక కమ్యూనిటీ రేడియో సెట్టును కూడా ప్రభుత్వం బహూకరించింది. ప్రతిరోజు సాయంకాలం ఇక్కడ గ్రామస్తులు గుమికూడి వార్తలు వింటారు. అయితే, వార్తలను అర్థంచేసుకోగలిగిన స్థితికి వీరిలో చాలామంది రాలేదు. అందువల్ల, సుశిక్షితుడైన ఒక గ్రామసహాయక్ కాని, ఉపాధ్యాయుడుకాని వీరికి రేడియోలో వచ్చిన వార్తలకు అర్థం చెబుతాడు.

కొన్ని చోట్ల మంచినీటి సరఫరా ఏర్పాట్లకు ప్రభుత్వం సొమ్ము ఇచ్చింది.

గిరిజనులకు తీపి అంటే చాలా ఇష్టం. అందువల్ల, చాలాచోట్ల చెరకు పండిస్తున్నారు. గడచిన సంవత్సరం ఒకరైతు ఎకరాలో 40 టన్నుల చెరకును పండించాడు. ఇతడి పేరు కురిడీకుక్ర.

ఇక్కడ బాగా అభివృద్ధిలోకి వస్తున్న పంటలలో కాఫీ ఒకటి. ఇంకా కొంచెం శ్రద్ధ ప్రదర్శిస్తే, అరకులోయ కాఫీ పంటకు బాగా ప్రసిద్ధికెక్కగలదు.

## ఉచితంగా కిటికీల సప్లయి

ఈ గిరిజనుల ఇళ్లు గాలి, వెలుతురు రావడానికి వీలులేకుండా వుండేవి. ప్రభుత్వం ఈ విషయాన్ని గుర్తించి, గిరిజనులకు కిటికీలను ఉచితంగా సప్లయి చేస్తున్నది. ఇప్పుడు గిరిజనులందరు ఈ కిటికీలకోసం ప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తున్నారు.

చిత్తంగొంది అనేచోట వాగుకు ఆనకట్ట కట్టారు. దీనికి తొమ్మిదివేలు ఖర్చయింది. 132 ఎకరాలు ఈ ఆనకట్ట క్రింద సాగవుతున్నది.

గిరిజనుల ఇళ్లు తీరూతెన్నూ లేకుండా నిర్మించబడినవి. ఒక్కొక్కప్పుడు పరశురామ ప్రీతి అవుతూ వుంటాయి కూడా. తక్కువ ఖర్చుతో, అగ్ని ప్రమాదానికి లోనుకాకుండా వుండే ఆదర్శ గృహాల నిర్మాణం ఎలా వుండాలో చూపించే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం ఒక పథకాన్ని అమలు పరచ దలచుకున్నది.

ఇందునిమిత్తం పాత్తగూడ అనే గ్రామాన్ని ఎన్నుకున్నారు. ఒక నిర్ణీత పద్ధతిలో ఈ గ్రామంలో గృహనిర్మాణం జరుగుతున్నది. ఇక్కడ పద్నాలుగు జంటగృహాలు నిర్మించబడినవి. ఒక్కొక్క జంట గృహం నిర్మాణ వ్యయం మూడువేల రూపాయలు. ఇందులో వెయ్యి రూపాయలు ఆ జంట గృహాల యజమానులు భరించాలి. ఇక్కడ రూ. 2,435 ల ఖర్చుతో ప్రభుత్వం ఒక మంచినీటి బావిని కూడా త్రవ్వించింది.

గన్నెల అనే గ్రామంలో గురుకుల పద్ధతిలో ఒక పాఠశాల స్థాపించబడింది. ఇక్కడ విద్యార్థులకు ఉచిత భోజనవసతి సౌకర్యాలు కల్పించబడినవి. ఇక్కడి పాఠశాల భవన నిర్మాణానికి రూ. 43,500 ఖర్చుఅయింది. ఇక్కడి బాలబాలికలు చురుకుగాను, ఉత్సాహంగాను కనిపించారు. సుమతీశతకంలోని పద్యాలను ఎలాంటి ప్రమాద లేకుండా చక్కగా వినిపించారు. మైదానంలోని పిల్లలకు వీరు ఏమాత్రం తీసి పోరనిపించింది.

## సహకారోద్యమం

ఈ కొండ కోనలలో సహకారోద్యమం కూడా వ్యాపిస్తున్నదని విని చాలా సంతోషించాము.

సుంకరమెట్ట అనేచోట "ఏజెన్సీ" ఉత్పత్తులను సహకార మార్కెటింగ్ సొసైటీ అనే సంస్థ వున్నది. దీన్ని 1958 లో స్థాపించారు. ఇది గిరిజనులు ఉత్పత్తిచేసిన సరకులను కొని, వారికి కావలసిన వస్తువులను వారికి విక్రయిస్తున్నది. వారివద్ద కొన్నవస్తువులకు మార్కెటింగ్ సౌకర్యాలు కల్పిస్తున్నది. ఈ సహకార సంఘంలో 3,844 మంది సభ్యులున్నారు. ఇది ఇంత వరకు రైతులకు రూ. 66 వేలు అప్పువిచ్చింది. సభ్యులు ఉత్పత్తి చేసిన 68 వేల రూపాయల విలువగల వస్తువులను ఇదికొన్నది; లక్ష 60 వేల రూపాయల విలువగల సరకులను వారికి అమ్మింది.

కొన్ని గ్రామాలలో ప్రభుత్వం పశువైద్య శాలలను కూడా

ఏర్పాటు చేసింది. ఆసుపత్రులు కాని, రేడియో సెట్లుకాని, సహకార సంఘాలు కాని, మేము కొన్నింటిని మాత్రమే చూడగలిగాము. ఆ లోయలో, ఇంకా అనేకచోట్ల ఇవి నెలకొల్పబడినట్లు మాకు చెప్పబడింది.

ఇదంతా చూచినతరువాత మాకు ఒక అభిప్రాయం కలిగింది. బాహ్య ప్రపంచానికి ఎక్కువగా తెలియకుండా ఇక్కడ అజ్ఞాతంగా చాలా అద్భుతమైన కృషి జరుగుతున్నది.

ఒకప్పుడు—అయిదారు సంవత్సరాల క్రితం—బాహ్య ప్రపంచంతో ఏమీ సంబంధంలేకుండా, విద్య, వైద్యసౌకర్యాలు, మరె లాంటి సదుపాయాలు లేకుండా వున్న ఈ గిరిజనులు క్రమక్రమంగా ఆధునిక ప్రపంచంలోకి వస్తున్నారు. వారి జీవనస్థితిగతులు క్రమక్రమంగా అభివృద్ధి చెందుతున్నవి. అచిరకాలంలోనే వారు ఆధునిక జీవిత ప్రమాణాన్ని అందుకొనగలరన్న విశ్వాసం మాకు కలిగింది.

ఈ సందర్భంలో ప్రభుత్వోద్యోగులు—ముఖ్యంగా అరకులోయ అభివృద్ధి పథకం ఎక్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ శివాజీరావు—చేస్తున్నకృషి ప్రశంసనీయం.

ఎముకలు కొరుక్కుపోయే చలిలో, ఎలాంటి ఆధునిక సౌకర్యాలు లేని ఆ కొండ లోయలలో, ఆ గిరిజనులతో కలిసి మెలిసి పనిచేయడం కష్టంకదా, మరి!



# అమ్మ రావె గంగమ్మా!

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

పాఱవెయ్ పాఱవెయ్!
నడుముచుట్టు పాఱ త్రిప్పి
నఱికి నఱికి త్రవ్విపోయ్!

ఫెళ ఫెళా పలుగు వెయ్!
బలిమి మెఱసి పలుగు వెయ్!
కుదిపి కుదిపి కలచివెయ్!

పేరుకొన్న పేదఱికం
పెళ్లలను బెడ్డలను
పెల్లగించి కళ్లగించి
ఫెళా ఫెళా విఱిచివెయ్!

గంగమ్మిటు పాఱాలి!
కాలువలను త్రవ్వాలి!
గట్టుల కిటునటు పైరులు
కిళ కిళ లాడాలి!

గంగమ్మిటు పాఱాలి
గ్రామాలకు రావాలి!
చోచోయని దుక్కెద్దుల
సొల్పుగ నడపాలి!

అమ్మరావె! గంగమ్మా! నీ
అడుగులకును మడుగులొత్త
పడిగాపులు పడుచుంటిమి
అమ్మ రావె! గంగమ్మా!

# సూరి

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి

తెలుఁగు పెడారిలో నిసుకదిబ్బలురేఁగి మతాంతరమ్ములై
కళపెళమండి సోదరుల కంఠములం దెగటార్చువేళ- ను
జ్జ్వల కవితాసతీవిమల సాధుమృదూక్తుల నేర్చికూర్చి-వె
ల్గులు పచరించినావు జిగిలోబిగిలో నసమానవై సూరీ.

వందలువేలు గ్రంథములు వ్రాసినవారు తెలుంగు గడ్డపై
వందలువేలు—కొందరును వానిని చూడరయేనియేల యీ
చందములన్ని?—మేక మెడచన్నులు—నీకృతులి-తలంతలై
యుందముచిందె నెల్లెడలహో! కలదావలదా యదృష్టముల్.

జాతిమతాల దయ్యములజాతరలో తెలుఁగయ్యలెందరో
కోతకుఁజిక్కి-నారు-తెలుగుంబొలి మేరలలోన వింతగా
భూతములాపి క్రిందపయి ముందు పరీక్షలుచేసి యూరిలో
మోతలుచేసెనయ్య! యుసిరోయిఁక దేశము ముందుసాగునా?

లక్షణముల్ తెలుంగునను వ్రాసిరి పూజ్యులు వేనవేలు ప్ర
త్యక్షము-కాని యందొకటియైన విమర్శకునిల్పి పోల్చినన్
లక్షసువర్ణఖండముల రాశులుకొన్కలు- వేయి యేలనీ
లక్షణముల్ తెలుంగున విలక్షణముల్ కృతిలక్షణంబులే.

బ్రతికిననాఁడుమాత్రము రవంత విచారముచోపఁబోరు-దు
ర్గతులనుజూచి జాలిపడవారిఁక చచ్చిననాఁడు పెద్దగా
నుతులు-సభావిహారములు-నూత్నవికాసము లాదరమ్ములే
సతతము-తెల్గువారికిది జాడ్యమొ? మౌఢ్యమొ? లేక పీడ్యమో?

నీపాండిత్యము నీ కవిత్వకలనా నిర్మాణమున్ మెచ్చివి
ద్యా పారంగతుడైన "నాటు" దొరయింతం తైకళారాధనా
వ్యాపారుండయి "సూరి"యన్ బిరుదుతో నర్పించె వ్యాపించెనీ
నైపుణ్యాంబుజ సౌరభావళు లనంతక్షోణి విద్వత్కవీ!

శబ్దశాసన ముఖకవీశ్వర కవిత్వ
తత్వములు జాలువార పటుత్వమలర
"నీతిచంద్రిక"లో కాననిచ్చెనయ్య
తెలుఁగువారెంతగా మారి నిలువఁగలరో?

రంగుబంగారుగా గంగామహాదేవి
యెందాకయీ భూమియందుపఱచు!
తెలుఁగు వారలయింటి దేవుండుశ్రీరంగ
డెందాక లోకాల నేలుచుండు
ముగురు దిద్దినకావ్య పుంజమ్ముభారత
మ్మెందాక తఱచుగాఁ జిందుద్రొక్కు
తెలుఁగుదివ్వెల వెలుంగులు నిండి చకచకా
యెందాక కళలతో నెనఁగుచుండు!
తూర్పుపడమర క్రొంజిగ్గు తొగరురుచులఁ
దళుకులంజిమ్ము నెందాక తెలుఁగుతల్లి!
ముద్దుబిడ్డలు నీకృతుల్ మురిపెమెచ్చ
లోకమున హొయల్ చిలికి యందాకవెలయు.

ఉన్నావని మాలోపల
కన్నావని యెల్లవారి గౌరవములనే
విన్నావనికీర్తనములు
చిన్నయ్యా! తలఁతునిన్ను చిత్తములోనన్.



# భారతీయ - పాశ్చాత్య కావ్య లక్షణములు

శ్రీ అవంత్స వేంకట రంగారావు

(గత సంచిక తరువాయి)

## నవ్య కవితా లక్షణములు

లోగడ పేర్కొనఁబడిన విషయములు ప్రాంతవనియు, మొదటి ప్రపంచ యుద్ధానంతరము ఆంగ్ల దేశములలోను ఇతర పాశ్చాత్య దేశములలోను గవులు నవ్యమార్గము ప్రవేశ పెట్టుచున్నారనియుఁ, బూర్వము "భావ కవిత్వోద్యమము" బయలు దేరించినట్లే పాశ్చాత్య దేశములో గోచరించిన యీ క్రొత్త మార్పులను నాంధ్రకవిత్వములోఁ బ్రవేశ పెట్టుట అభ్యుదయ సూచకమనియుఁ తాత్కాలికముగా భావించుకొని తల్లక్షణాలను దెలిసికొందము.

మొదటి ప్రపంచ యుద్ధమునకు రెండుమూఁడు సంవత్సరములకు ముందలు ఆంగ్లదేశములో వెలువడిన "Georgian Poetry" అను మూఁడు గ్రంథములు 1911-1912, 1913-1916 సంవత్సరములలోని కవితా మార్గమును విశద పఱచినవి. * Miss Mary C. Sturgeon రచించిన "Studies in Contemporary poets" అను గ్రంథములోఁగూడ నీ నవ్య కవితాలక్షణములు గోచరించును. ఆ రోజులలో నాంగ్లదేశ నవ్యకవులలోఁ బేరుగాంచిన వారు Harold Monroe, Roopert Brooke, James Ebooy Fecker, John Mascfield Wilfred Wilson, Gibson, Walter de la Mare, Ralf Hodgson, Lascelles Abercoombie మొదలగువారు.

Miss Sturgeon తన యుపోద్ఘాతములో "The technique of modern poetry would seem to be a movement towards a more exact rendering of the music and meaning of our language" అనియు, "The life of contemporary England is evolving its own music" అనియుఁవ్రాయఁగా Dr. Cousin's "But the plain fact stated by Miss. Sturgeon that there is in these poets an identification of their method and thought with the peculiar life of their time, which is the same as saying that they are dated, and therefore not for all time but for a passing age, in short, that they are minor poets.' అనియు The chief characteristic of the new technique is irregularity of rhythm, and a loose adherence to rhyme" అని "నిశితముగా విమర్శించుటకుఁ గారణమైనది. అనఁగా లయయు, నంత్యానుప్రాసమును గ్రమము తప్పుటయు ఈ క్రొత్త రచనల లక్షణమనియు, వారి కాలములో నీకవులు ఐక్యత జెందుచున్నారు గాన సర్వకాలమునకు వీరి రచనలు పనికిరావనియు నందు చేత వీరు మహాకవులు కారని యామె ఒప్పుకున్నట్లే యనియు నాంగ్లవాక్యముల తాత్పర్యమగుచున్నది

ఈ సందర్భమున 1912 సం॥ ప్రాంతములో ఇటలీదేశములో బయలుదేరిన "Futuriam" "భావితనము"అనువాదముఁగూర్చి కొంచెము తెలిసికొనవలసి యున్నది. 19 వ శతాబ్దపుఁ దొలి దినములలో "A thing of beauty is a joy for ever" అనఁగా రమణీయమైనవస్తువు శాశ్వతానందదాయకము" అను నది

* "New ways in English Literature" by J H. Cousins.

ప్రాయము మిక్కిలి వ్యాప్తి జెందియుండెను. అట్టి యభిప్రాయము తప్పని Marinetti అను ఇటలీ దేశీయుడు ఈ క్రింది విధముగా వక్కాణించెను. "To advise an old picture is to pour our sensitiveness into a funeral urn instead of casting forward in violent gushes of creation and action...set fire to the shelves of libraries deviate the course of canals to flood the cellars of museums. అనగా శక్తిమంతములైన నవ్యనిర్మాణములు చేయక చిత్రమును మెచ్చుకొనుట మనమృదు హృదయముతో శవధూళి పాత్రను మెచ్చుకొనుట వంటిది కాబట్టి గ్రంథాలయములకు నిప్పంటింప వలసినదనియు, కాలువల మార్గాలను గొతుకవస్తు ప్రదర్శనశాలల వైపుగా మరలించి వానిని ముంచివేయుడని తాత్పర్యము. ఈ వాదముయొక్క ప్రభావము రష్యాలో Mayokovsky అను కవిమీద బాగుగ సోకినది, అతడు కవిత్వము పామరజనులకు గూడ తెలియవలెనని తనరచనలు గ్రామ్యభాషలో సాగించినాడు ఛందోనియమములలో గూడ మార్పులు చేసినాడు. ఈ యభిప్రాయములు క్రమక్రమముగా నితర పాశ్చాత్య దేశములలో గూడ వ్యాపించినవి. క్రొత్తకవులు ఇంగ్లీషులో రచనలు సాగించినారు. వారిలో Stephen Sperder, Wystan Hugh Auden, Louis Mac Neice, Cecil Day lewis, George Barker, Geoffrey Grigson, John Lehmann, and Michael Roberts, T.S.Eliot, D.H.Lawrence పేర్కొనబడినారు. ముఖ్యముగా Auden, Eliot, Lawrence అను వారిలోనే యీ క్రొత్తలక్షణములన్నియు గోచరించును.

ఈ క్రొత్తరకమైన రచనలనుగూర్చి James Graham అను నతడు "Modern Poetry—An Explanation" అను శీర్షిక క్రింద నీ క్రింది వ్యాసమును రచించినాడు. (The Hindu 12-10-1941.)

"Since the end of the last century there has been a tremendous upheaval in all the arts, poetry among them; and many people wonder what it is all about and what these young people are trying to do. Some genuine lovers of poetry are completely baffled by the new styles and return in disgust and bewilderment to their Shakespeare, Tennyson and Browning; a very natural thing to do, but it is a pity to lose the real beauty that may be embedded in a mass of experimental and unsuccessful verse.

The key notes of modern poetry are change, disillusionment, and a striving for that objectivity which many writers feel will help them to serve their fellow-creatures and lesson their consciouness of their own personal troubles.

గత శతాబ్దమునుండియు కళ లన్నిటితో బాటు కవిత్వము పైకి లేచినది. యువకవులందరు నేమిచేయుటకు బ్రయత్నించుచున్నారని చాలమంది ఆశ్చర్య పడుచున్నారు. కవితాప్రియులీ క్రొత్తకవితారీతులను జూచి పూర్తిగా భంగపడి విసుగుతోడను, ఉగ్రప్రీతి తోడను వారి వారి Shakespeare, Tennyson, Browning కావ్యములకు దిరిగి పోవుచున్నారు. అది సహజమే కాని యీ కవితా ప్రయత్నములలో లీనమైయున్న సౌందర్యమును వీరు గమనింప లేకుండుట శోచనీయము.

ఈ నవ్యకవిత్వమునకు ముఖ్య లక్షణము లేవనగా, మార్పు, భ్రమ పడకుండుట, పరాశ్రయముగా గావ్యాలు వ్రాయ బ్రయత్నించుట. పరాశ్రయముగా వ్రాయుట వలన మానవ సేవ చేయుటకును ఆయా మానవుల వారి స్వంత దుఃఖములు కొంత విస్మరించునట్లు జేయుటకును వీలగునని రచయితలు అనుకొనెదరని తాత్పర్యము.

Most young poets now-a-days speak and read several languages, believing that this helps them in their mission of brotherhood and objectivity. They are constantly on the look out for fresh material from all over the world, and new words to enrich their native language. They draw their images and similes from the mechanical world, the factory, and even the laboratory as well as from the world of nature.

సోదర భావము పెంపొందించుట వారి పనిగా నమ్మి నవ్యకవులనేకులు వివిధ భాషలు మాటలాడుటయు, జదువుటయు జేయుదురు. నూతనమైన అన్యదేశ్య పదములచే వారి స్వంత

భాషావిసృష్టియు నూతన వస్తువులను గోరువారు సర్వ ప్రపంచము సర్వదా మెలకువతో గమనింతురు. వారు ఉపమానాద్యలంకారములను యంత్రశాలల నుండియే కాక పరిశోధనా గారముల నుండియును ప్రకృతి నుండియుఁగూడ సేకరించెదరు.

Bitter complaints have been made about the loose rhymeless "Free Verse" and some with justice. Some free verse is the result of laziness and sloppy thinking; but often it is the outcome of the honest desire to express a mood or state of affairs in the form which seemed to the writer best suited to it.

ఈ "Free Verse" (యధేచ్ఛా కవిత్వము) ను గురించి వచ్చిన కఠినమైన యాక్షేపణలు కొంత న్యాయముగనే యున్నవి. ఇట్టి పద్యాలు కొన్ని బద్ధకము యొక్కయు, వక్రాలోచన యొక్కయు ఫలితమై యున్నది. కాని తఱచుగా నప్పటి మనఃస్థితికి మిక్కిలి యనుగుణముగా వ్రాయవలెనను న్యాయమైన కోర్కె యొక్క ఫలితమైకూడనై యున్నది.

తరువాత "Malaise of Modern Poetry" అను శీర్షిక క్రింద "The Saturday Review of Literature" లో Van Doren చే నీక్రింది విధముగ వ్రాయఁబడిన విషయములు (13-10-'40. హిందూ పత్రికలో) ఉదహరింపఁబడినవి గమనార్హములు "It is a common place of criticism that the world a modern artist sees—a painter, a musician, a poet,—is hopelessly unattractive. The industrial revolution, machinery, little leisure, cities and the suburbs of cities are variously blamed for the tedeousness about him; and he is pitied for the dilemma thus presented — either he must shrink into blindness and work in a mist of pretence, or he must face the spectacle and give it back in terms of its own bitterness.

## నవ్యకవిత్వ ప్రయాసము

ప్రస్తుతము ఒక చిత్రకారుఁడుగాని, సంగీత విద్వాంసుఁడుగాని, కవిగాని, పూర్తిగా ననాకర్షణీయమైన ప్రపంచమును జూచును. పారిశ్రామిక విప్లవము, యంత్రములు, పట్టణాలు, తత్పరిసరములు వ్యవధిలేమి, ఈ భయానక దృశ్యములకుఁ గారణ భూతములు. అందుచేత నతఁడు — ఆ దృశ్యములు వాని కగపడియు నగపడనట్లు ఒక నెపముతోఁ బనిచేయుటయా, లేక యతనికి సాక్షాత్కరించుచున్న దృశ్యములను జూచి అంత కఠినముగనే ధైర్యముతో వానిని వర్ణించుటయా ? అను సందిగ్ధావస్థలోఁ బడిపోవు చున్నందులకు ప్రజలు జాలిపడుచున్నారు.

ఈ సందర్భములో "Poetry and Beauty" (కవిత్వము : సౌందర్యము) అను శీర్షిక క్రింద Kathleen Raine, "World Review" పత్రికలో (చూ 17-5-12 హిందూ పత్రిక) వ్రాసిన వ్యాసభాగమును దెలిసికొన వలసి యున్నది.

There is a deceptive half truth in many peoples' minds about poetry. Poetry, it is said, ought to be "beautiful" and therefore things that are ugly—like Mr. Eliot's area pavements, W. H. Auden's landscape of industrial depression, and the less romantic aspects of death and sex should be excluded from literature. Great art possesses beauty—true; but this is so because great art makes things beautiful, not because it makes mention only of beautiful things. The armies and bloodshed of Homer are not things in themselves beautiful. Nor are the circles of Dante's Hell, nor the strocets of James Joyc's Dubin. It is the genius of the poet to give these things their glory. Indeed the more painful and unacceptable an experience is, the greater our need to assimilate it through art.

The terms of the nineteenth century or the eighteenth no longer explain the world and the descrepancy between the world of reality and the world of language is bound, sooner or later to become painful ........ The landscape of the modern world is the least of the profound changes that have come about during the century Mr. Eliot and more

recently D H. Auden, among poets, and D.H. Lawrence also as a novelist have best expressed this change. D.H. Auden is the first outstanding good satirical poet that we have had in this country for a long time.

కవిత సుందరముగ నుండవలెనుగాఁ బట్టి T. S. Eliot వర్ణించిన Area Pavements (పెద్దరాళ్లబాటలు) Auden వర్ణించిన పారిశ్రామిక మాంద్య దృశ్యములు, రతివంటివి సాహిత్యము నుండి బహిష్కరింపఁ బడవలెనను భ్రాంతిజనకమైక అర్థసత్యాభిప్రాయము లనేకుల మనములందుఁ గలవు. మహాకళ సుందరముగా నుండుట నిజమే. కాని యదియట్లెందుకుఁగలఁదనగా నది వస్తువులను సుందరముగా నిరూపించును గాఁబట్టి సుందర దృశ్యములను వర్ణించుటచేతనే గాదు Homer కవి యొక్క (వర్ణించిన) సైన్యములు రక్తపాతము. Dante కవి యొక్క నరక మండలములు James Joyce కవియొక్క డబ్లిన్ నగర వీధులు అందమైన వస్తువులు కావు. కవి ప్రతిభవానికి మహిమఁజేకూర్చును. ఒక యనుభవమెంత బాధాకరమున గ్రాహ్యమునగునో దానిని కళద్వారా సమీకరించుట కంత యవసరమున్నది.

18, 19 శతాబ్దాల నిబంధనలు ప్రస్తుత ప్రపంగమునకిఁక సరిపడవు. సాక్షాత్కరించుచున్న ప్రపంచమునకు భాషా నిర్మిత ప్రపంచమునకు మధ్యఁగల సరస్పర భేదము వేగముగనో యాలస్యముగనో బాధాకరమగుట తప్పదు. ఈ శతాబ్దములో వచ్చిన గంభీరమైన మార్పులలో నవ్యప్రపంచ దృశ్యములతి స్వల్పమైన మార్పుమాత్రమే అయియున్నది Eliot, Auden, Lawrence అను వారీ మార్పులను జక్కగాఁ దెలియఁ జేసనారు. ఈ దేశములో జాలాకాలమునకు ముందుకువచ్చిన ప్రథమావహాస్య కవి Auden అయియున్నాడు" ఈ యభిప్రాయమునకుదాహరణముగా నామెచే నీ క్రిందపద్య మియ్యబడెను.

"Consider this and in our time
As the hawk sees it or the helmeted airman
The clouds rift suddenly–look there
A cigarette end smouldering on a border
At the first garden party of the year.
Pass on, admire the view of the massif
Through platiglass windows of the Sport Hotel;
Join there the insufficient units
Dangerous, easy, in fans, in uniform
And Constellated at reserved tables
Supplied with feelings by an efficient land
Relayed elsewhere to formers and their dogs
Sitting in kitchens in the stormy fans."

పై దృశ్యములోఁ గవి యొకేసర్యాయము మేఘములను, తోటలోని సిగరెట్టు పీకను Sport Hotel యొక్క అద్దపుఁగిటికీని, సంగీతమును, రేడియోపెట్టెను. గ్రామములోని వంటగదిని, అందేకప్రకారరోమ వస్త్రములను ధరించియున్న జనులను, వైమానికుని, రేడియో సంగీతమును వినుచున్న కృషీ వలుని వర్ణించినాడు. ఇట్టి దృశ్యములు ఇప్పటివారికి సుపరిచితములై మనోహరములుగా నుండునని వ్యాసకర్త్రి వ్యాఖ్యానించినది.

అందముగఁ గనఁబడు దృశ్యములనే కవి యేరుకొనవలెనను నిర్ణయము మనసుఁగూడ లేదని చాలాకాలమునకుఁ బూర్వమే ధనంజయుఁడు "దశరూపకము"ను నలంకార గ్రంధములో వ్రాసిన వాక్యములను మున్నుదహరించితిని. యభిప్రాయమునకు శ్రీమద్రామాయణము కిష్కింధాకాండ 28వ సర్గలోని రెండుదాహరణ లిత్తును.

(1) సంధ్యారాగోత్థితైస్తామ్రైరంతేష్వధిక పాండరైః
స్నిగ్ధై రభ్రపటచ్ఛేదై ర్బద్ధవ్రణమివాంబరమ్ (౬ శ్లో)

సంధ్యారాగముచే (మధ్య) నెఱ్ఱగను గొనలయందు మిక్కిలి తెల్లగనుఉన్న మేఘములతో నాకాశము దట్టమైన గుడ్డపేలికలతోఁ గట్టబడిన పుండువలె నున్నది.

(2) కశాభిరివ హైమీభిః విద్యుద్భిరభితాడితమ్ ।
అంతః స్తనిత నిర్ఘోషం సవేదనమివాంబరమ్. (శ్లో॥)

బంగారు కొరడాలవలె నున్న మెఱపుఁదీఁగలచేఁగొట్టబడినదై యుఱుములు గల మేఘము బాధపడుచున్నట్లున్నది.

"ఆముక్తమాల్యద" (చ.ఆ. 89) లోని యీ క్రింది పద్యమును చూడుడు

గీ॥ షట్టపెడలి నభోభిత్తిఁ భట్టు శక్ర
కార్ముకంపుఁ బెద్ద పలువన్నె కట్లజెట్టి
దైన నడచెడు కాళ్ళగుంపనఁగ గాలి

కార్కొని దిగంతముల వానకాళ్ళు నడచె.

"మేఘదూత" లోని

రత్నచ్ఛాయావ్యతికర ఇవప్రేక్ష్యమే తత్పురస్తాన్
ద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖండమాఖండలస్య॥

(పూ॥ 15 శ్లో) అను శ్లోకము ప్రకారము రత్నకాంతుల సమూహమువలె మనోహరముగాఁ గాళిదాసునకుఁ గనఁబడిన యింద్ర చాపము పెద్ద రంగురంగుల జెఱ్ఱివలె అముక్త మాల్యదకారునకు గన్పడినది. అతడక్లే దానిని భయానకముగనే వర్ణించినాఁడు. ప్రపంచములో గల వివిధానుభవముల కనుగుణముగా శృంగార హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభత్స, అద్భుత, శాంత అను నవరస యుక్తముగాఁగావ్యముల్లిన యెడల సమగ్రమైన పుష్టి కావ్యమునకుఁగల్గునని మమ్మటుఁడు చెప్పిన వాక్యములను మున్నుదహరించితిని.

## అమెరికా దేశ కవిత్వము

Aldrick James, Allston Washington, Bryant W. Cullen, Clark Willis, Joseph Rodman, Oliver Holmer, F. R. Lowell, Ullen Grenville, Morris George. Paul Benjamin, Poc Edgar Allen, Sargent Epes, Lydia Henry ley Emerson Ralph Waldo, Longfellow Henry Wadsworth, Walt Whitman
మొదలగు వారి తరువాత 1912 సంవత్సర ప్రాంతములో "The new poetry" (నవ్యకవిత్వము) అను పేరుతో నమెరికాలో Miss Monroe, Ezra Pound. Miss Amy Lowell Mrs. Alice C. Henderson, Witter Bynner, Charles H. Towne, Fannie S. Harris మొదలగు వారు పద్యరచన సాగించినవారు. "Spoon River Anthology"అను ఖండకావ్య సంకలనమున కుపోద్ఘాతము వ్రాయుచు Miss Monroe అను నామె యింగ్లాండుదేశ నవ్యకవిత్వ చరిత్ర పేర్కొనిన సందర్భములో నేను జేర్కొనిన లక్షణములనే యుదహరించ యీ క్రింది ప్రకారముగా వ్రాసినది :—
This effort at modern speech, simplicity of form, and authentic vitality of theme, is leading our poets to question the authority of the accepted laws of English verse and to study other languages, ancient and modern in the effort to find out what poetry really is?"

సరళముగా నవ్యభాషలోఁ గావ్యరచన సేయు ప్రయత్నము పూర్వమంగీకరింపఁబడిన ఛందోనియమముల యధికారములగు మన కవులు తిరస్కరించుటకును, గవిత్వమనఁగా నెట్టిదో తెలిసికొనుటకును ఇతర ప్రాచీనార్వాచీన భాషా పఠనమునకును దారితీయుచున్నదని పై వాక్యముల తాత్పర్యము .పై వాక్యముల వలనఁ గవిత్వమనఁగా వీరికి దెలియదని విమర్శకులాక్షేపించుట కవకాశముగల్గినది. అదియును గాక Miss Monroe తన యుపోద్ఘాతములో ప్రాచ్య దేశాల యొక్క అనఁగా ముఖ్యముగా జపానువారి "హొక్కు" పద్యాల ప్రభావమును, రవీంద్ర కావ్య ప్రభావమును నమెరికా కవిత్వముపైఁగనబడుట మంచిదని చెప్పుచు Spoon River Anthology "లో" look at her then she sits upon her throne......To do her will for ever" అను దనపద్య మొకటి యుదహరించినందున నా పద్యములో నవ్యకవితాలక్షణాలు కనఁబడలేదని విమర్శకులాక్షేపించుట కవకాశమిచ్చినది. (చూ. Modern English poetry ch. VI by Dr. James H. Cousins) రవీంద్రుని బద్యమొకటి పూర్వముదహరింపబడినది గాన జపానువారి "హొక్కు" పద్యమొకటి యుదహరింతును:—

పర్వతం మార్గం వెంట
ప్లంపుష్పాల పరిమళం
అదిగో వెంటనే ఉదయిస్తున్న సూర్యుడు"

"ఈ హొక్కు" కవితను పదచిత్రాలనవచ్చు, ప్రకృతిలోని అతిబలితమైన సన్నివేశాన్ని మనముందు వుంచుతవి. ఆంగ్లానువాదాల నుండి కొన్ని దెబ్బఁగు వాక్యాల్లో ఇచ్చట ప్రదర్శింపబడు నున్నవి." (చూ. శోభ పత్రిక ఫిబ్రవరి 1951) అమెరికాలోని నవ్యభావాలు Ezra Pound, Milton కవిని Pompass ass (The Little Review, September 1918) అని వ్రాసిపుచ్చినంత మేరకుఁబోయినవి.

Miss Amy Lowell 1914 లోఁ బ్రకటించిన "Men, women and Ghosts" అను గ్రంథములో నామె వ్రాసిన వాక్యములు ఈ సందర్భమున దెలిసికొనుట మంచిది. "I think it was the piano pieces of Debussy with their strange likeness to short verse libre poems, which first showed all the close ——- kinship of music and poetry, and there flashed

into my mind the idea of using the movement of poetry in the same way that the musicians use the movement of music."

అనఁగా డెబుస్సీ Piano పాఠలకును చిన్ని Verse libre రచనలకును గల పోలికలు సంగీతమునకుఁ గవిత్వమునకు గల దగ్గర బాంధవ్యము నాకుఁ జూపినది. గాయకుఁడు సంగీత గమకము నెట్లుపయోగించునో యట్లే పద్యమును కూడ నుపయోగింప వలెనను అభిప్రాయము నాకప్పుడు స్ఫురించినది. అని తాత్పర్యము. ఒకచే పాకట్టుయొక్క గమనమును వర్ణించు ఈ క్రింద పద్యము చూడుడు.

**A Roxbury Garden**

Stella sings:
Hoop, loop,
Roll along,
Faster bowl along,
Hoop.
Slow to the turning
Now go! — Go!
Quick !
Here's the stick.
Rat–a–tap–tap–it
Pat it, flap it.
..............................
Minna sings:
Trip about, slip about,
whip about
Hoop.
..............................
Twist.

And that's how the waters come down it dodore" "so to speak or rather come down a century ago, and laugh at the preposterous assumption of the great nature of Poetry by this poor jugglery of words."

అని పాశ్చాత్యులే యింద ధమశబ్ద చమత్కారము తప్ప కవిత్వము లేదని త్రోసి పుచ్చినారు. ఇట్టివానిని అధమాధమ కవిత్వమని జగన్నాథ పండితుడు నిర్ణయించినట్లు మున్నునుడివియున్నాను.

"A further development of this "new poetry" method is the invitation of the flowing rhythm of music in a piece describing the playing of a violen. "అనఁగా" వాయులీనగాన ప్రవాహము ననుసరించుట ఈ నవ్యకవిత్వముయొక్క యింకొక విస్తరణమై యున్నది అని తాత్పర్యము అమెరికా నవ్యకవులు కవితకు "Polyphonic Prose" బహుస్వరయుక్త గద్యము అను వింతపేరుకూడ పెట్టినారు. కాని Witter Bynner, Hanson Towne, Ezra Pound, Davis రచనలు కవిత యనఁబడుట కర్హములై యుండునని కజిన్స్ చెప్పినాడు.

ఈ సందర్భములో "Saturday Review అనుపత్రికలో "American Literature (అమెరికా వాఙ్మయము) అను శీర్షిక (హిందూపత్రిక 28-7-1940 క్రింద V. F. Calverston వ్రాసిన వ్యాసభాగమును మనము గమనించుట మంచిది.

America has produced the most interesting and challenging and certainly the most fertile literature in the world to-day. Nevertheless it remains a literature of ephemeral and episodic intensity.

America alas! as too much evidence proves is a country of fads and faddists; we believe in everything for a time but in nothing for a long time. We lack a sense of values persistent, stable, enduring values-

అమెరికా అత్యుత్సాహ జనకమైన, యితరముల సవాలు చేయఁగల, నిశ్చయముగాఁ బ్రపంచములోనికెల్ల మంచి ఫలప్రదమైన వాఙ్మయమును సృజించినది. అయిననది తాత్కాలిక ప్రయోజనము గల్గినదియు నుపాఖ్యాన స్వరూపము గలదియు నై యున్నది,

అయ్యో! అమెరికా దేశము వేలమువెర్రివారి దేశమై యున్నదని చెప్పుటకెన్నియో నిదర్శనములు గలవు. మనము కొంతకాలమన్నిఁటిని నమ్మెదము. గాని స్థిరమైన యేయభిప్రాయములును లేకుండ చాలాకాల ముందుము. మనకు విలువలు కట్టుట తెలియదు. అని పై యుద్బోధనముయొక్క తాత్పర్యము. అందుచేతనే కాఁబోలు T. S. Eliot స్వదేశమైన అమెరికాను విడిచి పెట్టి యింగ్లాండు దేశమునకుఁ దరలిపోయినాఁడు.

అమెరికా సారస్వతముతోఁ గొన్ని పోలికలు కలది, ఆస్ట్రేలియా సారస్వతము. ఆస్ట్రేలియాలో నున్న ఆంగ్లేయులు మొట్టమొదటి దినములలో బరోపానేత్రాలతోఁ గావ్యాలు రచించెడివారు. కాని 19 వ శతాబ్ది చివరలో Henry Larson, Joseph Furphy (Tom Collins) A. B. Paterson వంటివారు నిజమైన ఆస్ట్రేలియా దేశపు దృష్టితోఁ బద్య రచన చేసినారు. వారి పద్యాలు గొఱ్ఱెల సాలలలోను, గనులలోను, గుడిసెలలోను, బాడఁబడుచుండెడివి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము మీ యుత్సాహ తరంగము కృంగినది. 1930 దాటిన తరువాత నా తరంగము విజృంభింప నారంభించినది.

ఇఁక ప్రపంచ విఖ్యాతిఁ గాంచిన Eliot కవి యేమి చెప్పెనో యతని కావ్యములోని గొన్ని విశేషములేమో తెలిసికొనుటకు ఆంగ్లదేశములోని Oxford విశ్వ విద్యాలయాచార్యుఁడును బహుభాషా వేదియునైన C. M. Bowra రచించిన "Creative Experiment" అను గ్రంథము నందలి విషయము నెఱుంగుట కవసరమై యున్నది. ఆ గ్రంథములో ఫ్రాన్స్‌నుండి Appollinaire ను, రష్యానుండి Mayokovsky, Pasternak లను, ఇంగ్లాండి నుండి T. S. Eliot ను, Spain నుండి Lorca Rafael Alberti కవులను అతఁడు పేర్కొనినాఁడు. మనదేశపు రాజప్రతినిధిగాఁ గొన్నిదినములు పనిచేసిన Lord Wavell, విక్టోరియా రాణి కాలపుఁ గవులలోని గొప్పతనము నవ్యకవులలో లేనట్లు అభిప్రాయపడుట పొరపాటని Creative Experiment అను గ్రంథపఠనము వలనఁ దెలియగలదని హిందూ పత్రికలోఁ బరామర్శింపఁబడినది. Eliot యొక్క యభిప్రాయములు ఈ క్రింది వాక్యములు తెలియఁజేయును.

The Common word exact without vulgarity,
The formal word precise but not pedantic,
The complete concert dancing together.

సామాన్య పదాలను అసభ్యత్వము లేకుండ యధార్థముగా వాడుట, అను శ్రుతముగా వచ్చుచున్న పదాలనైనను నిరాడంబరముగా వాడుట. ఇట్లు చేయుటవలన పదముల కూర్పు నాట్యమాడినట్లుండునని అర్థం.

Eliot కవి రచించిన "The Waste land" four Quartets" Little gidding Dry "Salvages" అను కావ్యాలు ఉపనిషత్తులు, భగవద్గీత, పతంజలి యోగశాస్త్రము మొదలగు గ్రంథాలు అతనిపై చూపిన ప్రభావమును విశదపఱచును. "The wast land" ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అను వాక్యములతోను, "Four quartets"– And all shall be well, and, All manner of things shell be well" అనఁ "సర్వే జనాస్సుఖినో భవంతు" అనునట్లుగా ముగియును. ఋగ్వేదము అగ్నికెట్టి ప్రాముఖ్యము చూపునో అట్టి ప్రాముఖ్యము Eilot కవి తన కావ్యములలో నగ్నికిఁ జూపును. నదులకు సముద్రమునకు గల సంబంధమువలె జీవాత్మ, పరమాత్మ సంబంధము ఉండునని యతఁడు తెల్పుచుండును. అరవిందుఁడు తన "Future of poetry"లో శ్రుతులనుదహరించి కవిత్వము భగవంతుని మంత్రమని సూచించినట్లు Eliot కవిగూడ ననేక సందర్భములలో "In cantatory value of poetry" అనఁగాఁ గవితకు మంత్రమునకుండు విలువగలదని చెప్పియున్నాడు. ఈ రహస్యము ఆది కవియగు వాల్మీకి పూర్వమే గ్రహించినాడనియు రామాయణము మంత్ర శాస్త్రమనియు మున్నే నుడివియున్నాను.

## సింహావలోకము

1. అభ్యుదయమనఁగా నభివృద్ధియనియు శుభోదయ మరియు నర్థము.

2. ప్రపంచములోని జనులకు ఐహికాముష్మికానందము లొసంగగల కావ్యములే అభ్యుదయ కావ్యములనఁ బడుట కర్హములు.

3. భగవంతుని యందు నమ్మకము, భగవంతుని యందు భక్తి, భగవద్దర్శనోత్సాహముఁ బుట్టింపఁగల కావ్యములే ఐహికాముష్మికా నందమును జేకూర్పఁగలవు. అట్టి కావ్య పఠనము వలననే యభ్యుదయము చేకూరును. రామాయణమువంటి కావ్యములా పనినే చేయుచున్నవి. రవీంద్రనాథ టాగూరు కావ్యాలు ఆ పనినే చేయుచున్నవి.

4. ఒకకావ్యమనేక శాస్త్రముల జ్ఞానముగల్గించినను అదియు నభ్యుదయ లక్షణమే యగును. ఆకారణముచేతఁగూడ రామాయణాది కావ్యము లిప్పటికిని గౌరవింపఁబడుచున్నవి. నవ్యకావ్యములు కూడ అట్టి జ్ఞానమునను ప్రదర్శింపవలెను,

5. బాహ్యావృత్త ప్రతిపాదకముగా, గానగర్భితముగా సులభశైలిలో కావ్యములు రచించుట, సుందర దృశ్యములనైనను వర్ణించుట యథావద్వస్తు వర్ణనములు సేయుటలోఁ గృతక విర్మాణము (నగరాదులు) లను విడిచి పెట్టకుండుట మొదలగు లక్షణ

ములు నవ్యుల అభ్యుదయ లక్షణములని వ్యవహరించినవి రామాయణమువంటి ఆదికావ్యములలోనే కలవని తెల్లమైనది. కుశలవులు రామాయణమును గానము చేసినారని విందుము. కాఁబట్టి రామాయణమును మాతృకగాఁ దీసికొని అనన్య పరతంత్రముగా కావ్య నిర్మాణము చేయుట మంచిది.

6. నవరస రుచిరములుగాఁ గవులు కావ్య నిర్మాణము సేయఁదగునను మన యాలంకారికుల యభిప్రాయము ప్రకారము రచనలు జరిగినచో సందర్భానుసారముగా భయానకభీభత్స దృశ్యవర్ణనములు కన్పడుచునే యుండును. అప్పుడు కావ్యమునకు సమగ్రపుష్టి చేకూరును. వివిధానుభవముల కనుగుణముగా వివిధమైన దృశ్యములతో బాహ్య ప్రపంచము వలెఁ గావ్య ప్రపంచము కూడ గోచరించును. కాని కేవల మందఱును భయానక భీభత్స దృశ్యములనే వర్ణించుట ప్రత్యేకమైన యభ్యుదయ లక్షణము కానేరదు. అట్టి దృశ్యములతోఁడనే నవ్యకవులు బహు కావ్యనిర్మాణములు చేసినచో వేలము వెఱ్ఱివలె నుండును. పాశ్చాత్యదేశములలో రెండు ప్రపంచ యుద్ధములును బారిశ్రామిక విప్లవమును భయానక భీభత్సదృశ్యములను గల్పించినవి గాని మనదేశమునా యుద్ధములు స్పృశింపక పోషటచే నా దేశకవుల ననుసరించిన మన నవ్యకవులు బలవంతముగా భయానక దృశ్యమయములుగాఁ గావ్య నిర్మాణము చేసినయెడల వారు పరప్రత్యయనేయ బుద్ధులై పోవుదురు. కాఁబట్టి పాశ్చాత్య దేశములో వచ్చుచున్న మార్పులన్నిఁటిని మన మనుసరింపకూడదు. అదియునుఁ గాక నవ్యకావ్యము లన్నియు భయానక భీభత్స దృశ్యమయము లైనచోఁ బ్రపంచములో నట్టి దృశ్యములకెట్టి స్థానమున్నదో కావ్యములందుఁగూడ వాని కట్టిస్థానమే లభించును.

నవ్యులు వివిధ భాషలు నేర్చుకొందురను నభిప్రాయము మంచిదే కాని ఆయా దేశ్యపదాలను అజాగ్రత్తగా మాతృభాషలో జొనిసికావ్య నిర్మాణము చేసినచో మాతృ భాషయొక్క పవిత్రతకు గంభీరత్వమునకు లోటు కల్గును.

8. "కళకళకొఱకే" అను వాదమును బాశ్చాత్యులు కూడ అంగీకరింపనట్లు చూపియున్నాను గాన కళయొక్క పవిత్రోద్దేశములను గ్రహించి కావ్యరచన జరుగుట మంచిది. ఉపమానములే దృశ్యములనుండి యైనను ఏరికొనవచ్చును.

9. అమెరికావారికి స్థిరమైన యభిప్రాయములు లేవనియు వారు నిర్మించిన వాఙ్మయము తాత్కాలికమైనదనియును నుపాఖ్యాన రూపము గలదనియు వారు వేలమువెట్టిగలవారనియు నమెరికా వారే వారినిగుఱించి చెప్పికొనుచుండగా వారి ననుసరించి మనవారు "A Roxbury Garden" వంటి పద్యాలు రచించినచో దాని కెట్టి గౌరవము కల్గినదో మనవారి కావ్యాలకుఁగూడ నట్టి గౌరవమే కల్గును.

10. క్రాంత దర్శనము, విశాల హృదయము మహర్షుల వంటి కవులకే యుండును గాన యట్టి వారే విశ్వశ్రేయముగాఁ గావ్యనిర్మాణము సేయగలరని చూపియున్నాను. నవ్యులకుఁ గురువైన T. S. Eliot భారతీయ సంస్కృతిని జీర్ణించుకున్నవాఁడని చెప్పియుంటిని. మన సంస్కృతిని మనము తెలిసికొనక పాశ్చాత్యుల లోపముల ననుసరించుట అభ్యుదయమగునా? కాఁబట్టి కవులు వారి శీలమును గాపాడుకొందురుగాక.

11. ఈ సింహావలోకనమునకుఁ బూర్వము చెప్పఁబడిన విషయములనుబట్టి " కవిత్వము కావ్యము " అను పదములలోనే అభివృద్ధి సూచింపఁబడియున్నదని గ్రహించుకొంటిమి. ఏ నిర్మాణమైనను రసవంతమైన యెడల నది కావ్యమగును. కావ్యమైనప్పుడది అభ్యుదయ సూచకమే యగును. కాన " అభ్యుదయ కవిత్వము " అను పదము పునరుక్తిదోశజుష్టమని మనవి చేసికొనుచున్నాను.

పూర్వకవితలు బంగారపు వస్తువులవంటివైన యెడల నవ్యకావ్యములు అంతకంటె మిక్కిలి విలువగల Platinum లోహవస్తు మయమని నవ్యులనుకొనిన యెడల మన గృహములందు బంగారు వెండి వస్తువుల సౌందర్యము నశించి Stainless Steel సౌందర్యము దాని స్థాన మాక్రమించి నట్లగునని వారు గుర్తింతురుగాక !

ఈ సందర్భమున నీ వ్యాసమును John Masefield "Cargoes" ( పడవలలో సామగ్రి ) అను శీర్షిక క్రింద వ్రాసిన యీ క్రింది పద్యముతో ముగింతును.

Quinquireme of Ninevah from
distant Ophir
Rowing home to heaven in sunny Palestine
Wih a cargo of ivory,
And apes and peacocks,
Sandalwood, ceddarwood, and
sweet white wine.

Stately spanish galleon coming
from the Isthmus,
Dipping through the Tropics
by the palm-green shores,
With cargo of diamonds,
Emeralds, amethysts,
Topazes, and cinnamon, and
gold moidores.
Dirty British coasters with a
salt-caked smoke stack
Butting through the channel
in the mad March days,
With a cargo of Tyne coal,
Road rail, pig lead,
Firewood, iron ware, and cheap tin trays.

నినెవా పట్టణపు నావలు దూరముగా నున్న "ఓఫిర్" పట్టణమునుండి దంతములు, పెద్ద కోతులు, నెమిళ్లు, మంచి గంధపుఁ జెక్కలు, తియని తెల్లని ద్రాక్ష రసము తీసికొని పాలిస్తీనా దేశపు రేవులకు గృహాభిముఖముగాఁ బోవుచుండెడివి.

స్పెయిన్ దేశపు మహానావలు, వజ్రములు, పచ్చలు, నీలాలు, కెంపులు, గోమేధికములు, దాల్చిని చెక్కలు, పోర్చుగీసువారి బంగారు నాణెములు మోసికొని పెనామా కాలువ ద్వారమునఁ బోవుచుండెడివి.

ఉప్పు తెట్టలు కట్టిన పొగ గొట్టములు గలిగి మలదూషితములైన యింగ్లీషువారి నావలు టైన్నదీతీరపు రాక్షసి బొగ్గును, రైలు కమ్మలను, సీసపు దుక్కలను, వంట చెఱకును, ఇనుప వస్తువులను, వంగ పాత్రలు (తంబ్రేలు పళ్లెములు) మోయుచు పొడుచుకొని వచ్చుచున్నవి అని తాత్పర్యము.



భ్రాంత భయ దాంధకార గర్భములు గడిచి,
కీర్ణకుజనికుంజము లొత్తిగించి, పైకి
ప్రాక గల్గి నప్పుడుగదా లోకవృక్ష
మధుర పక్వఫలమ్ములు మనకు దక్కు?

—భీమన్న "మధుగీత"

పశ్చిమ గోదావరి జిల్లాలో

# సాంద్ర వ్యవసాయ పథకం

## సహకార సంఘాల కృషి

రైతులకవసరమైన రసాయనికపు ఎరువులు మేలు రకపు విత్తనాలు, మేలు రకపు పనిముట్లు, సస్యరక్షణ కవసరమైన మందులు అప్పులు వగైరా ఎట్టి యిబ్బందీ లేకుండా సకాలంలో అందించుట. అనేది సాంద్రవ్యవసాయ పథకంలోని ముఖ్యసూత్రాలలో ఒకటి అని ఇదివరకు చెప్పబడింది ఈ అవసరాలను తీర్చడానికి వ్యవసాయశాఖ వారి డిపోలే గాక, పశ్చిమగోదావరి జిల్లాలో కోఆపరేటివ్ సొసైటీలు అనేకం నేడు పని చేస్తున్నాయి.

జిల్లాలో యీ పథకం అమలు పరిచే గ్రామాలలోని రైతుల అవసరాలను లెఖ్ఖకట్టి ఆ మేరకు గ్రామ కో ఆపరేటివు సొసైటీలలో ముందుగానే నిల్వచేసి వుంచుకున్నారు. అందుకనే రైతులు దూరంగాపోయి తెచ్చుకోవలసిన కష్టమేమీ లేకుండానే, యీ సరుకులు, దగ్గరలోనే సకాలంలో అందుకుంటున్నారు. కాబట్టే అనుకున్న ప్రకారం కంటే అధికంగా పశ్చిమ గోదావరి జిల్లా రైతులు గత దాళ్వాపంటలో పండించకలిగారు.

గ్రామ కోఆపరేటీవు సొసైటీలు సాంద్ర వ్యవసాయ పథకం అమలు పరచడంలో రైతులకేవిధంగా సహాయ మందజేస్తున్నాయో తెలుసుకోడానికి పశ్చిమ గోదావరి జిల్లాలోని కొన్ని కో ఆపరేటీవు సొసైటీలు జరిపిన కృషిని గురించి ఆరాతీద్దాం,

భీమడోలు పంచాయతీ సమితికి చెందిన భీమడోలు కో ఆపరేటీవు సొసైటీ 1924 సంవత్సరంలో ఏర్పడింది. అప్పటి నుండి యీ సొసైటీ నుండి రైతులు అప్పులు మాత్రమే పొందకలుగుతూ వుండేవారు, ఈ సొసైటీ 1956 సంవత్సరంలో లార్జి స్కేలు కో ఆపరేటివు సొసైటీగా మారింది. అప్పటినుండి యీ సొసైటీ వేరుసెనగపిండి, ఆముదపుపిండి వగైరాలను మాత్రమే రైతులకు సరఫరా చేస్తూవచ్చింది, కాని సాంద్రవ్యవసాయ పథకం అమలులోకి వచ్చిన తర్వాత అన్ని సొసైటీలకు వలెనే భీమడోలు సొసైటికి కూడ బాధ్యత లెక్కువయ్యాయి, ఈ పథకం అమలులోకి రాకపూర్వం గత సంవత్సరం దాళ్వా వరిపైరుకి 37 బస్తాల రసాయనికపుఎరువులను మాత్రమే సరఫరా చేయగలిగిందీ. సొసైటీ కాని యీ సంవత్సరం సాంద్రవ్యవసాయ పథకంపుణ్యమాఅంటూ యీ సొసైటీ దాళ్వా వరికి 245 బస్తాల రసాయనికపు ఎరువులు సరఫరా చేసింది, గత సంవత్సరం ఒక్కబస్తా మేలురకపువిత్తనాలను సరఫరా చేయలేదు. కాని యీ సంవత్సరం సొసైటీ దాళ్వాపంటకు 5 బస్తాలు, సార్వాపంటకు 149 బస్తాలు

మేలురకపు విత్తనాలను సరఫరా చేసింది. ఈ సంవత్సరం సార్వా పంటకు గాను 760 బస్తాల అమ్మోనియం సల్ఫేటు. 100 బస్తాల అమ్మోనియంసల్ఫేటు నైట్రేటు, 120 బస్తాల సూపరు ఫాస్ఫేటు, 300 బస్తాల యూరియా, 200 బస్తాలు ఆముదపు పిండి రైతులకు సరఫరా చేయడానికిగాను మే నెలలోనే తెప్పించి గోదాములలో నిల్వచేసి వుంచబడ్డాయి. ఈలాగే భీమడోలు బ్లాకుకు చెందిన కైకారం. వూళ్ళ సొసైటీలు కూడా ఎంతో కృషి చేస్తున్నాయి.

## కైకరం సొసైటీ

గత సంవత్సరం దాళ్వా వరిపైరుకు ఒక పౌను రసాయనికపు ఎరువుగానీ, ఒక పౌను మేలు రకపు విత్తనాలనుగానీ యీ సొసైటీనుండి రైతుల కందలేదు. కాని యీ సంవత్సరం సాంద్ర వ్యవసాయ పథకం క్రింద యీ సొసైటి 41 బస్తాల దాళ్వా పంటకు, దాదాపు 1400 బస్తాలు సార్వా పంటకూ రసాయనికపు ఎరువులను సరఫరా చేసింది. అంతేగాక సామర్లకోట 13, మారుటేరు 10 లను మంచి మేలు రకపు వరి విత్తనాలను దాదాపు 120 బస్తాలు రైతులకు సరఫరా చేసింది.

## పూళ్ల సొసైటీ

పూళ్ల కోఆపరేటివ్ సొసైటీ గత సంవత్సరం దాళ్వా పంటకు గాను 330 బస్తాల రసాయనికపుఎరువులను పంచగా, యీ సంవత్సరం సాంద్ర వ్యవసాయ పథకం క్రింద 771 బస్తాలను సరఫరా చేసింది. ఇక సార్వా పంటకుగాను యీ పథకం క్రింద 1100 బస్తాల అమ్మోనియం సల్ఫేటు, 1200 బస్తాల సూపరు ఫోస్ఫేటు రైతులకు సరఫరా చేయటానికి గాను ముందుగానే నిలవచేసి వుంచింది. అంతేగాక సస్య రక్షణార్థం అవసరమైన రకరకాల మందులను, మందులు చల్లే పిచికారీ యంత్రాలను సిద్ధం చేసి వుంచింది

## పెదపాడు బ్లాకులోని కోఆపరేటివ్ సొసైటీల కృషి

పెదపాడు బ్లాకుకు చెందిన పెదపాడు లార్జి స్కేలు కో అపరేటీవు సొసైటీ కూడా గణనీయమైన కృషిచేసింది. ఈ సొసైటీ 1956 లో ఏర్పడింది. గత సంవత్సరం దాళ్వాపంటకు గాను మేలురకపు విత్తనాలుగానీ, రసాయనికపుఎరువులను గాని సరఫరా చేయలేని యీ సొసైటీ సాంద్రవ్యవసాయ పథకం అమలు



మిర్చి పైరుకు అమ్మోనియం సల్ఫేటు వేయడం.

లోనికి వచ్చిన తర్వాత 283 బస్తాల రసాయనికపు ఎరువులు, 14 బస్తాల మేలు రకపు విత్తనాలు యీ సంవత్సరం దాళ్వా పంటకు గాను రైతులకు సరఫరా చేసింది. రైతులకు అప్పులను కూడ సకాలంలో యీ సొసైటీ మంజూరు చేసింది. గత సంవత్సరం ఒక లక్ష 88 వేల రూపాయలు అప్పులు యివ్వగా యీ సంవత్సరం దాళ్వాపంటకు రెండులక్షల 37 వేల రూపాయల అప్పులు యిచ్చింది. అందుకనే యీ సొసైటీ సభ్యత్వం 691 నుండి 772కు కొద్ది నెలల్లో పెరిగింది.

పెదపాడు బ్లాకులో సాంద్ర వ్యవసాయ పథకం అమలు పరచుచున్న గ్రామాలలో మొత్తం ఆరు కోఆపరేటివ్ సొసైటీలు పనిచేస్తున్నాయి. ఈ సొసైటీలన్నీ పెదపాడు సొసైటీవలెనే రైతులకు కావలసిన రసాయనికపు ఎరువులు, మేలురకపు వరి విత్తనాలు సరిపడా సరఫరా చేస్తున్నాయి.

## సస్యరక్షణ

ఈ సంవత్సరం దాళ్వాపంటను తెల్లకంకి పురుగు నుండి కాపాడటానికి దాదాపు 200 పైంట్ల ఎండ్రిను మందును, వేరుకుళ్లు తెగులు రాకుండా వరివిత్తనాలను కలపటానికి 'సెరసాన్' గాను 448 పౌనుల 'అగ్రసాన్' అను మందునూ యీ సొసైటీలు యీ సంవత్సరం నిధి సరఫరా చేశాయి.

## అత్తిలి సొసైటీ

అత్తిలి బ్లాకును చెందిన అత్తిలి గ్రామ కోఆపరేటివ్ సొసైటీ కూడా సాంద్రవ్యవసాయ పథకం అమలు జరుపుటలో ఎంతో కృషి చేస్తోంది. ఈ సొసైటీ గతసంవత్సరం రసాయనికపు ఎరువులు ఒక పౌను కూడా రైతులకందజేయలేక పోయింది. కాని సాంద్ర వ్యవసాయపథకం క్రింద యీ సంవత్సరం దాళ్వా పంటకు గాను 996 బస్తాల అమ్మోనియం సల్ఫేటు రైతులకు సరఫరా చేయబడింది. అలాగే 119 బస్తాల మేలు రకపు వరి విత్తనాలు, 592 బస్తాలు సార్వ వరివిత్తనాలు, తెల్లకంకి పురుగు నివారణకు గాను 225 పైంట్ల ఎండ్రిను మందు రైతులకు సరఫరా చేసింది. ఈ మందును పిచకారీ చేయడానికిగాను రైతులకు స్ప్రేయరు పనిముట్లను అద్దెకు సరఫరాచేసింది.

## సహకార వ్యవస్థ

ఈ విధంగా పశ్చిమ గోదావరి జిల్లాలో సాంద్రవ్యవసాయ పథకం అమలు పరిచే 256 గ్రామాలలో—భీమడోలు, పూళ్ల,



చెఱకు పైరుకు రసాయనికపు ఎరువులు విరివిగా సరఫరా చేయబడింది. దాదాపు 18 అడుగుల పైగా పెరిగిన చెఱకుతోట.

కైకారం, అత్తిలి, దెందులూరు, పట్లూరు, డి. కుముదపల్లి, బాదంపూడి, విజయవాయి ఆదిగాగల 147 కోఆపరేటీవు సొసైటీలలో వాటికి సంబంధించిన దాదాపు 93 రిటేల్ డిపోలు నేడు రైతులకెంతో సేవ చేస్తున్నాయి. రైతుల కవసరమైన ఎరువులు, విత్తనాలు పనిముట్లు వగైరా ముందుగానే సేకరించి నిల్వ చేయడానికి గాను ఇదివరకున్న 37 గోదాములు గాక యింకా 213 గోదాములు కట్టించడానికి ఈ పథకంలో నిర్దేశింపబడింది

. కో అపరేటీవు సొసైటీలు సరిగా పనిచేసేటట్లు చూడటానికి గాను యీ పథకం క్రింద జిల్లా కేంద్రమైన ఏలూరులో ఒక డిప్యూటీ రిజిస్ట్రారు, ఒక కో అపరేటీవు సబ్ రిజిస్ట్రారు నియమించ బడ్డారు. అలాగే ప్రతి బ్లాకులోనూ ఒక కో ఆపరేటీవు ఇన్‌స్పెక్టరు -ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు- నలుగురేసి సూపరువైజర్లు చొప్పున అదనంగా నియమించడానికి యీ పథకంలో నిర్ణయించబడ్డది. ఈ సిబ్బంది యావత్తు ప్రాజెక్టు నిర్వహణాధికారి అధ్వర్యం క్రింద రైతులకు సేవ చేయాల్సి వుంటుంది.

గ్రామ కోఆపరేటీవు సొసైటీలకు అవసరమైన ఎరువులు వగైరా పశ్చిమ గోదావరి జిల్లా మార్కెటింగ్ ఫెడరేషన్ ద్వారా సరఫరా అవుతున్నాయి. ప్రజల మూల ధనంతో. ప్రజల సహకారంతో పనిచేస్తున్న సొసైటీలు ప్రజల అవసరాలను తీర్చాలి. ప్రజలకు సేవ చేయాలి. అలా చేసినపుడే సహకార వ్యవస్థ కలకాలం ప్రజల ఆదరాభిమానాలు చూరగొంటుంది. ఈ విషయం పశ్చిమ గోదావరి జిల్లాలోని సహకార సంఘాలు ఋజావు చేస్తున్నాయి.

రైతులంతా సొసైటీలలో చేరి, సొసైటీలను సమర్థవంతంగా పనిచేసేటట్లు చేయకలిగినపుడే-పశ్చిమ గోదావరి జిల్లాలో సాంద్ర వ్యవసాయ పథకం ద్వారా ఆశించిన దానికంటె అత్యధిక ఫలితాలు పొందటానికి అవకాశముంటుంది. అప్పుడు పశ్చిమ గోదావరిజిల్లా రైతుల కృషి యావద్భారత దేశమంతటా వేనోళ్ల చాటబడుతుంది. ఇందుకు సందేహంలేదు.



గుణంలో ఉన్న రూపాన్ని చూచి యెంత కాలం సంతోషిస్తామో రూపంలో ఉన్న గుణాన్ని చూచి అంత కాలం సంతోషించలేము.

# ఆంధ్ర పాణిని

శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు

ఓ పరవస్తు వంశ కలశోదధి చంద్రమ! యాంధ్ర సాహితీ
రూప జగత్తమస్సమితి రూపఱె సూత్రకరాచ్ఛ కౌముదీ
వ్యాపృతి; విచ్చె సూరి హృదయాంచితకైరవ కోటి; పద్యతం
తూపద సత్కృపం గొనఁ గదోయి యొసంగెద భక్తియుక్తమై.

మున్ను మునిత్రయమ్ము నిజబుద్ధి పటుత్వ మహత్త్వ సంపదన్
సన్నుత వాగ్విలాసముల సంస్కృత వాణికిఁ జేసె వ్యాకృతిన్!
చిన్నయ సూరి! నీవు నటె చెప్పితి వయ్య తెనుంగు బాసక
త్యున్నతిఁ; దన్మునిత్రయ సముద్భవమే యిటు మాకుఁ జేకుఱెన్

"తెలుఁగున కున్న వ్యాకరణ దీపము చిన్నది"యన్న మాటలోఁ
గలదె యొకింతయున్ నిజము? కబ్బము లల్లఁగఁ జాలువెల్గునీ
పలికిన యట్టి వ్యాకృతిన పాటిల దొక్కు? కవిత్వ దృష్టియే
వలయును గాని, లక్షణము బ్రాఁతియె భారతమైన వ్రాయఁగన్!

ఎన్నఁగఁ దొల్లి పాణిని మునీంద్రుఁడు సంస్కృత భాషనెట్టులా
తెన్నున నీవు సూత్రములు తెల్గునఁ జెప్పితి— తక్కినట్టివో
యన్నియు సందియంబు, లధికాక్షర యుక్తు, లసారవంతముల్,
సున్నయ విశ్వతోముఖత— సూత్రము లంటకు నెట్లు పాత్రముల్

ఏలీలన్ రచియింపఁ గల్గితివి సూరీ! నీకు నెట్లబ్బె నీ
పాలుంజక్కెఱ తేనెయుం గలుప నౌ పాకమ్ము? చిత్రమ్ము; సూ
త్రాలా బంగరుఁ దీఁగలా యవి! శిరోధార్యంబు వేదంబు నా
బాలవ్యాకృతి మాకు నాంధ్ర పణినాపత్యంబ! యత్యంతమున్.

బాలవ్యాకరణమ్ము నిట్టు నటు త్రిప్పంగనే యందేవా లో
పాలున్ దోసము లంచు వాకొనఁగ విద్యన్మాను లుంకింత్రు; త
ద్ధీ లోపం బది గాదె? వింత యమృతాబ్ధిన్ నల్పు గన్పట్టు టల్!
ప్రేలం జూపుట లమ్మహీజ చరితన్! విన్నాఁకనుం బాపముల్!

ఏలీలన్ ఋణమీఁగువారలము తండ్రీ! నీకు; నేతాళ ప
త్రాలం జూచితొ కంట వత్తిడి! శాస్త్రి లేవి గాలించితో
జాలిం దూలుచు మాకునిప్డు గల యే సౌకర్యముల్ లేనియా
కాలం బం: దిఁక మేము చేయఁగ నమస్కారంబె శేషించెడిన్.

కన్నుల దుర్విషమ్ము వెలి గ్రక్కెడి కొందఱు జాతికారణో
త్పన్న విరోధి భావమునఁ ద్వద్యశ, మన్యుల కంటఁగట్టఁగాఁ
బన్నిరి కట్టుకైత; లవి వారల బుద్ధికిఁ దారకాణలై
యున్నవి గాని, సత్యమున కుర్వి వికల్పము లున్నె యెన్నఁ దేన్?

చిన్నయ! వెన్న నీ మనసు! చిన్నము నేరదు మోసమన్న; నీ
సన్నిధిఁ జేరి శిష్యులయి సర్వ రహస్యము సంగ్రహించి యా,
తెన్నున బంగ నామమును దిద్దుటఁ బ్రౌఢతఁజూపఁ జూచియుం
జెన్నగు మోముఁదామరను జిన్నగ వొప్పఁగ నుందుదారతన్;

నన్నయభట్ట సత్కవియు, నాకు భవుండును బద్యవిద్యయం
దెన్నఁగ దర్శకత్వమున నెన్నికఁ గన్నటు గద్యమార్గ సం
పన్నతయందుఁ దెల్గునను పైచితి వీవును రాచబాట; యో
చిన్నయ సూరి! యా సరణిఁ జేరఁడె గమ్యము నెవ్వఁ డేఁగినన్?

భావి పురాత నాద్యతన పండితుఁ డెవ్వఁడు గద్యవాక్యమున్
నీవలెఁ జెప్పఁ జాలెడినిఁ— నెయ్యపుఁ బయ్యెర లొయ్యఁవీవఁగన్,
బూవుల తావి గుప్పుమనఁ, బున్నమి వెన్నెల తేట లుట్టిపోఁ,
గోవెల లాలపింపఁగను, గ్రొవ్విరి తేనెల సోన లూరఁ గన్!

నీ గాంభీర్యము, నీ మనఃశుచితయున్, నీ శీవియున్, నీవచః
ప్రాగల్భ్యమ్మును, నీ యుదారతయు, సారళ్యమ్ముఁ, గారుణ్యముం,
నీ గాఢేశ్వర భక్తి మత్త, వినయాన్వితంబు పాండిత్యమున్,
నీ గద్యంబున నీదు లక్షణమునం దెల్లంబులౌఁ, జిన్నయా!

బాలవ్యాకరణంబు తావక యశఃపాథోధికిన్ బూర్ణిమా
ప్రాలేయాంశువు; నీతిచంద్రికా జగద్వ్యాప్తమ్ము తద్దీప్తి, ని
ర్వేలానందధు శారదామల నిశావేళా విహారోత్సవ
శ్రీ లోలత్వమునం జకోరకము మాద్రిన్ జుఱ్ఱెదన్ వెన్నెలల్,

---

అటవిక జాతులు :

# సవరలు - పండుగలు

శ్రీ జి.వి. రామమూర్తి

సవరలు చేసుకొనే ముఖ్య పండుగలలో కొన్ని వారి పంటలకు సంబంధించినవి ఉన్నాయి. ఫాల్గుణ పౌర్ణమి వెళ్ళిన మరునాడు వారికి కొత్త సంవత్సరాది. మనం శుక్ల పాడ్యమి నుండి మాసాలు లెక్కిస్తాము. వారు బహుళ పాడ్యమి నుండి లెక్కిస్తారు. ఉగాది పండుగ చేసుకునేంతవరకు ఆనాటికి కొత్తగా పండిన పండ్లు గాని, కాయధాన్యాలు గాని ఎవరూ తినకూడదు. ఆయా పంటలకు సంబంధించిన పండుగలు చేసుకునే వరకూ పండినవి నేలపాలు కావలసినదే, అయినా సరే వారు తినరు. పిల్లల్ని అయినా తిననివ్వరు. ఈ నియమము మన హిందూ ఆచారము నుండి వారికి వచ్చి ఉండవచ్చును.

ఉగాదికి ముందు రాత్రి—అనగా ఫాల్గుణ పౌర్ణమినాటి రాత్రి ప్రభుత్వ అధికారులన బినోయులు ఉండే గ్రామాలలో కామదహనం చేస్తారు. ఆ కామదహనం జరిగే చోటికి 20 మైళ్ళ దూరము నుండి సవరలు వస్తారు. వచ్చినవారంతా ఆ కామదహనం మంటలో నుండి కొత్త నిప్పును తీసుకొని వెళ్ళి వారివారి ఇండ్లలో ఉండే పొయ్యిలలోని పాతనిప్పును తీసేసి, పొయ్యిని శుభ్రం చేసి, తీసుకువెళ్ళిన యీ కొత్త నిప్పును వేస్తారు. ఆ నిప్పు మరుచటి ఉగాది వరకు ఆరిపోకుండా ఉండేటట్టు జాగ్రత్త పడతారు. ఆ ఉగాదినాడు ఆ కొత్త నిప్పు మీద కొత్తగా పండిన వడ్లు, కూరగాయలు, దుంపలు మొదలయినవి వండుకొని తింటారు. దీనినే కొత్త కలియడమంటారు.

పంటలకు పండుగలు ఉన్నాయి కాని. ప్రతి పంటకూ లేదు. అనాదిగా వాళ్ల పూర్వులు పండిస్తూ వచ్చిన పంటలకే పండుగ చేస్తారు. కంద మూలం (చిలకడ దుంప) పంట పండుగ, "గనుయన్-అ-ఆడుర్" అంటారు. ఒకరకం జొన్నల పంట పంతగ పేరు "కొండెమ్-అన్-అ-అడుర్" మరియొక కాయ ధాన్యం పంట పండుగను ఓసాన్-అ-అడుర్ అంటారు. ఇలాగే కందుల పంటకు, మామిడి పంటకు, మరి కొన్నిటికి పండుగలు చేసుకుంటారు. విత్తులువేసే ముందు (కలుపు) గాబుతీసి భూమిని శుభ్రం చేయడానికి పండుగ చేసుకుంటారు. దున్నే ముందు ఏ పంటకు పండుగ చేయరు.

సవరలకు కూడా కొన్ని పురాణకథలున్నాయి. అవి వారికి ఆర్యుల నుండి వచ్చి ఉండవచ్చును. వారు కిత్తుంగులను, అనగా దేవతలయిన పురుషోత్తములను పూజిస్తారు. ఆ కిత్తుంగులలో "రామన్, భీమన్" అనే పేర్లు గలవారు ఇద్దరు ఉన్నారు. వాళ్ళ

ద్దరూ అన్నదమ్ములట. చాలా ధైర్యవంతులట. చాలా బలమైన వారట.

రాజాన్‌జీ (రాజును) అన పాతరోన్‌-జీ (పాత్రులు) అనే రెండు విధములయిన దేవతలను వీరు ప్రత్యేకముగా పూజిస్తారు. రాజాన్-జీ అంటే పూర్వం ఈ సవరదేశాన్ని పరిపాలించిన రాజు అయుండాలి ఆ రాజును యీనాటికీ దైవసమానంగా వీరు పూజిస్తున్నారు. రెండో దేవత పేరు ఒరియా అధికారి అయిన ఏ పాత్రో పేరో అయుండవచ్చును.

సవరలు ముఖ్యంగా దరమ్మోరాజన్ (ధర్మరాజు) అనే మరొక దేవతను పూజిస్తారు. భగవంతుడైన సూర్యునితో యీ దరమ్మోరాజన్ దేవతను యీ సవరలు పోలుస్తారు. ఇతడే ప్రపంచాన్ని సృష్టించాడని ఇతడే ప్రపంచాన్ని నిలబెడుతున్నాడని యీ సవరల నమ్మకం. ఈ దరమ్మోరాజన్నే "లంకన్" అని కూడా వీరు అంటారు. ఇతర కొండ జాతుల వారైన ముండాలు హోస్‌లు "సింగోబొంగా" పేరుతో సూర్యుడ్నే ఆరాధిస్తున్నారు.

## చావు-శ్రాద్ధం

మన హిందువులనుకునే స్వర్గలోకం సవరలకు లేదు గాని, ఒకప్పుడు మానవునికి చావు అంటూ ఉండేది కాదని, ఆత్మకు యిప్పటికీ చావులేదని వాళ్లు అనుకుంటూ ఉంటారు. సవరభాషలో "లాబానామర్" అంటే చావులేనివాడని అర్థం ఒకప్పుడు మానవుడు పాముల్లాగ పొరవిడచి చిరంజీవిగా యౌవ్వనంతో ఉంటూ ఉండేవాడని సవరలు అనుకుంటూ ఉంటారు. పాములకు, కోతులకు సహజమైన చావులేదట. చంపబడితే గాని అవి చావవట. "నీవు పొర విడువు గాక!" అంటే "నీవు చిరంజీవిగా ఉందువు గాక!" అనిన్నీ "పాములవలెను, కోతులవలెను నీవు చిరంజీవివి అగుదువు గాక!" అనిన్ని వాళ్ళ భాషలో పెద్దలు ఆశీర్వదిస్తూ ఉంటారు.

"మనం పాములమూ పొర విడవడానికి? మనం కోతులమా చిరంజీవులుగా ఉండడానికి?" ఇటువంటి లోకోక్తులు సవరల నోటి వెంట వినవస్తాయి. కోతులు, పాములు ప్రమాదవశాత్తు చనిపోతాయే గాని సహజంగా చనిపోవని నమ్మినట్టే యిప్పటికీ కొంతమంది మనుష్యుల విషయంలో కూడా అనుకుంటారు. అంటే ఎవరైనా చనిపోతే "ఏమొచ్చిందిరా నాయనా ఏ భూతం నిన్ను పొట్టపెట్టుకుందిరా? నీకెవరు చిల్లింగి పెట్టారురా? ఎవరి ఉసురు నీకు తగిలిందిరా?" అంటూ యీ విధంగా ఏడుస్తారే కాని, వయస్సు మళ్ళి చనిపోయారని కాని, జబ్బు చేసి, శరీరంలో శక్తిపోయి చనిపోయారని కాని, సహజమైన చావే వచ్చిందని కాని సవరలు అనుకోరు.

ఇతర అనాగరక కొండజాతులవారి వలెనే యీ సవరలు కూడా ఏ దేవతకో కోపం వస్తే కాని, ఏ దెయ్యమో పగపడితే కాని మనిషికి చావురాదని నమ్ముతారు. చివరకు చెట్టుమీద నుండి క్రిందపడినా ఏదో దేవతకు కోపం వచ్చిందని అనుకుంటారే గాని పడినవాడి అజాగ్రత్త అని గాని, ప్రమాదం అని గాని వారు అనుకోరు

ప్రతి మనిషికి "సుడాపురాద, అబెలెంగ్ పురాద" అనే రెండు ఆత్మలు ఉంటాయని సవరలు అంటారు. "సుడాపురాద" పెద్ద ఆత్మ, రెండవది చిన్న ఆత్మ. అదే దేహమును నిలబెట్టే ప్రాణం. ఈ "అబెలెంగ్ పురాదనే" "రుప్-రుప్ పురాద" అని కూడా అంటారు. ఇది గుండెకాయ వద్దనే ఉంటుంది. మొదటి ఆత్మ సుడాపురాద "శరీరమంతా, శరీరానికి తగిలి ఉండే ప్రతి వస్తువులోను, చివరకు మనిషి విడిచే మలమూత్రాలలో కూడా ఉంటుందిట. ఈ ఆత్మ మనిషి శరీరంతో నిమిత్తం లేకుండా ఉంటుందని అంటారు. దీనికి చావులేదు. ఇది కనబడదు. ఇది మనిషి శరీరాన్ని విడిచిపెట్టి విచ్చలవిడిగా ఎక్కడైనా తిరిగి మళ్ళా తను ఎవరి ఆత్మో వారి శరీరాన్ని వచ్చి చేరగలదట.

మనిషి నిద్రపోతున్నప్పుడు యీ సుడాపురాద ప్రపంచంలో తన యిష్టము వచ్చిన చోటికి వెళ్ళివస్తూ ఉంటుంది. ఇదివరకు చనిపోయినవారి సుడాపురాదాలను కలుసుకొని రాగలదు. అందుకనే మనం చనిపోయిన వారిని కలలో చూడగలుగుతున్నామని సవరలు అంటారు. మనం నిద్రపోతున్నప్పుడు సుడాపురాద ఒక్కొక్కప్పుడు దూరంగా వెళ్ళి ఉండవచ్చును. అలాంటప్పుడు ఎవరైనా మనలను హఠాత్తుగా లేపితే దూరముగా ఉన్న మన సుడాపురాద మనల్ని వెంటనే చేరుకోలేకపోవచ్చును. అందుచేతనే అప్పుడప్పుడు అలాంటి సమయాలలో మనం కంగారు పడడం జరుగుతుంది. కనుక గాఢ నిద్రలో ఉన్నవారిని లేపకూడదు. అంటారు సవరలు.

"మన శరీరాన్ని విడచి సుడాపురాద చాలా సేపు ఉండడం కూడా ప్రమాద"మనే అంటారు సవరలు. ఏ మాంత్రికుడైనా ఆ ఆత్మను పట్టుకుని అది మన శరీరానికి తిరిగి రాకుండా చేస్తే

యీ రెండో ప్రాణం "రుప్-రుప్" పురాడ అట్టే కాలం మన శరీరంలో ఉండదట. సుడాపురాడ, రుప్‌రుప్ పురాడకు ఎప్పటి కప్పుడు శక్తిని యిస్తూ ఉంటుందట. రెండో పురాడకు శక్తి అయిపోతే చనిపోతుంది. దాంతో కూడా శరీరం చనిపోతుంది. ఈ రెండవ ప్రాణం రుప్‌రుప్ పురాడ చనిపోయిన తర్వాత సుడా పురాడ శరీరాన్ని విడిచిపెట్టేస్తుంది. ఒకవేళ ఉంటే శరీరాన్ని కాల్చేసే వరకూ ఉంటుందిట.

శరీరాన్ని పూర్తిగా విడిచిపెట్టేసిన "సుడాపురాడ" ను "కుల్బా" అంటారు సవరలు. కుల్బా అంటే దెయ్యం. చిన్న తనంలోనే ఎవరైనా చనిపోతే వారి సుడాపురాడ కుల్బాగా మారి చనిపోయిన స్థలానికి చేరువలోనే ఉంటుందిట దానికి మళ్ళీ ఆ చనిపోయిన వారింట్లోనే పుట్టాలనే కోరిక ఉంటుందిట ఈ విష యాన్ని ఆ యింట్లో ఉన్నవారికి కలలో వచ్చి చెప్తూ ఉంటుందిట. ఆ సమయంలో ఆ యింట్లో ఎవరికైనా కాన్పువస్తే ఆ దెయ్యం ఎవరిదో వారి పేరు పెడతారు సవరలు. అందువల్లనే బ్రతికి ఉన్న వారి పేరు కొత్తగా పుట్టినవారికి పెట్టడం ఆచారముగా లేదు.

ముసలివాళ్ళు చనిపోతే వారి సుడాపురాడ దెయ్యంగా మారకుండా "కినోరా" దేశం అంటే పెద్దల దేశానికి వెళ్ళి పోవాలని కోరుకుంటుందిట. కాని "గూఆర్" పండుగ చేసే వరకూ వెళ్ళదు. "గూఆర్" రాయిపాతడం అన్నమాట.

## గూఆర్ పండుగ

ప్రతి గ్రామంవారూ యీ పండుగను సంవత్సరానికి ఒక సారి గాని, రెండుమూడేండ్లకు ఒకసారి గాని చేస్తూ ఉంటారు. ఇదివరకు చేసిన గూఆర్ పండుగనాటి నుండీ యీ పండుగనాటి వరకు చనిపోయిన బంధువుల ఆత్మలు ప్రేతలుగానే ఉంటవి. ఆ ప్రేతలను తృప్తిపరచడానికనే యీ పండుగను వారు చేస్తారు.

ఈ పండుగను వారు గ్రామానికి వెలుపలనే చేయాలి. చని పోయినవారి పేరును వారి జ్ఞాపకార్థము ఒక్కొక్క నిడుపు రాయిని పాతుతారు. పాతే ముందు చనిపోయిన వారి వయస్సునుబట్టి రాళ్ళ నిడుపును నిర్ణయిస్తారు. ఆ రాళ్ళను పండుగ ముందే గ్రామానికి తీసుకువచ్చి సిద్ధంగా ఉంచుతారు.

ఇటీవల చనిపోయిన వారి ఆత్మలు తమని కూడా కినోరా దేశంలోకి రావడానికి అంగీకరించమని ఆ దేశంలో ఉన్నవారి పూర్వుల ఆత్మలను కోరతాయట. ఈ పండుగకు ఆ గ్రామంలోని వారందరూ, యితర గ్రామాలలోని వారి బంధువులు, స్నేహితులు అందరూ వస్తారు. ఎవరి శక్తిని బట్టి వారు ఎనుబోతులను, మేక లను, కోళ్ళను తెచ్చి పెద్దల తృప్తికోసం బలియిస్తారు. ఎవరి ప్రేతల తృప్తికోసం యీ పండుగను చేస్తారో ఆ మనుష్యులను చనిపోయిన తర్వాత మోసిన వారికిన్నీ, బుయ్యాగొమాంగ్‌ల కున్నూ మాత్రం బలి యిచ్చిన జంతువుల మాంసం కొంచెం ఎక్కువగా యిచ్చి, యితరులందరూ సమానంగా పంచుకుంటారు. ప్రతీ పండుగనాడూ కల్లుతాగినట్టే యీ పండుగనాడూ కల్లు తాగు తారు.

ఎవరైనా చనిపోతే వెంటనే తీసుకుపోవడానికి ఏర్పాట్లు చేస్తారు. శవవాహకులు యిద్దరు గాని, ముగ్గురు గాని ఉంటారు. శవాన్ని దహనపరుస్తున్నప్పుడు చనిపోయిన వ్యక్తి తాలూకు గుడ్డలు, వస్తువులు మొదలయినవి కూడా ఆ మంటలో వేస్తారు. అలా చేయకపోతే ఆ వ్యక్తియొక్క సుడాపురాడ దెయ్యంగా మారి తక్కిన వారిని బాధిస్తుందని సవరలకు భయం.

శవదహనం జరుగుతున్నంతసేపూ అక్కడ ఉన్న వారంతా తాగి, వాద్యాలను వాయిస్తూ చుట్టూ నృత్యం చేస్తారు.

రెండవ రోజున శ్మశానానికి వెళ్ళి అస్థికలను ఏరి అక్క డనే రెండడుగుల లోతున గొయ్యితీసి వాటిని పాతిపెడతారు. అస్థికలతో పాటు ఒక కోడిగుడ్డును చితకకొట్టి పాతుతారు. కల్లు, మాంసం మొదలయినవి ఉపారంగా పెడతారు. చనిపోయిన వ్యక్తి స్త్రీ అయితే పసుపు కూడా అక్కడ ఉంచుతారు. కర్మ చేయవలసినవారు ఎవరైనా దూరదేశంలో ఉంటే కొన్ని అస్థికలను వేరే ఉంచి వారికి పంపుతారు.

మూడు, నాలుగు లేక అయిదవ రోజున యింటివద్ద వండిన అన్నం, మాంసం, తీసుకు వెళ్ళి దహనపరచిన చోట ఉపారం పెట్టి వస్తారు. తర్వాత గూఆర్ పండుగ చేస్తారు.

## పాపం—పుణ్యం

అలవాటుప్రకారం వస్తున్న ఆచార వ్యవహారాలను సక్ర మంగా పాటిస్తూ, చనిపోయిన వారికి సరిగ్గా కర్మ చేస్తూ, పండుగ లను పాటిస్తూ ఉన్నవాడ్ని సవరలు "బంగ్బామర్" అంటారు. "బంగ్బామర్" అంటే మంచివాడని అర్థం. సాధారణమైన ఆచారాన్ని "ఉక్కా" అంటారు. ఈ ఉక్కానైనా పాటించని వాడ్ని "రంకామర్" అంటారు. అంటే చెడ్డవాడన్నమాట. వారి

దేవతలకు కోపం వచ్చేటట్టు ఏదైనా చేస్తే దాన్ని "ఎర్సీ" అంటారు. ఎర్సీ అంటే పాపం, దోషం, తప్పు అని అర్థం.

సాధారణంగా వారు కట్టుకునే బట్టల్లోగాని, ధరించే ఆచరణాలలో గాని మార్పు ఉంటే, బంగారం నగలు పెట్టుకుంటే అది వారికి తప్పే గాని మరీ అంతపెద్ద తప్పుకాదు. అలాంటి చిన్న తప్పు చేసిన వారిని పెద్దలు మందలిస్తారు. అంతే గాని దానికి ప్రాయశ్చిత్తం అవసరంలేదు. ఒకే గ్రామంలో ఉండే పిల్లను పెళ్ళి చేసుకొనడం తప్పు. ఇటువంటి తప్పుకు చిన్న దండన విధిస్తారు. చెల్లెల్నిగాని, వరుసకు చెల్లెలయిన పిల్లను గాని పెళ్ళిచేసుకుంటే పాపం. దేవతలకు అపచారం చేసినట్టు భావిస్తారు. అందుకు తగిన జరిమానా కట్టి, పెద్దలకు నోనుములకు ఆ పాపం చేసినవాడు బలియివ్వాలి.

అబద్ధం ఆడ్డం, దొంగతనం చేయడం, వరుసకానివారితో వ్యభిచరించడం పెద్ద తప్పు, కాని పాపం కాదు. సంఘం మొత్తం మీద నేరం కాదు. ఎవరికి యీ తప్పువల్ల నష్టం కలుగుతుందో వారికి తగిన నష్టపరిహారం తప్పు చేసినవారిచేత గ్రామ పెద్దలు యిప్పిస్తారు. హత్యను చాలా పెద్ద తప్పుగా వారు భావిస్తారు. గ్రామపెద్దల నిర్ణయం ప్రకారము హంతకుడు చంపబడ్డవారి కుటుంబానికి జరిమానా కట్టాలి.

సవరలలో ఎక్కడో గాని, ఎప్పుడో గాని దొంగతనం, వ్యభిచారం జరగదు. హత్యలు మాత్రం తరచుగా జరుగుతూ ఉంటాయి. సవరవాడు హత్యచేసి కప్పిపుచ్చడు తాను హత్య చేసినట్టు ఒప్పుకుంటాడు. అబద్ధం ఆడమన్నా ఆడడు.

"వ్యభిచారం చేశావా ? అని అడిగితే " వ్యభిచారం చేయ వలసిన అవసరం నాకేముంది ? నాకు ఆ పిల్ల కావాలంటే, నేను ఆ పిల్లకు నచ్చితే ఆమెను తీసుకుపోయి పెళ్ళే చేసుకుంటాను. అంతే కాని నా బీజఫలం నేను పొందడానికి హక్కులేని క్షేత్రంలో నా బీజాన్ని నేనెందుకు వృథాగా ధారపోయాలి ?" అంటాడు.

## నమ్మకాలు

ప్రపంచములో ప్రతిచోట ఏదో ఒక దేవతో, నోనుమ్మో ఉంటుందనే సవరల నమ్మకము సూర్యునికి (లంకనుకు) ఆకాశము నివాసము. సూర్యుడు (సంగ్రాబోజన్) చంద్రున (తుయ్‌తుజన్)కు భార్య. నక్షత్రాలు, గ్రహాలు వారి బిడ్డలు. ఆ బిడ్డల్లో సుంక్రా (శుక్రుడు) దేవతతో సమానం. గాలి (రింజెబోయ్) కూడా దేవతే. వర్షం (గమర్‌బోయ్) మరియొక దేవత. ప్రపంచంలోని వివిధ శక్తులన్నీ నోనుమ్ శక్తులే.

భూదేవి (లబోనుమ్) అనేకమైన దేవతలకు, దెయ్యాలకు ఆశ్రయమిస్తున్నదని సవరలు అనుకుంటూ ఉంటారు. ఇంట్లో ఉండే ప్రతిభాగం, ఊరి వెలుపల ఎల్లిగా ఉన్న ప్రతి రాయి మొదలుకొని అన్నీ కూడా సవరలకు దేవతలే. నీరు కూడా ఒక దేవతే. ఆ దేవతను "జొడాబానుమ్" అంటారు.

"జమా-బోజ్-అన్" అంటే యముడు. ఈ యముడు భూమిలో అడుగున "కిఘోరాయ్" దేశన్ అంటే నరకంలో ఉంటాడు

సవరలలో చాలా మందికి నరకం అంటే భయంలేదు. పెద్దల ఆత్మలన్నీ ఒకేచోట హాయిగా ఉంటున్నాయని, అవన్నీ వారి సంతతిని ఎల్లప్పుడూ కాపాడుతూ ఉంటాయని అనుకుంటారు. ఆ ఆత్మలు పిలుస్తే వస్తాయని కూడా సవరలు అంటారు. పిలువకపోయినా మానవులుగా ఉండినప్పుడు ఏ యింట్లో ఉండెనో ఆ యిండ్లకు రాత్రులు అవి వెళ్తాయని వారు అంటారు. అందుకని ప్రతి సవరవాని యింట్లోను "సోనుమ్-డాంగన్" అనే దేవతల కుండ ఒకటి ఇంటి చూరు కింద ఉంటుంది ఆ కుండలో కొన్ని బియ్యం, కొన్ని మిరపకాయలు, నీరుల్లి గాని, వెల్లుల్లిగాని ఉప్పు, చిన్న అల్లంముక్క, ఒక రాగిపైసా ఉంచుతారు. దానిని మూతపెట్టే ఉంచుతారు. అటువంటి కుండనే మరొకదానిని యింట్లో ఒక మూల మూడు రాళ్ళపైన ఉంచుతారు. ఈ కుండలో వండిన అన్నం ఉంటుంది. ఈ రెండు కుండలకు పైన పసుపు పోస్తారు. వాళ్ళ పెద్దలు దెయ్యాలుగా వచ్చినప్పుడు యీ కుండలలోని దినుసులను తినరు గాని వాసనచూసి పోతారుట. అలా వారు వాసన చూడ్డం వల్లనే ఆ దినుసులలోని పత్తాపోయి రుచిలేకుండా పోతాయట. అందుకనే యీ కుండలలోని పాత దినుసులను తరచుగా, ముఖ్యంగా పంటలు పండిన తర్వాత తీసివేసి కొత్తవి ఉంచుతారు. అలా మార్చకపోతే వారి పెద్దలకు కోపం వస్తుందట. కుండలలోని పాత దినుసులను మార్చనివారు. వారి పెద్దలను పూనకం ద్వారా పిల్చినప్పుడు ఆ పెద్దల ఆత్మ అంటుందట, "నీకు అవసరము వచ్చినప్పుడు నా సహాయం కోరతావే గాని నీ యింట్లోని ఆ పవిత్రమయిన కుండల్లోని పాత దినుసులను తీసివేసి కొత్తవి పెట్టడానికి మాత్రం నీకు ఓపికలేదు" అని,

సవరలలో కొంత మంది చనిపోయినవారి ఆత్మలను పిలవ మంచే ఆ విద్య పట్టుపడినవారు పిలవగలరు. ఎవ్వడైనా సవరవాడు తన కొడుకునకు ఏమీ చెప్పకుండా చనిపోతే అతని కొడుకు వాని తండ్రి ఆత్మను పిలిపిస్తాడు. ఆ పిలిచేవానిలోకి తన తండ్రి ఆత్మ ప్రవేశించి తనను అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్తుంది ఆ సమయంలో ఆ ఆత్మ కల్లు కావాలని అడిగితే చిన్న కుండలతో యిస్తారు. పూనకంలో ఉన్న వ్యక్తి ఆ కల్లును ఆరగించినట్టుగా వాసన చూసి వదిలి వేస్తాడు. అంతేగాని కల్లును తాగడు. అలా వాసన చూసిన కల్లుకు రుచీ, వాసన పోతాయట. పిలిపించిన వారు అడిగిన ప్రశ్నలకు చనిపోయిన వారి ఆత్మ పిలిచిన వారి నోటి వెంట సమాధానాలు చెప్తుంది. ఆ సమాధానాలు ఆ వ్యక్తి నోటి వెంట వచ్చినా పూనిన ఆత్మ ఎవరిదో ఆ వ్యక్తి బ్రతికి ఉన్నప్పుడు మాట్లాడినట్టే అవి వినబడతాయి. అంతేకాదు ఆ ఆత్మ ఎవరిని పూని ఎవరి నోటి ద్వారా పలుకుతుందో ఆ వ్యక్తికి ఏమీ తెలియదు. ఆ ఆత్మ వెళ్ళిపోయిన తర్వాత "ఆ ఆత్మ ఏమి అన్నది ?" అని ఆ వ్యక్తి అడగడంకూడా జరుగుతూ ఉంటుంది.

పెద్దల ఆత్మలు తరచుగా రాత్రిళ్ల తాము యిదివరకుండిన యిళ్లకు వస్తాయట. కత్తులు, కటారులు మొదలయిన ఆయుధాలు చప్పుడయితే మగవారి ఆత్మలు వచ్చాయని, కుండలు మొదలయినవి చప్పుడయితే ఆడవారి ఆత్మలు వచ్చాయని సవరలు అనుకుంటారు. పూనకంద్వారా పిలిస్తే తప్ప యీ ఆత్మలు పగటిపూట రావట. అయితే యీ ఆత్మలు పెద్దల దేశం వెళ్లకుండా మరియొక జన్మ యెత్తితే పూనకంద్వారా పిలిచినా రావని అంటారు. పెద్దల ఆత్మలనే కాక దేవతలనుకూడా పూనకంద్వారా పిలవగలరు

ఈ సోనుమ్ దేవతలు. దెయ్యాలు పగటిపూట 11 గంటల ప్రాంతంలో కొండలమీదినుండి పారే సెలయేళ్లలో స్నానం చేస్తాయట, అందుకని ఆ సమయములో సెలయేళ్లలోని నీటిని పాడు చేయకూడదని సవరలు అంటారు. పొరపాటున ఆ సెలయేళ్లలోని నీటిని పాడుచేసినా ఏదో ఒక వ్యాధి వస్తుందని వారి నమ్మకము.

సవరలలో నమ్మకాలు ఎక్కువ. కొన్ని నమ్మకాలు మనకు ఉన్నట్టే ఉన్నాయి. ఎవరు చేసుకున్నబట్టివారు వచ్చే జన్మములో జంతువులుగాను, పక్షులుగాను, పుడతారనే నమ్మకం వారికి ఉంది. అందుకనే వారు చనిపోయినవారికి ఆఖరు రోజున కర్మ చేస్తున్నప్పుడు మేకపోతునో, దున్నపోతునో, పందినో బలి యిస్తున్నప్పుడు యిదివరకు చనిపోయిన పెద్దలను ప్రార్థిస్తారు. ఎవరి కర్మ చేస్తున్నారో వారికి కూడా పెద్దల దేశంలో స్థానం యిమ్మని. బలి జంతువులను బలి యిస్తున్నప్పుడు అవి అరవకూడదట. అవి అరవడం పెద్దలకు యిష్టముండదట. బలి యివ్వడానికి తీసుకుపోతున్న కొన్ని జంతువులకు ఆ విషయం తెలుసునేమో అన్నట్టు విచారంగా కనబడతాయి ఆ బలినిచ్చే జంతువులలోనికి ఎవరి ఆత్మ శాంతికోసం వాటిని బలి యిస్తున్నారో వారి సుడాపురాడ ప్రవేశిస్తుందట, అందుకని ఆ జంతువుకు, బలి యిచ్చేముందు మేత పెడతారు. ఆ జంతువు మేతను తినకపోతే చనిపోయినవారి కోరికలలో దేనినో వారి బిడ్డలు తీర్చలేదని అనుకుంటారు, అటువంటిది ఏదైనా గుర్తుకు వస్తే వెంటనే ఆ కోర్కెను తీర్చడానికి ప్రయత్నిస్తారు

నిత్యకృత్యాలలో వారికి కొన్ని నమ్మకాలు ఉన్నాయి. మొగుడు పెళ్లాం పేర్లు పెట్టి పిలుచుకో కూడదట. "పిల్లల తండ్రీ !" "పిల్లల తల్లీ" అన్నట్టు పిలుచుకుంటారు.

కత్తులు మొదలయిన ఆయుధాలు ఆకలితో ఉంటాయట ! అందుకని వాటితో పిల్లలను ఆడుకోనివ్వరు. పిల్లలు బియ్యాన్ని జల్లితే "ఆ బియ్యం ఏడుస్తాయి, అలా చల్లవద్దు" అంటారు పెద్దలు.

ఎవరైనా పొలమారితే "నిన్ను ఎవరు తలచుకుంటున్నారు ?" అని అడుగుతారు.

ఎవరైనా పనిమీద వెళ్తున్నప్పుడు ఎవరూ తుమ్మకూడదు. కుక్క, పిల్లి, ఆడమనిషి, పీనుగు ఎదురుగా రాకూడదు. నక్క, నల్లకోతి, ఆవు, చిలుక, మైనగోరు, కొండ ఎలుక ఎదురు వస్తే శుభమట.

కలలో ఎలుగుబంటీ, ఏనుగు వస్తే మంచిదట. గాడిద, పంది, పిల్లి కలలో రాకూడదు.

ఇంద్ర ధనస్సు కనబడితే గ్రామానికి ఏదో నష్టం వస్తుందంటారు.

ఉత్తరంవైపు తలపెట్టి పడుకోకూడదు.





బుర్రకథ-31-1-62న హైదరాబాదులోని అఖిలభారత పారిశ్రామిక వస్తుప్రదర్శన థియేటర్‌లో పౌర సంబంధాల శాఖ యేర్పాటుచేసిన సాంస్కృతిక ప్రదర్శన సందర్భంలో



27-1-62 న దేవధర్మాదాయ, సహకార శాఖామంత్రి అధ్యక్షతన సహకార వ్యవసాయ సంఘం ద్వితీయ సమావేశం జరిగినది.



పతక ప్రదానం— విశిష్టమైన లేక ప్రతిభావంతమైన సేవచేసిన ఆరుగురు పోలీసు అధికార్లకు రాష్ట్ర గవర్నరు 1962 రిపబ్లిక్ దినోత్సవాన సికింద్రాబాదులో పతకాలను బహూకరించారు. బహుమతి గ్రహీతలు చిత్రంలో కుడి నుండి యెడమకు వరుసగా శ్రీయుతులు (1) ఎస్. వి. శ్రీనివాసులు నాయుడు, ఐపిఎస్, పోలీసు సూపరింటెండెంటు (రిటైర్డు) పూర్వం హైదరాబాదు క్రైంబ్రాంచి సి. ఐ. డి. (విశిష్టసేవకు ప్రెసిడెంటు పోలీసు–ఫైర్ సర్వీసెస్ పతకం) (2) ఎఫ్ బి. పటేల్. పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు. క్రైంబ్రాంచి. సి ఐ.డి, హైదరాబాదు. (పైనచెప్పిన పతకం వంటిదే) (3) డబ్ల్యు. సుబ్బారావు, ఐ, పి. ఎస్., పోలీసు సూపరింటెండెంటు, నల్గొండ (ప్రతిభావంతమైన సేవకు పోలీసు పతకం ) (4) అబ్దుల్ హమీద్ ,పోలీసు ఇనస్పెక్టర్, సి. ఐ. డి. స్పెషల్ బ్రాంచి, హైద్రాబాదు, (పైనచెప్పిన పతకంవంటిదే ) (5) ఆర్. శ్రీనివాసులు, పోలీసు ఇనస్పెక్టర్, అవినీతి నిర్మూలన శాఖ, హైదరాబాదు. (పైనచెప్పిన పతకంవంటిదే), (6) సి. వి. నారాయణరెడ్డి, పోలీసు ఇనస్పెక్టరు, సి. ఐ, డి. స్పెషల్‌బ్రాంచి, హైదరాబాదు (పైనచెప్పిన పతకంవంటిదే)




నాగార్జునసాగర్‌లో 27-1-62 నుంచి 7-2-62 వరకు జరిగిన ఖాదీ, గ్రామ పరిశ్రమల ప్రదర్శనలో సమాచార, పౌరసంబంధాల శాఖ యేర్పాటు చేసిన్నయీ పెవిలియన్‌కు ద్వితీయ బహుమతి వచ్చింది.



స్వప్నజగత్తులో కవి: 14-2-62 న హైదరాబాదులోవి సమాచారశాఖ ఆవరణలో జరిగిన ఫ్రెంచితోలు బొమ్మలాటల ప్రదర్శనంలో ప్రేక్షక సమూహాన్ని ముగ్ధులను చేసిన బొమ్మలలో యిదొకటి. ఈ బొమ్మలాటను ఆడించిన వారిపేరు· పిలిప్‌గెంటీ సెర్‌జాగి



శ్రీకాకుళంలో సాంస్కృతిక ప్రదర్శన: శ్రీకాకుళం ప్రభుత్వోన్నత పాఠశాలలో ప్రజాశిక్షా ప్రచార వారోత్సవం సందర్భంలో యేర్పాటైన సాంస్కృతిక కార్యక్రమంలో పాల్గొన్న ఆ పాఠశాలా విద్యార్థినులు కుమారిలు ఆర్. సుందరమ్మ. డి. ధనలక్ష్మి (10 వ. తరగతి)



ఒక రూపాయ పొదుపు పథకం: నల్గొండ జిల్లా ఆలయిర్ పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ కె చెన్నారెడ్డి, ఆలయిర్‌లో పనివారికి ఒక రూపాయ సేవింగ్స్ స్టాంపులను యిస్తున్నారు.



విశాఖపట్నం నౌకాశ్రయంలో అదనపు నాలుగు బెర్తుల పథకం—రూ 3 15 కోట్లు ఖర్చయ్యే యీ పథకానికి 17-1-62న కేంద్ర రవాణా శాఖామంత్రి డా. పి సుబ్బరాయన్ శంకుస్థాపన చేశారు



విశాఖపట్నం సమీపంలో గల పొగిరిలో కుష్ఠునివారణ ప్రాజెక్టు—దీనికి 28-1-62 న డేనిష్ ప్రధాన మంత్రి డా. విగ్గో కాంప్‌మాన్ శంకుస్థాపన చేశారు.



కాళహస్తి దేవాలయం



బహుమతి ప్రదానం: 1962 రిపబ్లిక్ దినోత్సవమునాడు శ్రీ సంక్షేమశాఖ ప్రదర్శించిన ఉత్తమప్రతిమకు రాష్ట్ర గవర్నరు బహుమతినిస్తున్న దృశ్యం (ఈ ప్రతిమ ప్రతికృతి యీ సంచిక ముఖచిత్రంలో యివ్వబడినది.)



తుదియాత్ర: ఆంధ్రప్రదేశ్ శాసనసభ అధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు 26-2-62 న పరమపదించారు. ఆయన భౌతిక కాయానికి ఊరేగింపు జరిగినప్పుడు విజయవాడ పురవీధులలో భక్తి ప్రపత్తులతో దర్శనార్థం గుమిగూడిన అశేష ప్రజానీకాన్ని చిత్రంలో చూడవచ్చు.



ఆంధ్రప్రదేశ్‌లో విరమించనున్న మంత్రివర్గం ఛాయా చిత్రం—౨౮—౨—౬౨ న తీయబడినది

ఎన్నికల ఫలితాల బోర్డు: హైదరాబాదులో సమాచార, పౌర సంబంధాల శాఖ కార్యాలయం వెలుపల కట్టబడినది, సాధారణ ఎన్నికల ఫలితాలు తెలిసీ తెలియగానే ప్రజోపయోగార్థం యిక్కడ ప్రదర్శింపబడేవి.

### గిరిజన ప్రాంతంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

మన సమాజంలోని వెనుకబడిన వర్గాలవారు చైతన్య వంతులై పురోగమిస్తున్నారు స్వయం సహాయం ప్రాముఖ్యతను వారు గుర్తించారు. ఇటీవల పశ్చిమ గోదావరి జిల్లా, పోలవరం బ్లాకులోని లక్ష్మీ నారాయణదేవిపేట గ్రామ ప్రజలు, గిరిజనులు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నిమిత్తం రూ. 6,000 ల రొక్కాన్నీ రెండు ఎకరాల భూమినీ విరాళంగా యిచ్చారు. శ్రీయుతులు బొమ్మ బాపిరాజు, కొప్పాక వీరభద్రరావుగారలు ముఖ్య దాతలు.

### రేడియో శ్రోతల బృందాలు

వివిధ వినోద సాధనాల్లో ఈ నాడు రేడియో ప్రసారాలకు ప్రముఖ స్థానం వుంది విభిన్న ప్రసార కార్యక్రమాలలో వార్తా ప్రసారాలకు బహుజనాదరణ లభిస్తున్నది. ప్రపంచ వార్తలు నోటితో చెప్పినప్పుడు. వాటికి భావా వేశంతో నిమిత్తం లేకపోయి నప్పటికీ, వాటికి బలవత్తరమైన నాటకీయత, వాస్తవికత యేర్పడుతుంది.

1962 జనవరిలో చిత్తూరు జిల్లా, నగరి పంచాయతీ సమితి, నైనర్కండిగ యువజనులు, రేడియో కొనుగోలుకై రూ. 500 లు విరాళంగా ఇచ్చారు మహబూబ్‌నగరం జిల్లా కొల్లాపూర్ సమితిలో రేడియో శ్రోతల బృందాలను మూడింటిని నెలకొల్పారు.

### శ్రమదానంతో రోడ్డు నిర్మాణం

ఈ నాడు మన దేశంలో "శ్రమదానం" అభివృద్ధి కార్యక్రమాలలో భాగంగా ఏర్పడింది. పల్లె ప్రాంతాలలో "శ్రమదానం" క్రమ పద్ధతిలో నిర్వహించబడుతున్నది.

నిజామాబాదుజిల్లా ఆర్మూర్ పంచాయతీసమితి మగ్గి గ్రామ ప్రజలు, విద్యార్థులు 1962 జనవరిలో శ్రమదానం ద్వారా ఒకటిన్నర మైలు పొడవు రోడ్డును

## పంచాయతీరాజ్య ప్రజోద్యమం

నిర్మించారు. ఈ పని విలువ సుమారు రూ. 1,000 వుంటుంది.

### గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం

వెనుకబడిన ప్రాంతాలలో సైతం, ఈనాడు దేశాభివృద్ధి కార్యకలాపాలలో పాల్గొనడానికై మహిళలు అత్యధిక సంఖ్యలో ముందుకు వస్తున్నారు. దేశ పునర్నిర్మాణ కృషికి అవసరమైన శక్తిని వారు పెంపొందించుకుంటున్నారు.

శ్రీకాకుళం జిల్లా భద్రగిరి బ్లాకులోని గుమ్మలక్ష్మీపురం గ్రామంలో జనవరి 21 నుండి 28 వరకు కేవలం మహిళల కొరకు గ్రామసహాయకుల శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు, యాభై మంది స్త్రీలు, శిక్షణ పొందారు.

### కుట్టు మెషిన్ల పంపిణీ

పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడు పంచాయతీసమితివారు స్థానిక కుట్టుపని కేంద్రంలో శిక్షణ పొందిన మహిళలకు 26 కుట్టు మెషిన్లను పంపిణీ చేశారు. వీటికి అయిన ఖర్చులో సగం మొత్తాన్ని సమితి భరించగా మిగతా మొత్తాన్ని మెషిన్లు పొందిన వారు భరించారు.

### మధ్యాహ్న భోజన కేంద్రం

మహబూబ్‌నగరం జిల్లా ధన్వాడ పంచాయతీ సమితి కొండాపూర్ గ్రామంలో 1962 జనవరి 1 వ తేదీన మధ్యాహ్న భోజన కేంద్రాన్ని ప్రారంభించారు. గ్రామ పంచాయతీ, యువజన సంస్థవారు గ్రామస్థుల నుంచి ధాన్యం స్వీకరించారు. ప్రస్తుతానికి ఈ కేంద్రంలో 20 మంది బీద హరిజన విద్యార్థులకు భోజనం సరఫరా చేస్తున్నారు.

### ఎనిమిది ఎకరాల దానం

నెల్లూరు జిల్లా, కొండపి పంచాయతీ సమితి కామేపల్లి ప్రజలు ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, మాధ్యమిక పాఠశాల భవన

నిర్మాణానికి ఎనిమిది ఎకరాల స్థలాన్ని విరాళంగా ఇచ్చారు

## ఒక్క నెలలో 50 యువజన క్లబ్బుల స్థాపన

ఆదోని పంచాయతీసమితి ప్రాంతంలో 1962 జనవరిలో 15 యువజన క్లబ్బులను స్థాపించారు. గొప్ప ఉద్యమాలన్నింటిలోనూ యువజనులు ఎల్లప్పుడూ ముందంజ వేస్తున్నారు. సమాజాభివృద్ధి రంగంలో కూడా వీరు ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. ఈ క్లబ్బులు చాలా చురుగ్గా పనిచేస్తున్నాయి. సమాజానికి ఉపయుక్తమైన అనేక పథకాలను ఇవి చేపట్టుతున్నాయి.

## శాయిగూడలో గ్రామీణ బ్యాంకు

నల్లగొండజిల్లా ఆలేరు పంచాయతీ సమితి శాయిగూడలోని, సహకార గ్రామీణ బ్యాంకు, సహకార పరపతి రంగంలో మంచి అభివృద్ధిని సాధించింది. ఈ బ్యాంకు ఇప్పటివరకు ఈ ప్రాంతంలో నివసిస్తున్న రైతులకు రూ. 2.44 లక్షల మేరకు ఋణాలు ఇచ్చింది. 820 గ్రామీణ కుటుంబాలకు దీనివల్ల ప్రయోజనం చేకూరింది.

## ఉత్తమ పంచాయతీ

నందిగామ పంచాయతీసమితిలోని బండిపాలెం పంచాయతీని 1960_61 వ సంవత్సరానికి ఉత్తమ పంచాయతీగా ఎన్నిక చేశారు. జనవరి 29 వ తేదీన దీనికి ''పంకజం రామారావు షీల్డు'' ను ఇచ్చారు.

## పాల పంపిణీ కేంద్రం

అనంతపురంజిల్లా కొడిగినహళ్లి గ్రామంలో జనవరి 22వ తేదీన పాఠశాల పిల్లల నిమిత్తం ఒక పాల పంపిణీ కేంద్రాన్ని తెరిచారు. దీనిలో రోజుకు సగటున 75 మంది పిల్లలకు పాలు సరఫరా చేస్తున్నారు.



ఆదరించడాన్ని మించిన ఐశ్వర్యదానం మరోటిలేదు.

* * * *

అందరిఅనుభూతికీ అందే ప్రేమను ఆరాధిస్తే అమరత్వాన్ని ప్రసాదిస్తుంది.

# బాల వ్యాకరణ విశిష్టత

శ్రీ బులుసు వేంకట రమణయ్య

భాషా స్వరూపావగతికీ, భాషలోని పద, వాక్య ప్రయోగాల సాధుత్వాసాధుత్వ నిర్ణయానికీ వ్యాకరణం ఎంతో ఆవశ్యకమై ఉన్నది. లక్ష్య గ్రంథాల ననుసరించి లక్షణం ఏర్పడడం సహజం కావున "ప్రయోగ మూలం వ్యాకరణం" అని పెద్దలే ఎన్నడో నిర్ణయించారు.

తెలుగుభాషకు సంస్కృతంతో ఎక్కువ సంబంధం వుంది. మూడు వంతుల పదాలు సంస్కృతం నుంచి తత్సమ రూపంగా తెలుగులో ప్రవేశించాయి. ఆంధ్రకవులూ విద్వాంసులూ సంస్కృతంలో గట్టి పాండిత్యం సంపాదించి వుండేవారు. అందువల్ల సంస్కృత వ్యాకరణంలో చక్కని పాండిత్యం వుండడం వల్లనూ, తగు మాత్రం ఆంధ్ర భాషా నియమాలను జ్ఞప్తిలో వుంచుకుని సంస్కృత లక్షణముల మూలంగానే గ్రంథాలను చక్కగా అర్థం చేసుకోవడం పరిపాటి కావడం వల్లనూ మొదట్లో ఆంధ్ర వ్యాకరణ రచనకు తగినంత అవసరం ఏర్పడి వుండలేదని తోస్తుంది నన్నయభట్టు కాలంలో ఆంధ్ర వ్యాకరణం వుండినట్లు లేదు. ఆ ఆదికవి తన మహాభారతంలో సంస్కృత (తత్సమ) పదాలనే అధికంగా వాడి, తెలుగు పదాలను తగు మాత్రంగా ఉపయోగించాడు. తిక్కన సోమయాజి తెలుగు పదాలను అధికంగా ప్రయోగించాడు. అతని కాలంలో కూడా ఏ ఆంధ్ర వ్యాకరణమూ లేదు. అతడు లక్షణాన్ని అనుసరించి తన భారతరచనను సాగించలేదు ఆ కాలంలో శిష్టుల వాడుకలో ఉండే ప్రయోగాలనే అతడు స్వీకరించి ప్రయోగించాడని మనం ఊహించవచ్చును. ఆ కవిబ్రహ్మను గురుస్థానంలో ఉంచుకొన్న కేతన మాత్రం తెలుక్కి ఒక చిన్న వ్యాకరణాన్ని పద్యరూపంగా రచించాడు తనదే తొలి వ్యాకరణమని అతడు కంఠోక్తిగా చెప్పుకొనడం వల్ల అంతకు పూర్వం తెలుగునకు వ్యాకరణం లేదని నిశ్చయించవచ్చును అతని ఆంధ్రభాషాభూషణం చాలా సంగ్రహయాపమైనది స్థూలంగా భాషా లక్షణాన్ని గుర్తించడానికి ఆది సహకరించగలదు భాషలోని పదాలన్నింటినీ సాధించవలెననే ఉద్దేశం ఆ వ్యాకర్తకు ఉన్నట్లు కానరాదు.

ఆంధ్ర శబ్ద చింతామణి తొలి వ్యాకరణ గ్రంథమనీ, అది నన్నయభట్టు కృతమనీ—కొందరి అభిప్రాయం. ఆ గ్రంథమూ, దానికి శేషగ్రంథమైన వికృతి వివేకమూ చాలా అర్వాచీనాలైనట్లు వానిలోని విషయాన్నిబట్టే తెలుస్తుంది. ఏమైతేనేమి ? అవి కొంత వరకూ విపులంగా ఉండడంవల్లనూ, వానిలోని సూత్రాలు కంఠస్థం చెయ్యడానికి అనుకూలంగా సంస్కృత శ్లోకాలలో రచించబడడం

# మా గ్రామం

"చిత్రభాను"

అన్నిటికన్న ప్రియమైనది మాగ్రామం !
ప్రవహిస్తోంది ధారాపాతంగా ప్రేమసలిలం!!

నాలుగుప్రక్కల నందనవనంలా
పక్షుల కిలకిలారావాలు
ఇక్కడి ప్రకృతి అనుపమైంది
అన్ని ఋతువుల్లోనూ ఆకుపచ్చదనం.

కోకిల కూస్తుంది ఈ ఉపవనంలో
తనమధురమైన 'కుహూ' స్వరాల్లో
వర్షాకాలం వచ్చింది యిప్పుడు
ధాత్రిపైన నూతన పరిస్థితి చూడు

పచ్చదనంతో శోభిస్తున్నాయి పంటలు
మనస్సు ప్రఫుల్లిత మవుతున్నది
నదిలోని యిసుక తళతళా మెరుస్తోంది,
అందంతో మోహింపచేస్తోంది

అందమైన కమలాలు ఎంతసుందరంగా వున్నాయి!
అజ్ఞాతంగా మనస్సు సుఖాన్ని పొందుతోంది
అంతా మాట్లాడుతారు సత్యవచనాలు
ఇక్కడవుండవు నగరాలలోని రోగాలు.

బాలురు ఎన్నిఆటలు ఆడతారు!
స్వయంగా రైలుబండి అభినయాలు చేస్తారు
మాలో మాకున్నది సోదరత్వం
అటు వంటి ప్రియమైనది మాగ్రామం

ప్రేమతో మాగ్రామం పిలుస్తోంది
మానవ హృదయాన్ని మోహింప చేస్తోంది
అన్నిటికన్న ప్రియమైనది మాగ్రామం
సేవా-శక్తి-ప్రేమల ధారాపాతం

[శ్రీ విష్ణుకుమార్ మాలవీయకు కృతజ్ఞతలో]



# విశేషాలు

"ప్రశస్తమైన పాత్ర"

శ్రీమతి ఇందిరాగాంధి 1961 నవంబరులో అమెరికాలోని మహిళల జాతీయ ప్రెస్ క్లబ్‌లో ప్రసంగిస్తూ భారత దేశం అభివృద్ధికి సంబంధించిన పెక్కు విషయాలను పేర్కొన్నారు. స్వాతంత్ర్యోద్యమ పూర్వ చరిత్ర, సాంఘిక సంస్కరణలు, భారతదేశ చరిత్రలో మొదటినుంచీ మహిళలు వహిస్తున్న ప్రముఖ పాత్ర, విద్యావిధానాలు, కుటుంబ నియంత్రణ ఇత్యాది అంశాలను ఆమె ప్రస్తావించారు. ఆంధ్ర ప్రదేశ్‌లోని ఒక గ్రామం (మట్టంపల్లి, నల్గొండ జిల్లా) లో ఆగ్రామ పంచాయతీకి అందరూ మహిళలే ఎన్నుకోబడిన విషయాన్ని పేర్కొని ఆమె సదస్యులను సంతోష పరిచారు, స్త్రీలు "ప్రశస్తమైన పాత్ర" వహిస్తున్నారని శ్రీమతి ఇందిరాగాంధి అన్నారు.

"అమెరికా పునర్దర్శనం" నుంచి ఎన్. సి. సి..

ఆంధ్ర సర్కిలు :

రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా కొత్తఢిల్లీలో జరిగిన ఎన్. సి. సి. పోటీలలో ఆంధ్ర ప్రదేశ్‌నుంచి పాల్గొన్న ఎన్. సి. సి. బృందం అద్భుతమైన ప్రతిభను ప్రదర్శించింది ఆంధ్ర ప్రదేశ్ బృందం, ఎన్. సి. సి. ఇంటర్ సర్కిల్ బానర్‌ను గెలుచుకున్నది. ఈ సంవత్సరపు ఉత్తమ సర్కిలుగా నిర్ణయించబడినందుకు ఆంధ్ర ప్రదేశ్ బృందానికి ఈ గౌరవ పతాకం లభించింది మరో అరు బహుమతులుకూడా ఆంధ్ర ప్రదేశ్ బృందం వారికి లభించాయి. వీరు ఫిబ్రవరి 2 వ తేదీన నగరానికి తిరిగి వచ్చారు.

రాష్ట్ర ప్రగతికి ప్రశంసలు :

ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ ఫిబ్రవరి 3 వ తేదీన విశాఖపట్నంలో బహిరంగ సభలో ప్రసంగిస్తూ అన్ని రంగాలలోనూ అప్రతిహతమైన అభివృద్ధిని సాధించినందుకు ఆంధ్ర ప్రదేశ్‌ను అభినందించారు.

వ్యవసాయ రంగంలో ఆంధ్ర ప్రదేశ్ చక్కగా అభివృద్ధిని సాధించిందనీ. ఇప్పుడిది ఈ రంగంలో అగ్రస్థానానికి అతి చేరువలో వుందనీ ప్రధానమంత్రి అన్నారు. పరిశ్రమల రంగంలో కూడా రాష్ట్రం బాగా పురోగమిస్తున్నదని ఆయన వాక్రుచ్చారు. చెరుకుగడ సగటు దిగుబడి ఎకరానికి 40 టన్నులుకాగా, ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక రైతు ఎకరానికి 152 టన్నుల దిగుబడిని సాధించాడనే విషయాన్ని తెలుసుకొని తాను ఆశ్చర్య చకితుడైనట్టు శ్రీ నెహ్రూ తెలిపారు.

ఆంధ్ర ప్రదేశ్ రాజస్థాన్ రాష్ట్రాలు బ్రహ్మాండమైనటువంటి పంచాయతీరాజ్య ఉద్యమాన్ని ప్రారంభించాయనీ ఇతర రాష్ట్రాలు ఈ మార్గాన్ని ఇప్పుడు అనుసరిస్తున్నాయనీ ఆయన అన్నారు.





సందగిరి బంగారుమామా

చంద్రగిరి చీరాలం పేవా

బంగారుమామా బంగారుమామా

చంద్రగిరి చీరాలం పేవా




# చేనేత వస్త్రాలు

మన సంప్రదాయానికి చిహ్నాలు

DA 61/581

కథానిక:

# పంచ భూతాలు

శ్రీ రావూరి భరద్వాజ

( మొదటి భూతం చెప్పిన కథ )

నా పేరు శేషగిరి. మా స్వగ్రామం బడేపురం. నాకు ఆట్టే ఆస్తిపాస్తులేమీలేవు. చదువుకూడా అంతంత మాత్రంగానే వచ్చు. అసలు మా వంశంలో చదువనేది ఆనవాయితీ లేదు. మా తాతకు చదువురాదు మా నాన్నకు రాదు. నన్నయినా ఓ ప్రయోజకుణ్ణి చేయాలన్న ఉద్దేశంతో, మా మేనమామగారు శతపోరు లాడాట్ట. ఆ సమస్యను భరించలేక మా నాన్న నన్ను కోటయ్య పంతులు గారి వీధి బడిలోకి పంపించాట్ట.

కోటయ్య పంతులుగారు పిల్లలకు చదువు చెప్పే పద్ధతిలో భయంకరమైన విధానాలు చాలా ఉన్నాయి. ఆలస్యంగా వచ్చిన వారినీ, పాఠం వొప్పచెప్పలేని వారినీ, కోదండం తీయించి అరికాళ్ళమీద ఈతబెత్తాలతో బాదడమూ, పెద్ద గుంజీళ్ళు తీయించడమూ, వొంటికాలిమీద గోడకుర్చీ వేయించడమూవంటి నాజూకులు చాలా ఉండేవి. అవన్నీ చూశాక—దిక్కుమాలిన చదువు లేకపోయినా మా బాగే ననిపించింది నాకు.

ఇన్నేళ్ళొచ్చాక, ఇంత జీవితం చూశాక కూడా, నాకు చదువు పట్ల సదభిప్రాయం లేనే లేదు. చదువు మనిషికి వివేకాన్నిస్తుందనడాన్నికూడా నేను నమ్మలేకుండా ఉన్నాను. ఎందుకంటున్నానంటే—రాత్రింబవళ్ళు బళ్ళకోదీ పుస్తకాలు పడచదివి, పెద్ద పెద్ద డిగ్రీలు తెచ్చుకొన్నవారు. అటా డబ్బులు సంపాదించలేకా, పెళ్లాం పిల్లలను పోషించక లేక దేశాల మీదకు పోవడమూ, ఆత్మ హత్యలు చేసుకోవటమూ నాకు తెలుసు. అలా చదువుకొన్నవారు చాలా మంది నా ముందు పశ్చాత్తాప పడిన దాఖలాలున్నాయి. అంతదాకా వెళ్ళ నవసరం లేదు. మా పరంధామయ్య బావకు ఏపాటి చదువొచ్చు గనుక ? ఆయన లక్షల మీద వ్యాపారం చేస్తున్నారు. మా జిల్లాలో ఆయన కాదంటే తప్పు, మరొకరికి గవర్నమెంటు కాంట్రాక్టులు వెళ్ళవు. ఆయన చేతికింద పదిమంది 'వివేకులు'— పెద్ద చదువులు చదివినవారే పని చేస్తున్నారు. డబ్బున్న వాడికి చదువేమీ అవసరం లేదని. ఇప్పటికీ నా నమ్మకం. పాతిక రూపాయలు పడేస్తే, బియ్యే చదివిన వాడొచ్చి, నువ్వు చెయ్యమన్న అరవ చాకిరంతా చేస్తున్నప్పుడు, కష్టపడి, బోలెడంత డబ్బు పోసి, చదువుకోడంలో నాకు అర్థం కనిపించదు. ముందెప్పుడో రోజులు మారతాయని నువ్వంటావు. మారితే మారొచ్చు గాక ! అప్పుడైనా డబ్బుకు విలవ లేకుండా పోతుందని నువ్వనగలవా ?

చెపవచ్చిందేమిటంటే — నాకు చదువు రాకపోవటానికి కారణం, మాకు బాగా డబ్బుండటమే ! ఆ రోజుల్లో మా నాన్న నీలి మందు వ్యాపారం చేస్తుండేవాడు. రెండు చేతులా ఆర్జించి పోస్తుండేవాడు. ఇప్పటిలాగా ఆ రోజుల్లో కాయితాలుండేవి కావు. ఉన్నా బహు తక్కువ. రాణీమార్కు రూపాయలూ, బోడి రూపాయలూ ఉండేవి. నీలి మందు గుంటూరులో అమ్మి, రెండెడ్ల సవారీ బండి మీద మూల్లె తీసుకొని, మా నాన్న ఇంటికొచ్చేవాడు. ఆ రోజుల్లో మేం డబ్బు దాచే కుంభకోణం చెంబు, ఇప్పటికీ మా ఇంట్లో ఉంది. ఇప్పుడు దాంట్లో తిరగమోత గింజలు దాస్తూ ఉంది మా ఆవిడ.

మా అక్కయ్య పెళ్ళినాటికే, మా వ్యాపారం దిగజారుడులో పడింది. జర్మనీవాడు మాయ నీలి మందును దేశంలోకి దింపాడు. మా సరుక్కు గిరాకీ పడిపోయింది. ఆ సంవత్సరం మా అమ్మ మూర్ఖప్పట్టు పట్టి, రవణక్కయ్య పెళ్ళి చెయ్యబట్టి గానీ. మా నాన్న మాటల ప్రకారం మరొక్క ఏడాది ఆగినట్లయితే, ఆమె పెళ్ళి జరిగిఉండేది కాదు. అదవా జరిగినా, పరంధామయ్య లాంటివాడు మాత్రం అసలే దొరికేవాడు కాదు. పెళ్ళి నాటికి మా బావకేమీ లేదు. మరీ బికారని కాదు గానీ, మాతో పోలిస్తే ఆయన కున్న ఆస్తి చెప్పుకోదగింది కానేకాదు. అయితే ఎందుకు చేసినట్టు ? దీనిక్కారణం నా కిప్పటికీ తెలీదు. ఈ పెళ్ళి జరిగిన ఏడాదికే మా పరిస్థితి పూర్తిగా దీలాపడిపోయింది. రాబడి తగ్గిపోయింది; కానీ ఖర్చులు మాత్రం అలానే ఉన్నాయి, ఆదాయంతో సరిపుచ్చుకోవటం మా నాన్నకు చాతకాలేదు. చివరికి నానా యాతనలూ పడవలసి వచ్చింది.

మా నాన్న కాలంచేసేనాటికి, నాకున్నదల్లా, ఒక్క పెళ్ళాం, ఒక్క కూతురూనూ ! మా అమ్మ అంతకు ముందే దాటిపోయింది. ఆవిడ అనేకసార్లు ముత్తయిదు చావు చావాలని ఉందిరా శేషూ ! అని వాపోవటం నాకిప్పటికీ జ్ఞాపకం ఉంది. భగవంతుడు ఆమెకీ వరాన్నిచ్చిపారేశాడు. ఆమె చావు-నిజంగా

చావులాగా లేదు. అనగూడదు గానీ, బ్రహ్మాండమైన పెళ్ళి జరిపినట్టు జరిపాడు మా నాన్న. అప్పటికే మేం దిగజారుడులో ఉన్నాం ఆ సంగతి చాలా గుంభనగా ఉండిపోయింది. నా పెళ్ళయిన ఆరు మాసాలకే, అమ్మగారు గతించడం వల్ల, నలుగురూ దానిక్కారణం నా పెళ్ళామే నన్నారు.

మనుషుల్ని అర్థం చేసుకోవడంలో మనం గమనించ వలసినవి చాలా ఉంటాయని నా నమ్మకం. ఒక మనిషి మంచి వాడో చెడ్డవాడో తేల్చడంలో, మన అంచనాలు చాలా వరకు అస్తవ్యస్తంగా ఉండే అవకాశం ఉన్నదనుకొంటాను. మంచి చెడ్డలు రెండూ కలగలిసే ఉంటాయనీ, ఆయా సందర్భాలలో ఆయా గుణాలు బయటపడుతూ ఉంటాయనీ, నా నమ్మకం.

మా పరంధామయ్య బావ మంచివాడా, చెడ్డవాడా అంటే నేను చెప్పలేను. ఈ రెండిటి ప్రభావాన్నీ నేను అనుభవించాను. దిక్కూ దివాణంలేని స్థితిలో నేనున్నప్పుడు స్వయంగా వచ్చి ఆదరించాడు. తనతో బాటు వచ్చెయ్య మన్నాడు. ఉన్న ఇంటిని అయిన వాడికి అమ్మేసి చిల్లరమల్లరలు తీర్చేసి, పాతికా పరకా ఉంటే ఒగ్గరుంచుకోమన్నాడు. తనకొక్కడికే పని తెమలడం లేదనీ, చేతికిందికి ఆసరాగా ఇంకెవరినన్నా వేసుకొందామని ఉన్నదని అన్నాడు నేనే వస్తానంటే అంతకన్నా తనకు కావల సింది కూడా లేదన్నాడు లెక్కలకోసం జీతమంటూ ఏదో ఏర్పాటు చేసినప్పటికీ, అవసరమయినప్పుడు కొస్త అటూఇటూగా వాడుకొన్నా ఫర్వాలేదన్నాడు. ఇంతకన్నా ఎవడు మాత్రం కోర వలసిందేమి ఉంటుందిగనకా?

నామట్టుకు నాకీ పద్ధతి బాగా నచ్చింది. పట్టుపట్టమంటే నేను చేయగలిగింది కూడా ఏమీ లేదు. డబ్బున్న రోజుల్లో చదువు అవసరం తెలిసిరాలేదు, అది తెలిసేనాటికి డబ్బు కాస్తా లేకుండా పోయింది నేను "సరే" నన్నాను, మా బావే స్వయంగా ఇల్లు అమ్మకాలూ, బాకీల సర్దుబాట్లు చూశాడు. తట్టాబుట్టా నెత్తినేసుకొని, బడేపురానికి శాశ్వతంగా సెలవు చెప్పి బయలుదేరాను. చూసినవారందరికీ మా బావ ఎంత గొప్ప సాహసం చేసిందీ తెలిసిపోయింది. ఆ రోజుల్లో ఆయనపేరు జనం నోళ్ళల్లో నాని పోయిందంటే నమ్మండి

"ఈ పనిచేయడం మంచిదా చెప్పరా ? అని నిన్నడిగితే నువ్వేమంటావు ? తప్పకుండా మంచిదే నంటావని నాకు తెలుసు. కానీ ఇందులో మా బావ స్వార్థం కూడా బోలెడంత ఉన్నదని నేనంటే నా మీద నీకు కోపమొస్తుందనుకొంటాను. మనిషి చేసే ప్రతి పని వెనకా, స్వార్థం ఉంటుందనడంలో-ఆ పనివల్ల సామాజిక ప్రయోజనం అసలేమీ ఉండదని కానేకాదు నువ్విచ్చే విరాళంతో ఓ స్కూలు కట్టించి, దానికి నీ పేరే పెడతానంటే నువ్వు పొందే సుఖం వేరు, ఇంకోరిపేరు పెట్టినప్పుడు నువ్వు పొందే "సుఖం వేరు. నువ్వు చేసిన ఉపకారానికి ఎదటివారి నుండి "కృతజ్ఞత" ను ఆశించడంలో తప్పులేదు. కానీ ఆ ఆశించడం"లో అంతో ఇంతో స్వార్థం ఉన్నదన్నప్పుడే నీకు చిర్రెత్తు కొస్తుంది.

మా బావ కేవలం స్వార్థచింతతో నన్ను దగ్గరకు తీశాడని ఇప్పటికీ నేను గట్టిగా అనలేను. కానీ, ఆదరిమిలా ఆయన ప్రవర్తించిన విధానం అనుభవించాక, అప్పుడప్పుడు నాకీ అనుమానం తగులుతుండేది. ఆయన నన్ను మనిషిలాగా చూడటం క్రమంగా మరిచిపోయాడు. ఆయన నిత్యం వాడుకొనే పనిముట్లలో నన్నూ పనిముట్టుగా చూసేవాడు. ఇంతకన్నా విడమరిచి చెప్పడం నాకు చాతకావడం లేదు.

మనుషుల మధ్య ఉండే సంబంధాలను డబ్బు నిర్ణయించినంత ఖచ్చితంగా మరో ఏదీ నిర్ణయించదన్న సత్యాన్ని నేను అనుభవం నుండి నేర్చుకొన్నాను. కావటానికి నేను పరంధామయ్యగారికి బావమరిదిని. స్వయానా ఆయన భార్య తమ్ముణ్ణి కానీ. ఆ ఇంట్లో నౌకరుకుండే పాటి స్వాతంత్ర్యం గానీ, గౌరవం కానీ నాకుండేది, కాదు. ఇన్ని గంటలకొచ్చి, ఇన్ని. గంటలకు వెళ్ళాలన్న నిబంధన నౌకర్లకు వర్తిస్తుందే తప్ప నాకు వర్తించదు. ఎందుకంటే నేను, ఇంటి వారి మనిషిని. ఈ దిక్కుమాలిన సంబంధం నన్ను, పక్షినీ. జంతువునూ కాకుండా చేసింది. ఏదో సామెత చెబుతారే పిలుపేమో కన్నతల్లి పిలుపున్నూ, పెట్టేమో "సవిత్తల్లి పెట్టూనని-అలా అయింది నా స్థితి.

చాలాకాలందాకా నాకేపాటి జీతమో నాకే తెలీదు. కానీ, నెలనెలా గుమాస్తా నాచేత రసీదుమీద సంతకం చేయించుకొంటుండేవాడు. కావలసిన చిల్లికానీ కూడా నేను ఇంకోరి నుండి పుచ్చుకోవలసిన స్థితిలో ఉండిపోయాను. నీ అవసరాలకు, అయిన వారిమీద ఆధారపడటం కన్నా అవమానం మరోటుండదు.

మా ఆవిడ ఇంటిపనులన్నీ చేస్తుండేది. నేను బయటిపనులు చూస్తుండేవాణ్ని. చెయ్యనని నేనుగానీ, ఆవిడగానీ అనడానికి

లేదు. ఎందుకంటే—మేం పెళ్ళికూతురు తరఫువాళ్ళం. ఆయన ఆదరించేవాడూ, మేము ఆదరింపబడే వాళ్ళమూనూ.

మా అక్కలో కూడా మార్పులు రావడం నేను గమనించాను. ఒక్కోసారి ఆవిడ చాలా చిత్రంగా మాట్లాడేది.

"కుక్కకు నెయ్యికూడా ఇముడుతుందా? అన్న సామెతను ఆవిడ చాలాసార్లు ప్రయోగిస్తుండేది.

"ఏం వడమంత్రం వొచ్చిపడిందమ్మా! ఈ కాస్తకే చేతులు ఒడిపోయాయా ఏమిటి? మట్టి పిసుక్కొనే దానికి ఇంత ఐశ్వర్యమైతే ఎలా? అనేది అప్పుడప్పుడు

ఒకసారి మా ఆవిడ పుట్టింటికి ప్రయాణమయింది. నేనే వెళ్ళి రమ్మన్నాను. తీరా ఆవిడ బయలదేరబోయే ముందు, మా అక్కయ్య వచ్చి, ఆవిడ చేతిలోని సంచిని వత్తి వత్తి చూసింది. దాని కళ్ళల్లో నీరు తిరగడం నేను చూశాను. నా కడుపు తరుక్కుపోయింది. కానీ ఏమీ చెయ్యలేని దుస్థితిలో ఉండిపోయాను.

"బోలెడంత వెండి సామాను, ఆగిబాగీలుగా పడేసి ఉంటుంది. ఒక్క గ్లాసు దాటించేసిందంటే చాలు. మనమేమన్నా కనుక్కోగలమా ఏమన్నానా?" అన్నది మా అక్కయ్య ఆ తరవాత.

ఆ సమయంలో నువ్వయితే మాత్రం ఏంచేస్తావ్?

డబ్బున్న చాలామందిలో, నేను మరో గుణం ఉండటం కూడా చూశాను. తమకన్నా డబ్బు తక్కువగా ఉన్నవాళ్లు, తమ డబ్బును ఎలాగైనా కొట్టేయాలని చూస్తున్నట్టే వారనుకొంటుంటారు. బహుశా ఆరకమైన ఆలోచన వారికి ఆనందంగా ఉంటుందనుకొంటాను. మా బావ మట్టసానకి మా బావ. నెలాఖరున జీతాలివ్వడానికి గిజగిజలాడిపోయేవాడు.

"లక్షలు గుమ్మరిస్తున్నాను. పదులు బోగుచేసుకుంటున్నాను. ఛ ఛ! ఏం బిజినెస్ వెధవ బిజినెస్" అని విసుక్కొనేవాడు ఆయన

"ఈ పనివాళ్ళ పొట్టల్లో దయ్యాలుంటాయో ఏమో! ఎప్పుడూ డబ్బో డబ్బో అని కలవరించి చస్తుంటారు. ఒక్క రోజు జీతాలివ్వడం ఆలస్యమయితే తన్నుకులాడిపోతారు పని చేయించుకొన్న వాణ్ణి జీతమివ్వనా? అనేవాడాయన.

ఆయన ప్రవర్తన ఒక్కోసారి చాలా చిత్రంగా ఉండేది సాయంత్రం ఆరు గంటలకు జీతాలు ఇవ్వవలసి ఉంటుందను కోండి. ఉన్నడబ్బంతా పదింటికి బాంకులో జమకట్టించి, రెండున్నరకు చెక్కురాసి మళ్ళీ తెప్పించే వాడు. ఒక్కోసారి ఇవ్వాళ కొంతమంది తీసుకోండి; రేపు కొంతమంది తీసుకోండి" అనే వాడు ఇంకొన్నిసార్లు వాయిదా పద్ధతుల మీద జీతం ముట్ట చెబుతూ ఉండేవాడు. ఇలా ఎందుకు చేస్తాడో నాకు చచ్చినా బోధపడదు. ఎదటివారు ఇరకాటంలో పడి గిజగిజా గిజగిజా తన్నుకులాడుతుంటే చూసి ఆనందించగల మనస్తత్వాన్ని నేను అర్థం చేసుకోలేను చాలా మంది వ్యాపారస్థులను నేను చూశాను. నా కళ్ళముందే వాళ్లు కోటికి పడగలెత్తడం చూశాను వాళ్ళపని వాళ్ళను ఉబకేసి ఎక్కువ పని చేయించి లాభాలు పిండుకొనే వారు. మా బావ దానికి పూర్తిగా విరుద్ధం!

దమ్మిడీలు బోగుచేసి ఆయనగారు కూడబెడుతుంటే, మా ప్రసాద్ వందలకు వందలు తగలేస్తున్నాడు. అటువంటివాడి కడుపున వీడెలా పుట్టాడో ఏమిటో తెలీదు. వంద రూపాయల నోటంటే పావలాతో సమానంగా చూస్తాడు. వాడికి బొత్తిగా ఆర్థిక దృష్టి లేదు. వాళ్ల నాన్న పంపనప్పుడు తల్లికి ఉత్తరం రాసేవాడు. ఆమె చాటుమాటుగా బొత్తులు పంపడం నాకు తెలుసు.

"వీడి వ్యవహారం చూస్తుంటే నాగుండెల్లో గుండెలుండటంలేదురా శేషూ! ఇదంతా పట్టుకెళ్ళి ఏగంగలో కలుపుతున్నాడో తేలీదు పదిలోజులు వాణ్ణికనిపెట్టుకొని ఉండి ఆసంగతేమిటో కాస్త కనుక్కురారా" అన్నది అక్కయ్య

ఒరకంగా వాడేమయిపోయినా నాకు విచారంలేదు. నన్ను మనిషిని చూసినట్టన్నా చూడని వారి పట్లనాకు జాలిచూపవలసిన అవసరంలేదు. కానీ ఇక్కడే ఇంకో చిక్కు వచ్చిపడింది. ఆవెధవకు మాసుభద్రంటే వెర్రి వ్యామోహం. సెలవుల కొచ్చినప్పుడల్లా దాన్ని వెంటేసుకొని సినిమాలకనీ, షికార్లకనీ పోతుండేవాడు దాంతో అస్తమానూ బాతాకానీ వేసుక్కూచునేవాడు. ఇదంతా ఏమిటట్రోయ్‌బాబూ? అంటూ లబలబాలాడి పోతుంది. మా ఆవిడ. ఈ రకంగా బజార్లు పట్టుకు తిరిగితే—ఈ దరిద్రానికి తోడు. దానికా మూడుముళ్ళు పడతాయా? అంటుంది. 'మీరసలు ఈ సంగతులు పట్టించు కోరే' మంటుంది నేను పట్టించుకొంటున్నాను లేదో ఆకూచిముఖందానికేం తెలుసు? ఇదంతా నాకు తెలియనే తెలియదనుకోవడం మరింత తెలివితక్కువ. ఆ వెధవ నా, మా సుభద్రకూ అంటుపెడితే, నాబెడద సగంతీరిపోయినట్టే లెక్క. చచ్చి ఏడు జన్మము లెత్తితే మట్టుకు ఇటువంటి సంబంధం దొరుకుందా? ఈ సంగతులేవీ మాఇంటిదానికి తెలియవు.

"మీ అక్కయ్యా, బావా ఏపనిస్తారుటండీ? మన్నిపురుగుల్ని చూసినట్టు చూసే వారు. మనతో వియ్యంపుచ్చుకొంటారా? మనకేముంది గనక?" అన్నదావిడోసారి,

ఏమీలేని మాట నిజమే! ఆవిడన్నట్టు_ పురుగుల్ని చూసినట్టు చూసేమాటా నిజమే! అందుకని బంగారుపిచ్చుకను వొదులుకోవటం మాత్రం ఏమంత తెలివనిపించుకొంటుంది? ఎందుకు నచ్చిందో సుభద్రవాడికి వచ్చింది. దానికోసం నానా పల్లద్దాలూ పడుతూ ఉంటాడు. అటువంటి వాణ్ని చేజిక్కించుకొంటే, బొంగరం గిర్రున తిప్పొచ్చు. రేపోమాపో ఆస్థి కంతటికీ, వాడే యజమాని. వాడు అమ్మానాన్నా మాటలు వినితిరిగి పోతాడేమో నన్న భయం నాకు లేనేలేదు. ఈ డబ్బంతా నేనే కూడబెట్టాననడం అతిశయంగా ఉండొచ్చుగానీ_చాలాభాగం నావల్ల పోగుపడిందే! నేను ఆర్జించిన డబ్బు నేను అనుభవించక పోవడం కన్నా అన్యాయమేముంటుంది? ఏదో విధంగా ఈ ఎండకాలం వెళ్ళే లోగా, వాళ్ళిద్దరికీ ముడిపెట్టేస్తినా, కోటలో స్థిరపడిపోయినట్టే.

ఆ ఉద్దేశంతోనే ఇక్కడి కొచ్చాను. పరిస్థితులు ఇంకోలాగా ఉన్నాయి. వీడిచుట్టూ నానా చెత్తాకానీ రకం చేరారు ఈ సజ్జంతా వాణ్ని ఆకాశాని కెత్తేస్తుంటే, ఈ చెవల వాజమ్మ అదంతా నిజమేనని భ్రమించి వెల్లకితలా పడిపోతున్నాడు. ముందు వీణ్ణి మందలించి వేరు చెయ్యాలి, ఆ తరవాత సుభద్రకిచ్చి ముడి పెట్టెయ్యాలి. ప్రస్తుతం నేనా ప్రయత్నంలో ఉన్నాను. భగవంతుడు ఏంచెయ్య దలిచాడో ఏమో తెలీదు.

(సశేషం)



# తైఆప్ర నఆప్ర


పద్మశ్రీ

శ్రీ సి. నరసింహం

ఐ. ఏ. యస్.


ప్రతి గ్రామంలోనూ ప్రజలు సమైక్యంగా ఉంటారనీ యీ సంఘీభావం పట్టణ ప్రాంతాల్లో లేదనీ సాధారణంగా భావించబడుతున్నది. సమాజాభివృద్ధి కోసం నిర్దేశించబడిన వివిధ కార్యక్రమాల నిర్వహణలో పల్లె ప్రజలు అందరూ కలిసికట్టుగా పనిచేసే తత్వాన్ని నిజంగానే అలవరచుకొన్నారా? పూర్వకాలంలో గ్రామ పంచాయతీలు యించుమించు ప్రజా ప్రాతినిధ్య సంస్థలుగా ఉండేవి గ్రామం మొత్తం కమ్మరి, వడ్రంగి, కుమ్మరి మొదలైనవారి సామూహిక సేవలపై ఆధారపడి ఉండటమే దానికి కారణం. గ్రామంలోని సామూహిక క్షేత్రాలపై వీరి జీవనం జరుగుతుండేది. పంచాయతీయే స్వయంగా గ్రామంలోని కుటుంబాల మీద అధార పడేది. వ్రాత మూలకమైన రాజ్యాంగం యేదీ లేకపోయినా యీ కుటుంబాలు, కొన్ని సూత్రాలపై ఆధారపడి, సామరస్యంగా పంచాయతీని నిర్వహించేవి. కాని బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో వివిధభూమి శిస్తు శాసనాల అమలు వల్లనూ, గ్రామ సేవకై నిర్దేశించ బడిన 'సర్వీసు ఇనాం' లను రద్దుచేసి గ్రామ సరిహద్దులను మార్చి పరిపాలనా నిర్వహణకై గ్రామీణ కుటుంబాలకు ప్రాతినిధ్యం వహించే పంచాయతీలకు బదులు గ్రామాధికారులకు ప్రాముఖ్యత యివ్వడం వలన గ్రామ సమైక్యత క్షీణించింది. అయినప్పటికి పట్టణ ప్రాంతాల్లో కంటే గ్రామీణ ప్రజల్లోనే యిప్పటికి సమాజతత్వం యెక్కువ కనిపిస్తుంది. ఎందువలన ననగా గ్రామంలో చాలావరకు ఒకేమతం ఒకటిరెండు కులాలు యేక భాష వుంటాయి, అంతా ప్రధానమైన వృత్తి వ్యవసాయంలో వుంటాలు. మొత్తం గ్రామం కొరకు పంచాయతీ, సహకార సంఘం, పాఠశాలల వంటి సామూహిక సంస్థలను నిర్వహిస్తారు. పట్టణాలలోని యిరుగు పొరుగు వారిలో సంఘీభావాన్ని నెలకొల్పడానికి వలసిన పథకాలను రూపొందించడంలో గ్రామాల గత చరిత్ర యీ విధంగా మనకు సహకారి అవుతుంది.

భారత దేశంలోని 5½ లక్షల గ్రామాలలో నివసిస్తున్న గ్రామీణ ప్రజల ఆర్థిక, సామాజికాభివృద్ధి కొరకు మానవ, ప్రకృతి సంపదల వినియోగానికి సమాజాభివృద్ధి పథకాలు అత్యవసరమైనప్పుడు, పౌర జనోద్ధరణకు తగిన కార్యక్రమాల ద్వారా సామాజిక చైతన్యాన్ని కలిగించవలసిన పట్టణ ప్రాంతాలలో అవి మరీ అవసరం. ఒకే విధమైన సాంఘిక ఆర్థిక పరిస్థితులు, ఆచార వ్యవహారాలు కొంతవరకు గ్రామీణ ప్రజలలో సంఘీభావాన్ని, గ్రామం పట్ల ప్రేమను కలిగిస్తాయి. అయినప్పటికీ గ్రామాభివృద్ధి కృషి అంతసులభసాధ్యం కాలేదు. పట్టణ ప్రాంతంలోని ప్రజల ఆదాయాలలో యెక్కువ వ్యత్యాసముంటుంది. వ్యక్తిగతసంబంధాలు తక్కువగా ఉంటవి, ఉన్నవారు వున్నచోటనే వుండటం తక్కువ.

పట్టణాలకు కుటుంబాలు తరలి వస్తున్నాయి. కుటుంబ సభ్యుల వ్యక్తిగత సంబంధాలను, ఆర్థిక పరిస్థితులను పట్టణ వాతావరణం చాలా వరకు మార్చేస్తుంది. కుటుంబ సభ్యులు తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడానికీ, స్త్రీలు తమ హక్కులను పరిరక్షించుకోవడానికి ప్రయత్నిస్తుండటం వల్ల కుటుంబ పెద్ద ప్రాముఖ్యత తగ్గిపోతూవుంది. మారే కుటుంబం పట్టణ వాతావరణంలో నిరుద్యోగం, అనారోగ్యం, అనాథలు, వితంతువుల వంటి సమస్యలకు తరుచు తట్టుకో లేకుండా ఉన్నది. అందువల్ల గ్రామాలలో కన్నా పట్టణప్రాంతాల్లో సమాజాభివృద్ధి కార్యక్రమాలను అమలు చేయడం చాలా కష్టం.

ప్రజలు తమకు తాము సహాయం చేసుకోవడంలో తోడ్పడుటయే సమాజాభివృద్ధి కార్యక్రమాల ముఖ్యోద్దేశం. ఆదాయం వనరులు తక్కువగా ఉండి అవసరాలు యెక్కువగా ఉన్న ప్రజల విషయంలో యీ కార్య క్రమాలలోని స్వయంసహాయ సూత్రం కొంత అసంగతంగా కనబడవచ్చు. కాని పట్టణ ప్రజలు మార్పు అవసరమును గుర్తించి తమ విత్య

జీవితాన్ని మార్చే భౌతిక, సాంఘిక పరిస్థితుల మార్పుకు స్వయంగా పనిచేస్తే తప్ప యే సంస్థ కృషి ప్రజల జీవితాలలో మార్పు తీసుకరాలేదనే విషయం అందరు గుర్తించారు. అందు వల్ల పట్టణ సమాజాభివృద్ధి కార్యక్రమాలలో ముఖ్యంగా దిగువ విషయాలు వుంటవి

1. సాధ్యమైనంత వరకు ప్రజలు స్వశక్తితోనే తమ జీవన ప్రమాణాభివృద్ధికై జరిగే కృషిలో పాల్గొనడం.

2. ప్రజల పూనికను, స్వయం సహాయ పరస్పర సహాయాలను ప్రోత్సహించే విధంగా సాంకేతిక, తదితర సహాయాలను అందించుటకు వసతి.

3. ప్రజల జీవన ప్రమాణం చాలా తక్కువ స్థాయిలో వున్న దేశంలో, ప్రజాస్వామిక శక్తుల, రాజకీయ స్వాతంత్ర్యానికీ, పౌరుల స్వేచ్ఛకూ ఎటువంటి భంగం రానీయకుండా ప్రజానీకంలో అభివృద్ధిపట్ల కనీసం కొంత అయినా ఆకాంక్షను, అభినివేశాన్ని కలిగించడంలోనూ, వారిని క్రమ శిక్షణాబద్ధులను చేయడంలోనూ ఎంతవరకు సఫలీకృతం కాగలుగుతాయనే సమస్య మన దేశంతో సహా నూతన ప్రజాస్వామిక దేశాలన్నింటినీ ఎదుర్కొంటున్నదని డా. కున్నర్ మైడల్ అభిప్రాయం. ఈ సమస్యను మనం ఎదుర్కొని విజయవంతంగా పరిష్కరించాలి.

4. పట్టణాలలో నివసిస్తున్నవారు 1921 వ సం. లో జనాభాలో నూటికి 11.4 వంతుల మంది వుండగా 1951 వ సం. లో 17.3 వంతుల మంది వున్నారు. ఒక లక్ష కంటె ఎక్కువ జనాభాగల నగరాల సంఖ్య 1901 వ సం. లో 15 మాత్రమే వుండగా 1951 వ సంవత్సరం నాటికి వాటి సంఖ్య 73 కు పెరిగింది. ఇరవై సంవత్సరాలలో భారత దేశంలోని పది పెద్ద నగరాల జనాభా రెట్టింపు అయ్యింది. కాబట్టి నగరవాసుల సమస్యలను ఉపేక్షించటానికి వీలులేదు. దారిద్ర్యానికి మన జనపదాలు పెట్టింది పేరు అయినప్పటికీ మన నగరాల పరిస్థితి మరీ నికృష్టంగా వుంది. చాలా మంది నగరవాసులకు యీ పట్టణం నాది అన్న గర్వం లేదు. అందుచేత వారికి నగరంపై అనురక్తి, ఆసక్తి లేవు. ప్రజలకు తాము నివశిస్తున్న ప్రదేశంపై ప్రేమాభిమానాలు వుండనట్లయితే ఆ ప్రాంతాల అభివృద్ధికై తలపెట్టిన కార్యక్రమాలలో వారు పాల్గొనునట్లు చేయడం మిక్కిలి కష్టం.

5. పట్టణ సమాజాభివృద్ధిని గురించి మనం యోచించినప్పుడు, తక్కువ ఆదాయ వర్గాలవారు ముఖ్యంగా మురికి పేటలలో హీన స్థితిలో జీవితం గడుపుతున్న వారిని గురించి ఆలోచిస్తాము. పాడిపని, చేతిపనులు, లోళ్ళపని ఇంకా ఇతర లఘు పరిశ్రమలు లేదా దేశవాళీ పనులను చేసే ప్రజలందరూ ఒకే చోట నివశించేటటువంటి వాడలు నగరాలలో బహు అరుదు. పట్టణ ప్రాంతాలలో భిన్న భిన్న వృత్తుల పనులు చేసుకొనే ప్రజలు నివసిస్తారు—కాబట్టి ముఖ్యంగా ఆర్థిక విషయాలలో అందరి ప్రయోజనాలు ఒకే విధంగా వుండవు కాబట్టి ఆయా ప్రదేశాలలో మొత్తం సమాజం ప్రాతిపదికపై అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించడం చాలా కష్టం. అందుచేత పట్టణ సమాజాభివృద్ధి కార్యక్రమం సంపూర్ణమైన అభివృద్ధి కార్యక్రమం కాజాలదు. కాబట్టి సమాజచైతన్యం పెంపొందడానికి అవకాశం వున్న కొన్ని వాడలకో లేదా కొన్ని ప్రత్యేకమైన వర్గాలకో ఈ కార్యక్రమాన్ని పరిమితం చేయవలసి వుంటుంది.

6. అదృష్టవశాత్తూ మన నగరాలలో చాలా వాటిల్లో సమిష్టి ప్రయోజనం ప్రాతిపదికపై అయితే నేమి, మత ప్రాతిపదికపై అయితే నేమి వాడలు ఏర్పడి పెంపొందడం జరిగింది నగరాలలో ఒకే వర్గం లేదా కులం వారు ఒకే వాడలో కలిసి నివశిస్తుండడాన్ని మనం చాలా చోట్ల చూస్తున్నదే. ఇటువంటి పరిస్థితులలో వాడలకు వర్తించే విధంగా సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందిరచడం సులభం కాబట్టి పట్టణ సమాజాభివృద్ధి కార్యక్రమం స్థానిక సమాజ ప్రణాళికపై ఆధార పడివుంది. ప్రజలు సామూహికంగా అత్యధికంగా పాల్గొనేదిగా వుండాలి. బయటి వారి సహాయం చాలా తక్కువ వుండాలి 'వాడ' ఈ కార్యక్రమానికి ప్రాతిపదిక కావాలి. ఈ కార్యసాధనలో, నిర్వచించబడిన ప్రాంతంలో నివసించే ప్రజలలో సమాజ చైతన్యం కలిగించి పెంపొందించడం, క్రమేపీ సాంఘిక సమాజాన్ని రూపొందించడం మొట్టమొదట చేయవలసిన పని. ఈ సందర్భంలో నిర్వచించిన ప్రదేశం అంటే భౌగోళికంగా నిర్వచించబడిన ప్రదేశం అని భావించరాదు. సాంఘిక విషయకంగా నిర్వచించబడిన ప్రదేశాలనే పరిగణనలోకి తీసుకోవాలి.

ఒక సమాజంలో ప్రత్యేక వర్గాలు వాటిలో మళ్లీ ఉపవర్గాలు వుంటాయి, మానవ వ్యవస్థకు ఇవే మూలాధారాలు. ఏ సమాజ వ్యవస్థ అయినా నిజంగా మానవ జీవితంలో ఒక భాగంగా అలరారాలంటే అది తన మూలమును వీటికి విస్తరింపచేయడం అవసరం, ఎందుకంటే ఈ వర్గాలు కేవలం వ్యక్తుల కూటములు మాత్రమే కావు, వాటి కొక ప్రత్యేకత, ప్రాముఖ్యత వుంది పెద్ద పెద్ద వర్గాలకు కూడా లేని శక్తి, సామర్థ్యం వీటికి వుంది. అయితే వ్యవస్థాగతమైన అస్తిత్వం వీటికి లేదు. కేవలం కొంత

మంది ప్రజల సన్నిహితత్వంవల్ల ఇవి ఏర్పడతాయి, విస్తృతంగా సాంఘిక ప్రయోజనం సిద్ధించే విధంగా వీటిని పటిష్ఠం చేయాలి. అందు నిమిత్తం, సన్నిహిత సంబంధాలు బాగా పెంపొందదానికే, కార్యకలాపాలు ముమ్మరంగా సాగిపోవడానికి వీలుగా తగు అవకాశాలు కల్పించాలి, కాబట్టి సమాజ సంస్థలు వర్గాలను సృష్టించడంలో గాక, ప్రజానీకంలో వర్గ చైత్యన్యాన్ని లేదా సమాజ చైత్యన్యాన్ని పెంపొందించడంలో ప్రముఖ పాత్ర వహించాలి. పరస్పరం కలిసి మెలిసి జీవించడానికి అలవాటు పడినందువల్ల ప్రజలలో ఈ చైతన్య భావం ఇదివరకే ఎంతో కొంత వుంది.

7. ఇందు నిమిత్తం ప్రతి మునిసిపల్ వార్డునూ, నలభై మొదలు యాభై కుటుంబాలతో చిన్న చిన్న యూనిట్ల క్రింద విభజించాలి. ప్రతి యూనిటుకూ ప్రత్యేక ప్రతిపత్తి వుండాలి 'వికాస మండలి' అని గానీ, గ్రామ సభలని గానీ లేదా పంచాయతీ అనిగాని వాటిని పిలవాలి, ప్రతి మూడు లేదా నాలుగు వికాస మండలులకు కలిపి ఒక పురుష కార్యకర్త లేదా స్త్రీ కార్యకర్త సహాయం లభింప జేయాలి, ప్రతి యూనిటులోనూ పురోగాములైన కొందరు వ్యక్తులకు 'పట్టణ సమాజాభివృద్ధి' కార్యక్రమ విధానాలలో శిక్షణ ఇవ్వాలి. తీరిక సమయాలలో సుశిక్షితులైన స్త్రీ- పురష బృందం మార్గ దర్శకత్వం క్రింద వారు ఈ కార్యక్రమం నిర్వహించాలి.

పురజనులలో సామాజిక చైతన్యాన్ని కలిగించడానికి కొన్ని సామూహిక కార్యక్రమాలను నిర్వహించాలి, ఇటువంటి వాటిలో పేర్కొనదగినవి 1. సహకార సంఘం, 2. పాఠశాల, 3. రిక్రియేషన్ క్లబ్, 4. మహిళామండలి, 5 యువజన సంఘం, 6. సామూహిక వివాహ సౌకర్యాలు, 7 రిపబ్లిక్ దినోత్సవాలవంటి కార్యక్రమాల నిర్వహణ. 8. శాంతి దళం, 9. పారిశుధ్య దళం, 10. న్యాయ పంచాయతీలు మొదలైనవి.

8. ఒక వార్డులోని వికాస మండలులన్నిటికి కలిపి ఒక నైబర్‌హుడ్ కౌన్సిలు వుంటుంది దీనిలో ప్రతి వికాస మండలికి చెందిన ప్రతినిధులు, ఇంకా ఆ వార్డులోని స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు కూడా వుంటారు, ఈ కౌన్సిల్ సభ్యులలో ఆ వార్డు కౌన్సిలర్, హెల్త్ ఇనస్పెక్టరు, పాఠశాల డిప్యూటీ ఇనస్పెక్టరు సహకార సంఘాల ఇనస్పెక్టరు, ఖాదీ గ్రామ పరిశ్రమల బోర్డు ప్రతినిధి మొదలైన వారుండాలి. కౌన్సిల్ వార్డులో వున్న అనధికార సంస్థల కార్యక్రమాలను సమన్వయ పరుస్తుంది.

9. 1. స్త్రీ పురుషుల నిరుద్యోగ సమస్య పరిష్కారం, 2. గృహ పరిశ్రమల నిర్వహణ, 3. కుటుంబనియంత్రణం, 4 చిన్న మొత్తాల పొదుపు, 5. వయోజన విద్య, 6. అక్షరాస్యత, 7. పారిశుధ్యము, 8. గృహ వసతి. యివి యీ కౌన్సిల్ కార్యక్రమాలలో చేర్చాలి.

10. 1. నగరపాలక సంఘాలు, 2. రాష్ట్ర ప్రభుత్వం. 3 కేంద్ర ప్రభుత్వం. 4. ప్రజల విరాళాలు, 5. ప్రజా సహకారాల ద్వారా నిధులను సేకరించాలి

11 పట్టణ ప్రాంతాలలో గాని గ్రామీణ ప్రాంతాలలో గాని ప్రజలకు ఇతోధిక సదుపాయాలను కలిగించటమే యీ సమాజాభివృద్ధి కార్యక్రమం పరమావధి కాదు. ప్రజలలో సన్నిహిత సంబంధాలను పెంపొందింప చేసి, ఒకరి నొకరు అవగాహన చేసుకొని జీవిత సుఖదుఃఖాలను పంచుకొని అంతా ఒక్కటేనన్న భావాన్ని కలిగించి తద్వారా వ్యక్తుల సమూహాన్ని ఒక సామాజిక వ్యవస్థగా మార్చటమే దాని ప్రధానాశయం. "ముఖాముఖి సంబంధాలు గల చిన్న సమాజం" యొక్క ప్రభావం మానవ జీవితంపై చాలా వరకు ఉన్నదనే విషయాన్ని యీ మధ్యనే గుర్తించారు. మానవునికి అభిమాన పాత్రములైన సంస్కృతీ విలువలు పెక్కిటిని పోషించి కాపాడి వెదజల్లే పని యీ సమాజంలోపలనే జరుగుతుంది. కాని ఆర్థికాభివృద్ధి, ముఖ్యంగా పారిశ్రామికాభివృద్ధి ఫలితంగా యీ చిన్న సమాజాలు క్షీణించి, విడిపోతూ ఉన్నాయి. గ్రామ ప్రాంతాలలో అర్థికాభివృద్ధి కృషి సమయంలో యీ చిన్న సమాజాలు సాంఘిక వ్యవస్థను పరిరక్షించడానికే సమాజాభివృద్ధి కార్యక్రమం కృషి చేస్తున్నది అయితే, నూతన ఆర్థిక వ్యవస్థ అవసరాల ఒత్తిడులకు అనుగుణంగా అది ఉన్నతము, క్లిష్టము అయిన ప్రమాణాల నందుకొనుటకు కూడ దానికి సహాయం చేయబడుతున్నది అయితే పట్టణ ప్రాంతాలలో యీ చిన్న సమాజాలు యెప్పుడో రూపుమాసిపోయాయి. అందువల్ల వీటిని పరిరక్షించడం గాక పట్టణ వాతావరణానికి అనుగుణంగా అభివృద్ధిపరచాలి చిన్న సమాజంలోని ప్రాథమిక సూత్రాలను, పట్టణ ప్రాంతంలోని అభివృద్ధికర సూత్రాలను సమన్వయపరచడానికి భవిష్యత్ ప్రణాళికాకర్తలు కృషి చేస్తారని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రస్తుత పరిస్థితులలో పట్టణ సమాజాభివృద్ధి కార్యక్రమాలను అమలు చేయడంలో పట్టణ ప్రాంతంలోని వివిధ స్థాయిలలో ఉన్న సమాజ విచ్ఛిత్తి పరిస్థితిని యెదుర్కోవాల్సి ఉంది. సమాజ వ్యవస్థలో ఉన్న సంఘీభావాన్ని కల్గించే శక్తులను ప్రోత్సహించాలి, ఈ కార్యసిద్ధిలో యిరుగు పొరుగు వారి దృక్పథాన్ని మార్చాలి. ఆర్థిక స్థాయిని పెంచడమే గాక ప్రజల్లో ఆత్మ విశ్వాసాన్ని సహకార భావాన్ని కూడా పెంపొందింపజేయాలి పౌరులు వ్యక్తిగా పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని వ్యష్టిగా పరిపూర్ణ సాంఘిక జీవితాన్ని సాధించడానికి తగిన పరిస్థితులను కలిగించాలి. యీ వ్యాసాన్ని ముగించే ముందు ఒక ముఖ్య విషయాన్ని పేర్కొనాల్సి ఉంది. పట్టణాభివృద్ధి కార్యక్రమాలకు, ప్రభుత్వ శాఖలు, మునిసిపాలిటీల మామూలు అభివృద్ధి కార్యక్రమాలకు సమన్వయం కూర్చే విషయం ముఖ్య సమస్య, వీటి మధ్య సహకారం, పరస్పర అవగాహన వుండటం యెంతో అవసరం. ఇవి అన్నీ కూడా సాంఘిక సేవా మండలులతో సన్నిహిత సంబంధాలను కలిగించుకోవాలి.



# ప్రగతి పథంలో

(జిల్లాల నుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### సంగీత, నాటక గోష్ఠి

1962 జనవరిలో జిల్లా నాలుగవ సంగీత, నాటక గోష్ఠి జరిగినది. చెన్నూరు జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల సమర్పించిన "ప్రణాళికా ఫలితములు" నాటకానికి నాటక పోటీలలో ప్రథమ బహుమతి వచ్చినది.

## అనంతపురం

### హరిజనకాలనీ

1961 డిసెంబర్‌లో రాయదుర్గంలో ఒక క్రొత్త హరిజన కాలనీ ప్రారంభింపబడ్డది. ఈ నెలలో రక్షితనీటి సరఫరా కూడ ప్రారంభమైనది.

## చిత్తూరు

### బావుల మరమ్మతు

1961 నవంబరులో నగర పంచాయతీసమితిలో 7 మంచి నీటి బావులు మరమ్మతు చేయబడినవి 23 బావులలో మందు కలుపబడినది.

## కడప

### క్రొత్త పాఠశాలా భవనం

1962 జనవరి 22 న చిన్నాయపల్లి గ్రామం (బద్వేలు పంచాయతీసమితి) లో క్రొత్తగా నిర్మించబడిన పాఠశాలా భవనం ఒకటి ఆరంభించబడినది. దీని నిర్మాణానికి మూడు వేల రూపాయలు ఖర్చైనవి.

## తూర్పు గోదావరి

### గ్రామ సహాయకుల శిబిరం

1961 డిసెంబరులో తామరాడ (పెద్దాపురం పంచాయతీ సమితి) లో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం ఒకటి నడుపబడినది. ఈ శిబిరంలో 40 మంది రైతులకు శిక్షణ యివ్వబడినది.

### రసాయన యెరువుల పంపిణీ

1961 డిసెంబరు నెలలో 6,655 మణుగుల ఉత్తమ విత్తనాలు, 20.100 మణుగుల రసాయన యెరువులు, మామూలు యెరువులను. 78 ఆధునిక పనిముట్లు పెద్దాపురం పంచాయతీ సమితిలోని రైతులకు సరఫరా చేయబడినవి. ఎనిమిది పంపుసెట్లు నెలకొల్పబడినవి.

## గుంటూరు

**శిక్షణా శిబిరం**

1962 జనవరిలో గుంటూరు తాలూకా ఉండవల్లిలో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నడుపబడినది.

## కరీంనగరం

**మెట్‌పల్లి ప్రదర్శన**

రిపబ్లిక్ దినోత్సవంనాడు మెట్‌పల్లిలో వ్యవసాయ పారిశ్రామిక వస్తు ప్రదర్శన తెరువబడినది.

## ఖమ్మం

**పంచాయతీల యేర్పాటు**

ఇటీవల భద్రాచలం ఏజన్సీ ప్రాంతంలో క్రొత్తగా 80 పంచాయతీలు యేర్పరచబడినవి. వాటిలో యీ జిల్లాలోని మొత్తం పంచాయతీల సంఖ్య 384 కి పెరిగినది.

**శిక్షణా శిబిరం**

1962 జనవరి రెండవ వారంలో వెంకటాపురం పంచాయతీ సమితిలోని మరికాలలో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నడుపబడినది.

## కృష్ణా

**స్త్రీల శిక్షణా శిబిరం**

1962 జనవరిలో తిరువూరు పంచాయతీసమితి ఆధ్వర్యాన తిరువూరులో ప్రత్యేకం స్త్రీల కొరకు మూడు రోజుల పాటు శిక్షణా శిబిరం నడచినది. 15 గ్రామాల నుంచి యెన్నబడిన 63 మంది స్త్రీలకు శిక్షణ యివ్వబడినది

**పూర్వ విస్తరణ కేంద్రం**

ఫిబ్రవరి 9 న గుడివాడలో ఒక పూర్వ విస్తరణ కేంద్రం తెరువబడినది. ఈ సందర్భంలో వ్యవసాయం, పశుపోషణ, ప్రజారోగ్య రంగాలలో జరిగిన అభివృద్ధి కార్యకలాపాలను విశదపరుస్తూ ఒక ప్రదర్శన జరుపబడినది.

## కర్నూలు

**ప్రాథమిక ఆరోగ్య కేంద్రం**

1961 డిసెంబరులో గాజులపల్లి (నంద్యాల పంచాయతీ సమితి) లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి శంఖుస్థాపన చేయబడినది.

## మహబూబునగరం

**ఉత్తమ విత్తనాల పంపిణీ**

1961 డిసెంబరులో కల్వకుర్తి పంచాయతీసమితిలో 573 మణుగుల ఉత్తమ విత్తనాలు, 1,293 రు ల రసాయన యెరువులు పంపిణీ చేయబడినవి.

## మెదక్

**సంగీత, నాటక గోష్ఠి**

జనవరి 5 నుంచి 7 వరకు రామాయంపేటలో జిల్లా స్థాయి సంగీత, నాటక గోష్ఠి జరిగినది. గజ్వేల్ జిల్లా పరిషత్తు వున్నత పాఠశాల విద్యార్థులు ప్రదర్శించిన "త్యాగము" ఉత్తమ నాటకం గాను తూప్రన్ జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల విద్యార్థులు వాడిన "పంచాయతీ రాజ్యం" వుత్తమ బుర్రకథ గాను నిర్ణయింపబడినవి. మూడు రోజులు జరిగిన యీ గోష్ఠికి రమారమి పదివేల మంది హాజరయారు.

## నల్గొండ

**సాంఘిక సేవా శిబిరం**

1962 జనవరి నెలలో సూర్యాపేట పంచాయతీసమితి గ్రామం కీసరబాదాలో భారత్ సేవక్ సమాజ్ అధ్వర్యాన ఒక సాంఘిక సేవా శిబిరం యేర్పాటు చేయబడినది. శిక్షితులు గ్రామ పంచాయతీ చేపట్టిన నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

**భారత్ సేవక్ సమాజ్ శిబిరం**

1962 జనవరి 8 నుంచి 17 వరకు రామన్నపేటలో భారత్ సేవక్ సమాజ్ సాంఘిక సేవా శిబిరం ఒకటి నడచినది. జిల్లాపరిషత్తుకు చెందిన 45 మంది విద్యార్థులు యిందులో పాల్గొన్నారు.

**నక్రేకల్-షెలిగోక్రరం రోడ్డు**

నక్రేకల్ పంచాయతీ నక్రేకల్-షెలిగోపురం రోడ్డు పథకాన్ని చేపట్టినది.

**చందూరికి విద్యుచ్ఛక్తి**

1962 ఫిబ్రవరి మొదటివారంలో రాష్ట్ర ఎక్సైజు చిన్న పరిశ్రమల శాఖామంత్రిచే చందూరు గ్రామానికి నారాయణపురం (పంచాయతీసమితి) విద్యుచ్ఛక్తి సరఫరా ఆరంభింపబడినది.

**ఖాదీ, గ్రామ పరిశ్రమల వస్తు ప్రదర్శన**

జనవరి ఆఖరు వారంలో నాగార్జునసాగర్‌లో ఖాదీ, గ్రామ పరిశ్రమల వస్తుప్రదర్శన ఒకటి యేర్పాటు చేయబడినది. రాష్ట్ర

ప్రభుత్వ వివిధ శాఖలు అంగళ్లు తెరిచినవి. ప్రదర్శన కాలంలో ఫిల్మ ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరుపబడనవి. ఇందులో సమాచార శాఖ పెవిలియన్‌కి ప్రదర్శనా చాతురిలో ద్వితీయ బహుమతి వచ్చినది

జిల్లా సమాచార కేంద్రం

ఫిబ్రవరి 12 న జిల్లా సమాచార కేంద్రం ప్రారంభింప బడినది. ప్రారంభోత్సవానికి జిల్లాపరిషత్తు అధ్యక్షుడు అధ్యక్షత వహించారు.

ఆత్మకూరులో బ్లాక్ మేలా

పంచాయతీసమితి అధ్వర్యాన ఆత్మకూరులో బ్లాక్ మేలా యేర్పాటు చేయబడినది- ఈ సందర్భంలో ఒక వస్తు ప్రదర్శన జరిగినది. ద్వితీయ ప్రణాళిక కాలంలో నల్గొండ జిల్లాలో జరిగిన అభివృద్ధిని చార్టులు, ఛాయా చిత్రాలు వగైరాతో సమాచార పౌర సంబంధాల శాఖ పెవిలియన్ విశదపరిచినది.

## నెల్లూరు

ఉత్తమ గ్రామం

కొండపి పంచాయతీసమితిలోని జరుగుమల్లి ఉత్తమ గ్రామ పంచాయతీగా నిర్ణయించబడినది. దానికి వెయ్యి రూపాయల రొక్కం బహుమతి యివ్వబడుతుంది.

పంచాయితీ అధ్యక్షుని విరాళం

కొండపి పంచాయతీ అధ్యక్షుడు శ్రీ రేవళ్ళ వెంకయ్య విరాళమిచ్చిన స్థలంలో (కొండపిలో) ఒక కమ్యూనిటీ బిల్డింగును నిర్మించాలని సంకల్పించబడినది

ప్రజల విరాళం

బలవరం, జరుగుమల్లి (కొండపి పంచాయతీసమితి) గ్రామాల ప్రజలు సామాజిక కేంద్రం, ఔషధాలయ భవనాల నిర్మాణానికై రూ 9,000 విరాళమిచ్చారు.

మధ్యాహ్న భోజన కేంద్రం

నెన్నూరుపాడు, వర్ధినేనిపాలెం, కోటపాడు (కొండపి పంచాయతీసమితి) గ్రామాలలో, డిసెంబరు నెలలో, వుచిత మధ్యాహ్న భోజన కేంద్రాలు ఆరంభింపబడినవి.

## నిజామాబాదు

ఉత్తమ గ్రామస్థాయి కార్యకర్త

బన్‌స్వాడ బ్లాక్‌కి చెందిన శ్రీ సి. సదాశివం జిల్లాలో కెల్లా వుత్తమ గ్రామ స్థాయి కార్యకర్తగా నిర్ణయించబడ్డారు.

శిక్షణా శిబిరం

1962 జనవరిలో భైరన్‌గడ్డి గ్రామం (బన్స్వాడ పంచాయతీసమితి) లో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం ఒకటి నడచినది. దీనికి 40 మంది గ్రామ సహాయకులు హాజరైనారు.

## విశాఖపట్నం

నౌకాశ్రయ బెర్తులకు శంకుస్థాపన

1962 జనవరి మూడవ వారంలో విశాఖపట్నం నౌకాశ్రయంలో నాలుగు అదనపు బెర్తులకు, వైటరేజ్ రేవుకు కేంద్ర రవాణా, రాకపోకల సౌకర్యాల మంత్రి డా పి. సుబ్బరాయన్ శంఖుస్థాపన చేశారు.

విజయనగరలో రైతుల దినోత్సవం

ఫిబ్రవరి 9 న విజయనగరం ప్రభుత్వ మెట్ట ధాన్యాల క్షేత్రంలో రైతుల దినోత్సవం జరిగినది. ఈ సందర్భంలో వ్యవసాయ వస్తు ప్రదర్శన ఒకటి నడచినది ఈ క్షేత్రం శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు రెండిటి నిమిత్తం నెలకొల్పబడినది. ఈ క్షేత్రం యెక్కువగా పండే విజెడ్ఎమ్ 1 విజెడ్ఎమ్ 2 చోడి రకాల సాగుతో సహా పెక్కు చక్కని ప్రయోగాలను చేస్తున్నది. మెట్ట ధాన్యాల ప్రయోగాలలో వచ్చిన ఫలితాలు సంతృప్తికరంగా వున్నవి.

## వరంగల్లు

వికాస మేల

1961 జనవరిలో వర్ధన్నపేట పంచాయతీసమితిలోని రైపర్తి గ్రామంలో మూడురోజుల పాటు "వికాసమేలా" జరిగినది.

మేలా పశు ప్రదర్శన

1962 జనవరి 7 నుంచి 10 వరకు ములుగ్ పంచాయతీసమితి కాన్పూరులో ఒక వికాస మేలా, పశు ప్రదర్శన జరిగినవి.

## పశ్చిమ గోదావరి

ఫీల్డు పబ్లిసిటీ

1961 డిసెంబరులో సమాచార శాఖ జిల్లా యూనిట్టుచే 11 ఫిల్మ ప్రదర్శనలు, పది బహిరంగ సభలు, రెండు వస్తు ప్రదర్శనలు యేర్పాటు చేయబడినవి.

సహకార సంఘాలు

1961 డిసెంబరులో ఆకివీడు పంచాయతీసమితిలో పని చేస్తున్న సహకార సంఘాలలో 54 మంది రైతులు సభ్యులుగా చేర్చబడ్డారు, రూ. 6,140 అప్పులుగా యివ్వబడినవి.

# సంగ్రహ ప్రకటనలు

## రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి పరిస్థితి

విద్యుచ్ఛక్తి కొరతవల్ల యేర్పడిన క్లిష్టపరిస్థితిపై కొన్ని పత్రికలలో ప్రచురితమైన ఒక వార్తను ఖండిస్తూ ప్రభుత్వం ఒక పత్రికా ప్రకటనలో పరిస్థితి నీవిధంగా స్పష్టీకరించింది :

"ద్వితీయ పంచవర్ష ప్రణాళికకాలంలో రాష్ట్రంలోవిద్యుచ్ఛక్తి వుత్పత్తి పెరగకపోగా పారిశ్రామిక, గృహ విభాగాలు రెండిటిలోను వాడకం విరివిగా పెరుగుతున్నందున రాష్ట్ర ప్రభుత్వం కొంత కాలంగా రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి వాడకానికి కొన్ని పరిమితులు యేర్పరచాలని ఆలోచిస్తున్నది. ఉత్పత్తి తక్కువ, వాడకం యెక్కువ అయిన పరిస్థితులలో పెద్ద యిబ్బంది రాకుండా రేషనింగ్ చర్యను తీసుకోనడం అవసరమని భావించబడినది తొలిచర్యగా, గృహవాడకం దారులకు, సినీమాలకు, షాపులు, యెస్టాబ్లిష్‌మెంట్లకు అలాగే చిన్న పారిశ్రామిక కేంద్రాలకు 20 శాతం సరఫరా చేయాలని నిర్ణయించబడినది. ఈ 20 శాతం, గడచిన 12 నెలలలోను సరాసరి నెలవాడకం ప్రాతిపదికపై నిర్ణయించ బడుతుంది. ఇది 1-4-1962 నుంచి అమలులోనికి వస్తుంది"

భారీ పారిశ్రామిక కేంద్రాల విషయంలో సరఫరాను యెంతతగ్గించ వచ్చునో విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల చీఫ్ ఇంజనీర్ ఆ యా పారిశ్రామిక వేత్తలతో సంప్రదించిన మీదట నిర్ణయింప బడుతుంది. ఈ సందర్భంలో వారి మొత్తం అవసరం, లోడ్‌రకం మున్నగు విషయాలు లెక్కలోనికితీసుకొనబడతాయి.

## బాలవాఙ్మయం

"పిల్లలకు, ఉపాధ్యాయులకు వుపకరించే పుస్తకాల రచన" పథకం క్రింద, కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ పిల్లల పుస్తకాలకు ఎనిమిదవ పోటీని ప్రకటించినది. బాలవాఙ్మయంలో శ్రద్ధ గలిగిన రచయితలు, ప్రచురణ కర్తలు పిల్లలకు తగిన పుస్తకాలను (వ్రాత ప్రతులతో సహా) సమర్పించవచ్చు. తెలుగు పుస్తకాలను దిగువ చిరునామాకు పంపవలెను ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి, ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వం, హైద్రాబాదు పుస్తకాలు పై అధికారికి 1-5-62 దాటకుండా చేరాలి.

రచయితలు తమకు వచ్చిన వస్తువును స్వీకరించి రచనచేయవచ్చు. అయితే, సాధారణంగా, దిగువ రకాలు 5, 8 సంవత్సరాల మధ్య వయస్సులయిన పిల్లలకు బాగుంటవి. ఫెయిరీటేల్సు జంతువుల కథలు. సరళమైన జానపద కథలు, గృహ వాతావరణంగల కథలు. పిల్లలు నివసించే పరిసరాలకు సంబంధించినవి, పుస్తకాలలో తగినన్నిచిత్రాలు వుండాలి.

## పరిశోధనా కృషికి సహాయం

"సాంఘిక శాస్త్రాలు, సాంస్కృతిక విషయాలలో ప్రాతిపదిక విషయ పరిశోధన జరిపే వ్యక్తులకు సహాయక గ్రాంటులు" అన్న పథకం క్రింద కేంద్ర ప్రభుత్వం పరిశోధనను చేపట్టేవిద్యావంతులకు, వారికి యేదైనా గుర్తించబడిన సంస్థ తోసంబంధం వున్నా లేకపోయినా కూడా ఆర్థిక సహాయం చేయగలదు. "సాంఘిక శాస్త్రాలు, సాంస్కృతిక విషయాలు" అనగావిజ్ఞాన శాస్త్రం, టెక్నాలజీల క్రిందకు రానివి. వాటి లోగణాంకాలు, విద్య, వాణిజ్యాలు కూడా చేరి వుండవు.

ఈ పథకం క్రింద సహాయం పొందగోరే వ్యక్తి రాష్ట్ర ప్రభుత్వం (విద్యాశాఖ కార్యదర్శి) ద్వారాను, అతను పనిచేసే సంస్థ యేదైనా వుంటే దాని ద్వారాను నిర్ణీత ఫారమ్‌లో శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖకు దరఖాస్తు చేయాలి.

## మునిసిపల్ పరిపాలన

ఇప్పుడు రాష్ట్రం మొత్తానికి గల మునిసిపల్ పరిపాలనా

శాఖలో మూడు మండలాలున్నవి. వాటికి ఉత్తర, దక్షిణ, పశ్చిమ మండలాలని పేరు. ప్రభుత్వం వీటి అధికార ప్రాంతాలను, ముఖ్య కార్యాలయంగల ప్రదేశాలను యీ విధంగా నిర్ణయించినది; (1) ఉత్తర మండలంలో శ్రీకాకుళం, విశాఖ పట్నం, తూర్పు పశ్చిమ గోదావరులు, కృష్ణా జిల్లాలు వుంటవి. ముఖ్య కార్యాలయం రాజమండ్రిలో వుంటుంది. (2) దక్షిణ మండలంలో గుంటూరు. నెల్లూరు, చిత్తూరు, అనంతపురం. కర్నూలు, కడప జిల్లాలు వుంటవి. ముఖ్య కార్యాలయం కడపలో వుంటుంది. (3) పశ్చిమ మండలంలో ఆదిలాబాదు, నిజామాబాదు, వరంగల్లు, ఖమ్మం, హైదరాబాదు, మెదక్, మహబూబునగరం, నల్గొండ, కరీంనగరం జిల్లాలుంటవి ముఖ్య కార్యాలయం హైదరాబాదులో వుంటుంది.

ఈ మండలాలలో ఒక్కొక్కదానిపై అధికారికి మునిసిపల్ పరిపాలన ప్రాంతీయ డైరెక్టరు అని పేరు.

## విద్యార్థి వేతనాలు

షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు, యితర వెనుక బడిన తరగతులకు, కేంద్ర ప్రభుత్వ పోస్టు-మెట్రిక్ విద్యార్థి వేతనాల పథకం క్రింద తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో అర్హతగల షెడ్యూల్డు జాతుల విద్యార్థులందరికీ. ఆదాయం లేక ప్రతిభ పరీక్షలలో నిమిత్తం లేకుండగ. అనగా యింతవరకు వలె గడచిన వార్షిక పరీక్షలో వారికి వచ్చిన యెక్కువ మార్కుల ప్రాతిపదిక లేకుండా. విద్యార్థి వేతనాలను యివ్వాలని నిర్ణయింప బడినది. షెడ్యూల్డు కులాల దరఖాస్తుదారుల విషయంలో ప్రతిభ పరీక్ష వుండదు కాని ఆదాయం పరీక్ష మాత్రం వుంటుంది అనగా కనీస రాబడి పరిమితిలోనికి వచ్చే షెడ్యూల్డు కులాల అభ్యర్థు లందరికీ 1961-62 లో వలెనే గడచిన వార్షిక పరీక్షలో వారికి వచ్చిన మార్కులతో నిమిత్తం లేకుండా వూరికే ప్యాస్ అయితే చాలు. విద్యార్థి వేతనాలు ఇవ్వబడతవి. వెనుకబడిన తరగతుల విద్యార్థులకు మాత్రం యీ సందర్భంలో యెప్పటి వలెనే ఆదాయం, ప్రతిభ పరీక్షలు రెండూ వుంటవి.

## మాజీ సైనికులకు

రాష్ట్రంలోని అన్ని జిల్లా ముఖ్య పట్టణ ఆస్పత్రులలోను, కొన్ని తాలూకా ముఖ్య పట్టణ ఆస్పత్రులలోను క్షయ క్లినిక్కులు తెరువబడినవని రాష్ట్రంలో క్షయతో బాధపడుతున్న మాజీ సైనికులకు తెలుపుటకై వైద్యశాఖ డైరెక్టరు ప్రకటిస్తున్నారు. క్షయ వ్యాధి పీడితులైన మాజీ సైనికులను యీ క్లినిక్కులలో పరీక్షించి ఎక్స్-రే తీస్తారు. మొదట్లో యింటికి మందు లిచ్చి అవసరమైన చికిత్స చేస్తారు, పిమ్మట ఆరోగ్య సదనంలో వుండ వలసిన రోగుల జాబితాను తయారుచేసి ఆంధ్రప్రదేశ్‌లోగల ఆరోగ్య సదనాలలో పడకల కేటాయింపుకు యేర్పాటు చేస్తారు.

## ప్రాంతీయ రవాణా అధారిటీలు

కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, నెల్లూరు. చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు, విశాఖ పట్నం. శ్రీకాకుళం జిల్లాల ప్రాంతీయ రవాణా అధారిటీల అనధికార సభ్యుల పదవీ కాలాన్ని 1963 ఆగస్టు 31 వరకు పొడిగించారు

## లైసెన్సింగ్ ఆఫీసర్

ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ రోడ్డు రవాణా కార్పొరేషన్‌కి గల మోటారు బళ్ల విషయంలో, 1931 ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) మోటారు బళ్ల పన్ను విధింపు చట్టం క్రింద లైసెన్సింగ్ ఆఫీసర్‌గా హైదరాబాదులోని రాష్ట్ర రవాణా అధారిటీ సహాయ కార్యదర్శి నియమింపబడ్డారు.

## కలప పరిశ్రమ

కలప పరిశ్రమ పని పరిస్థితులను దర్యాప్తు చేసి దానిలో పనిచేసే కార్మికులకు జీవన పరిస్థితులను బాగు చేయుటకై మార్గాలను సూచించుటకై ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించి నది. ఇందులో దిగువ వారు వుంటారు : (1) అడవుల చీఫ్ కాన్సర్వేటరు, హైదరాబాదు (అధ్యక్షుడు) (2) ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టరు (3) సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరు (సభ్యులు) (4) అడవుల సహాయ చీఫ్ కాన్సర్వేటరు-III (సభ్యుడు-కార్యదర్శి). ఈ సంఘం కలప పరిశ్రమలో యజమానులు, వుద్యోగుల తరపున (యజమాని తరపున ఒకరిని, వుద్యోగుల తరపున ఒకరిని చొప్పున) అనధికార సభ్యులను కో-అప్టు చేసుకో వచ్చును. ఈ సంఘం ప్రభుత్వానికి తన తుది నివేదికను 1962 ఏప్రిల్ 10 నాటికి సమర్పించగలదు

## నిబంధనల విస్తరణ

" శ్రీ ఆచార్య వినోబా భావే సర్వోదయ భూ యజ్ఞ హైదరాబాదు భూమిశిస్తు నిబంధనలు, 1951 " తెలంగాణా

ప్రాంతంలో 9-2-62 నుంచి మరొక సంవత్సరం అమలు జరగాలని ప్రభుత్వం ఆదేశించినది. ఈ విషయంలో రాష్ట్రి మంతటికీ వర్తించే సమగ్ర శాసనం తయారు కావటానికి కొంత కాలం పట్టవచ్చుననే వుద్దేశంతో పై చర్య గైకొనబడినది.

## సలహా సంఘం

ఇటీవల యేర్పాటు చేయబడిన జూలాజికల్ గార్డెన్ సలహా సంఘపు అదనపు అధికార సభ్యులుగా వ్యవసాయ శాఖలో ప్రభుత్వ ఆర్థిక సలహాదారు, జూలాజికల్ గార్డెన్ క్యూరేటరు నియమింపబడాలని ప్రభుత్వం ఆదేశించినది. ముకరంజా బహదూర్ రాకుమారుడు, శా. స. స. శ్రీ కృష్ణంరాజ్ బహదూర్‌లు యీ సంఘం అనధికార సభ్యులుగా నియమింపబడినారు.

## భూసార పరిరక్షణ

1961-62 లో ఆంధ్రప్రదేశ్‌లో గల మచ్‌ఖండ్ ఆరగాణి (కేంద్ర ప్రభుత్వం తలపెట్టిన పథకం) లో భూసార, జల పరిరక్షణ పథకం అమలును ప్రభుత్వం మంజూరు చేసినది. మన రాష్ట్రింలో గల నదీలోయప్రాజెక్టు ఆరగాణిలో 6 లక్షల రూపాయలకు మించకుండగా భూసార పరిరక్షణ పథకం అమలును కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన మీదట పై చర్య గైకొనబడినది.

## విక్రయ సౌకర్యాల శాఖ

ప్రస్తుతం వ్యవసాయ శాఖలో గల విక్రయ సౌకర్యాల విభాగాన్ని విడదీసి స్వతంత్రమైన విక్రయ సౌకర్యాల శాఖగా యేర్పాటు చేయాలని, యీ మార్పు 1-2-62 నుంచి అమలులోనికి రావాలని ప్రభుత్వం ఆదేశించినది. వ్యవసాయ శాఖలోని ప్రస్తుతపు రాష్ట్రి విక్రయ సౌకర్యాల అధికారి పేరు విక్రయ సౌకర్యాల డైరెక్టరుగా మార్చబడుతుంది. పై క్రొత్త శాఖ యీ అధికారి అధ్వర్యంలో వుంటుంది



నాటిక

# కథ అడ్డం తిరిగింది!

"ప్రేమేంద్ర"

## పాత్రలు

గంగాధరం
శివరామ్
గిరి
సుందరం
సుబ్బారావు

గంగాధరం యింట్లో ముందుగది. గది అధునాతనపద్ధతుల్లో అలంకరించబడి వుంది. గంగాధరం సోఫాలో ఆసీనుడై పత్రిక చూస్తూ వుంటాడు. అప్పుడప్పుడు వీధి వేపు దృష్టి పోనిస్తూ యెవరికోసమో యెదురు చూస్తున్నట్టుగా వుంటాడు. కాస్సేపటికి బైటనుండి శివరామ్ వస్తాడు. నలభై యేళ్లు పైబడిన వ్యక్తి ఒడ్డు పొడుగూ హుందాతనం వున్నవాడు.

శివ : (వస్తూనే) నమస్కారమండీ ! క్షమించాలి, కాస్త ఆలస్యమయ్యింది.

గంగా: (పత్రిక టీపాయ్ మీద పడేసి మందహాసం చేస్తూ) నీకోసం చూసి చూసి, కళ్ళు కాయలు కాచినవోయ్. ఆఁ యిలా కూర్చో.

శివ : (పక్కనే వున్న కుర్చీ లాక్కొని) వస్తూవుంటే, ఓ ఆయన ఎదురై మాటల్లో పడేశాడండీ ! అందుకే ఆలస్యమయింది.

గంగా: ఊఁ... సరేగానీ, ఆ పుస్తకం ప్రచురించావు గదా, అమ్మకం యెలా వుంది ?

శివ : ఆర్డర్లు బాగానే వస్తున్నాయండీ. ఎంతయినా "చక్రధారి" మంచి రచయిత కదండీ ! అతని పుస్తకాలంటే పాఠకులు పడిచస్తారు.

గంగా: (మీసం మెలివేసుకుంటూ నవ్వి) బావుంది...బావుంది. మన ప్లాను రెండు విధాల లాభదాయకమయ్యిందన్నమాట! అతను రాసిన బోలెడు కథలూ, కొన్ని నవలలూ గదిలో వున్నట్టున్నాయోయ్...అవి కూడా ప్రచురిస్తే ?

శివ : (గుటక మ్రింగుతూ) బావుంటుంది గానండీ, అతను బ్రతికి వున్నట్టవుతే కొంప మునిగిపోతుంది. మన యిరువురమూ కోర్టు యెక్కాల్సి వస్తుంది. మీ మాటకేం ? పెద్దలు, ఆర్థిక స్తోమత పరపతీ వున్నవారు...యెలాగైనా బైటపడతారు. నా పని శిక్ష అనుభవించడమే.

గంగా: (వెటకారంగా నవ్వి) అంత భయమెందుకోయ్ ? అతడు చచ్చాడని, యేనాడో నీకు చెప్పాను.

శివ : ఏనాడో అంటారేవిఁటి ? మొన్ననే కదండీ చెప్పారు ?

గంగా: మొన్ననేవిఁటోయ్ ? పది రోజులు అవ్వలేదూ ?

శివ : అయ్యిందనుకోండి.

గంగా: మరింకేం ? చచ్చిన వ్యక్తి బ్రతికి వుంటాడని, లేదా బ్రతుకుతాడని, యెలా నువ్వు వూహిస్తున్నావో, నాకు అర్థం కాలేదు. ఇంత పిరికివాడివి ప్రచురణకర్తగా యెలా అయ్యావోయ్ ?

శివ : చనిపోయాడని మీరు చెప్పడమే గాని, నేను యెక్కడా వినలేదండీ ! ఏ పత్రికలోనూ ఆ వార్త ప్రచురింపబడ లేదు అంత ప్రఖ్యాత రచయిత పరమపదిస్తే, ప్రజలు సాహితీపరులు వూరుకుంటారటండీ? ఊరూరా సంతాప సభలు జరిపే వుందురు. ఏవిటో నాకు అనుమానంగా వుంది. ఏదో, ఆ ఒక్క పుస్తకం మీ బలవంతాన ప్రచురించాను గాని, అది తలచుకుంటే యిప్పటికీ నా గుండెలు కొట్టుకుంటున్నాయి.

గంగా: (సూటిగా చూసి) నీ బుద్ధి నువ్వు చూపించుకుంటున్నావోయ్ శివరామ్.

శివ: (తడబడుతూ) అబ్బెబ్బే మీరలా కోపగించుకొంటే, నేనేం చెప్పగలను చెప్పండి ? ఉన్న విషయం దాచకుండా చెప్పాను.

గంగా: (కటువుగా చూస్తూ) శివరామ్...

శివ : (సవినయంగా) చెప్పండి...చెప్పండి.

గంగా: నీ మేనత్త ఆస్తి, యెలా నీకు వచ్చిందో జ్ఞాపకముందా శివరామ్ ?

శివ : (ఒక్కసారి చలించిపోయి) జ్ఞాపకముందండీ ! వుంది... మీరింక చెప్పొద్దు. ఆ విషయం అప్రస్తుతం.

గంగా: (వెటకారంగా నవ్వి) అప్రస్తుతం కాదు శివరామ్... ప్రస్తుతం మనకి అవసరమైనదే! ఆ విషయం యెత్తేసరికి, నువ్వు యెంతగా చలించిపోయావ్ నీకే తెలుసు. నువ్వు యెందుకలా చేశావు ? స్వార్థం...అంతేనా ?

శివ : (గాభరాగా మొహంమీది చిరుచెమట ఒత్తుకుంటూ) ఔనండీ... స్వార్థమే ! మీకు తెలియందేముంది ? పోనిద్దురూ అవన్నీ యిప్పుడెందుకు ?

గంగా: (నవ్వుతూ) అవసరముందనే గుర్తుకు తెస్తున్నాను. సరిగ్గా అటువంటి స్వార్థంతోనే నేనూ "చక్రధారి" ని చంపించేశాను. (చివరిమాట మెల్లగా అంటాడు.)

శివ : (అదిరి పడి) చంపించేశారా ?

గంగా: (ఆదోలా నవ్వి) సరిగ్గా నువ్వు చేసిన విధంగానే నిన్నే అనుసరించానన్నమాట ! అవుతే వ్యత్యాసం యేమిటంటే, నువ్వు మీ మేనత్త హత్య చేతులారా చేశావు. నేను మరొకరిచే చేయించాను.

శివ : మంచిపనే చేశారు. అతని ఆస్తి మీకు కలుస్తుందా?

గంగా: ఆస్థి యెవడికొవాలోయ్... ? అలా చెయ్యాల్సి వుంది. కారణం వుందనుకో ! ఏదో కొంప లేదని మా యింట్లో ఓ గది అద్దెకు యిచ్చామా, మనిషిలో ఆ కృతజ్ఞత యేమీ లేదు.... పైగా మా అమ్మాయినే ప్రేమించడం ప్రారంభించాడు. నా తాహతు యెక్కడ ? అతని అంతస్థు యేవిటి ?

శివ : అతనికీ మంచి పేరు ప్రతిష్ఠలు వున్నాయండీ :

గంగా: పేరు ప్రతిష్ఠలు యెవడికొవాలోయ్ ! వాటితో కడుపు నిండుతుందా ? రేపొద్దుట మా అమ్మాయినే పెళ్ళాడితే, అతడి పేరు మా అమ్మాయి కడుపు నింపుతుందా చెప్పు ? కావల్సింది డబ్బు...అతడికి అదే పూజ్యం.

శివ : అదీ నిజమే లెండి. మీ హోదాకి తగ్గటుగా మీ అల్లుడు వుండాలి మరి

గంగా: ఓసారి అతనికి చెప్పి చూశాను. అమ్మాయిని అదుపులో పెట్టడానికి ప్రయత్నించాను. లాభం లేకపోయింది ఇల్లు ఖాళీ చెయ్యమన్నాను అబ్బే : అతడు వదిలేనా ? అయినా రభసపడ్డం నాకు యిష్టం లేకపోయింది. ఇప్పుడు అర్థమయ్యిందిగా, నేను యెందుకలా చేయించానో ?

శివ : అంత మొద్దుబుర్ర కాదు లెండి. అర్థమయ్యింది గాని, అతను చచ్చిపోయినట్టు నిర్ధారణేనా అని ?

గంగా: మంచివాడివేనోయ్...(మెల్లగా) చంపివచ్చిన వ్యక్తి నాకు ఆప్తుడు కుడిభుజం వంటివాడు.

శివ : ఎవరండీ ?

గంగా: (చిరుకోపంతో) అదంతా నీకెందుకోయ్ ?

శివ : (గతుక్కుమని) పోనీలెండి ..ఇంక అతని భయం మనకి లేదంటారు అంతేనా ?

గంగా: అన్నమాటే కదోయ్.

శివ : అలా అవుతే, ప్రస్తుతం గదిలో వున్న అతని రచనలన్నీ పుస్తక రూపంలో తీసుకురావడానికి నాకేమీ అభ్యంతరం లేదు.

గంగా: మరి, ఆ పుస్తకం ప్రచురించావు కదా, దాని తాలూకు పైకం మాట !

శివ : ఇచ్చేస్తానండీ ! ఇదిగో ఆర్డర్లు పూర్తిగా వచ్చేస్తే మీ డబ్బు ముట్టజెప్తాను.

(గిరి ప్రవేశిస్తాడు పాతికేళ్ళ యువకుడు. కళ్ళు తీక్షణంగా మెరుస్తుంటాయి. ట్రాపికల్ పేంటూ, సిల్కు బుష్షర్టూ

వేసుకుని వుంటాడు. మెళ్ళో బంగారపు గొలుసు ఒంటి పేటది ఉంటుంది అతన్ని చూడగానే, భాగ్యవంతుడని యిట్టే పసిగట్టేయవచ్చు. కాని, కళ్ళల్లో కరకుదనం కొట్ట వచ్చినట్టు కనిపిస్తుంది.)

గిరి : (వస్తూనే శివరామ్‌ని చూసి) నమస్కారమండీ!

శివ : (విస్తుపోయి) నమస్కారం...మీరెవరో నాకు తెలీదే!

గిరి : (నవ్వి) మీకు తెలీకపోవచ్చు కాని, మీరెవరో నాకు తెలుసు. రాత్రింబవళ్ళు శ్రమించి రచయితల పుస్తకాలు రాస్తే, ఆ పుస్తకాల్ని అచ్చువేసి, వారికి ప్రతిఫలంగా చిల్లి కానీ అయినా యివ్వకుండా, కేవలం కొన్ని పుస్తకాలే వారి మొహాన ప్రతిఫల రూపంగా విసిరికొడుతున్న ప్రచురణకర్తలు కాదూ ?

శివ : శృతిమించి మాటలాడుతున్నారు.

గిరి : కాదండీ! వాస్తవం వెల్లడిస్తున్నాను మీ పేరు ఆంధ్ర దేశమంతా మారుమ్రోగుతూ వుంటేను: (నవ్వుతూ మరో కుర్చీలో కూర్చుంటాడు )

శివ : గంగాధరంగారూ! అలా చూస్తున్నారేవిటండీ ?

గంగా: కంగారుపడతా వెందుకయ్యా ? మాకు దగ్గరి బంధువులే యితడు చెప్పింది అబద్ధమంటావా ?

శివ : (విసుగ్గా) శుద్ధ అబద్ధం, మీరు కూడా అలాంటి భావంతో వుండడం నాకు బాధాకరంగావుంది. రచయితలకు తృణమో ప్రణమో ముట్టజెప్తూ వున్నానే గాని, అంత అన్యాయం యెప్పుడూ చెయ్యలేదే!

గిరి : అవుతే గిట్టని వాళ్ళెవ్వరో అలా ప్రచారం చేస్తున్నారేమో లెండి. అరిచే కుక్కలు కరవవుగా, మీరేం బాధపడకండి వాళ్ళనలా అరుచుకోనీయండి. (గంగాధరంవేపు చూస్తూ) ఏమండీ మావఁగారూ, మీ పథకం యీయనతో చెప్పారా?

గంగా: ఇంతకు ముందే చెప్పానోయ్...అప్పుడే ఒక పుస్తకం ప్రచురణ కూడా అయ్యింది.

గిరి : ఆ పుస్తకానికి యేమాత్రం డబ్బు యిచ్చారు?

గంగా: లేదింకా. ఇస్తానంటున్నాడు

గిరి : ఇవ్వడమేవిఁటి? పుస్తకాలా? లేక డబ్బేనా?

గంగా: ఏమయ్యా శివరామ్? నాకూ పుస్తకాలే ప్రాప్తమౌతాయా?

శివ : ఎంత మాటన్నారండీ? మీకు డబ్బు ముట్టజెప్పక పోతే అప్పుడడగండి.

గిరి : అదే...యెంతని?

శివ : మొన్నను ప్రచురించిన పుస్తకానికి రెండు వందలు ముట్ట జెప్పాలని అనుకుంటున్నాను.

గిరి : పుస్తకం ఖరీదు యెంత పెట్టారు?

శివ : నాలుగు రూపాయిలు...

గంగా: అంత పెద్ద పుస్తకమయ్యిందటోయ్?

శివ : మీకు తెచ్చి యివ్వాలను కున్నా: కాని, యింకా బైండింగ్ వర్కు అవుతుంది.

గిరి : మీరు కనీసం వెయ్యి ప్రతులు వేసి వుంటారు ఏం?

శివ : ఔనండీ!

గిరి : అంటే మీకు వచ్చే ఆదాయం నాలుగువేలు...అందులో కాగితం, ప్రెస్సూ, తతిమ్మా ఖర్చులూ ఓ వెయ్యిరూపాయిలు అయివుంటాయి. ఓ రెండువందలు యిటు పారేస్తే రెండువేల ఎనిమిది వందలు మీకు లాభమన్నమాట!

గంగా: (విస్తుపోయి) అంత లాభమే? ఏమోయ్ శివరామ్, నీ వ్యాపారమే బావుంది. మీమేనత్త ఆస్తంతా కలిసినా, నీ కింకా ఆశ అడుగంట లేదటోయ్?

శివ : (గాభరాపడి) అబ్బే: అబ్బే: యిందులోని యిబ్బందులు మీకు తెలీవండీ గంగాధరంగారూ! కాగితపు ధర రోజుకిరోజూ ఆకాశాన్నంటుకుంటూవుంది. ప్రెస్సులో పనివాళ్ళు, జీతాలు అధికం చెయ్యమని ఒకచేసట్టుబట్టి కూర్చుంటున్నారు. నిజం చెప్పుకోవాలంటే, యిందులో లాభించేది చాలా తక్కువ.

గంగా: (నవ్వుతూ) అందుకేగామోసు, నీ బ్యాంకు బేలెన్సు పాపంలా పెరిగి పోతుంది.

శివ : అబ్బే! అటువంటిదేమీ లేదులెండి...పోనీ, మీరు తెలిసిన వారు గాబట్టి మరో వంద ఉసుకోండి.

గిరి : అలా దారికి రండి. అన్నట్టు మావఁగారూ, కొన్ని పుస్తకాలు నాపేర ప్రచురిస్తామన్నారు?

గంగా: ఔనోయ్, మంచి సమయానికి గుర్తుచేశావు, ఏమయ్యా శివరామ్, వ్రాతప్రతులు ఒకటి రెండు వున్నట్టున్నాయి.

వాటివి మావాడిపేర ప్రచురిస్తే, బావుంటుందను కుంటున్నానోయ్...

శివ : (నీళ్ళు నముల్తూ) అది యెట్లా సాధ్య పడుతుందండీ?

గిరి : ఎందుకు సాధ్యపడదు? నేను వ్రాసినవంటే. యెవరూ నమ్మరా యేవింటి నేనేం చదువుకోలేదా?

శివ : చదువుకోలేదని నేననలేనండీ? కాని, చదువుకున్న వాళ్ళంతా రచయితలై పోతున్నారా చెప్పండి?

గిరి : నేనూ ఓ రచయితనే అనుకోండి.. ఎవరూ నమ్మరా?

శివ ; నమ్మరని కాదండీ; రచయిత కొస్తంత పేరున్నవాడైతే తప్పించి, పుస్తకాలు అమ్ముడు పోవు.

గిరి : వ్యాపారరీత్యా మాట్లాడుతున్నారా?

శివ : ఔను మరి: మేం పరోదృష్టితో మాట్లాడలేం. అనుభవం గలవాడిగా చెప్తున్నాను.

గిరి : అలాగవుతే, ఆ వ్రాతప్రతులు యీయనకి యివ్వకండి మావఁగారూ? మరొకరిచేత వేయించుకోవచ్చు.

శివ : మీయిష్టం., మరేం చేస్తాం? కాని, ఒక్కవిషయం... ఆయన రాసినవి మరొకరిపేరు పెట్టి ప్రచురించినా, పాఠకులు పసిగట్టేస్తారు.

గంగా: అది నిజమేమరీ! అతని రచనా విధానమే వేరు.

శివ : అదే నేనూ అంటున్నానండీ:

గిరి : ఏవింటి మావఁగారు యిప్పుడిలా అంటున్నారు?

గంగా: మొదట్లో నాకీ ఆలోచనలే తట్టలేదోయ్...శివరామ్, అతడి గదిలోకి వెళ్ళి చూదాం రా...

శివ : చిత్తం పదండి...

గంగా: గిరీ! నువ్విక్కడే వుండవోయ్... (కుడివేపు గదిలోకి వెళ్తాడు. అతణ్ణి శివరావు అనుసరిస్తాడు.)

గిరి : (వాళ్ళు వెళిపోయె పఃకుఅగి) పత్రి పిరికిపందలు ... (విసుగ్గా మీదున్న పత్రిక తీస్తాడు.)

[కొన్నేపటికి వెలపలినుండి యిరువురు యువకులు వస్తారు. అందులో ఒకతను సుందరం స్ఫురద్రూపి...పిల్లి గడ్డం. రోల్డుగోల్డు ప్రేము కళ్ళద్దాఃఃః ... షరాయి, లాల్చీవేసుకొని వుంటాడు. రెండోవ్యక్తి సుబ్బారావు...కాకీపేంటు. తెల్ల బుష్ షర్టూ వేసుకొని వుంటాడు ఎత్తైన విగ్రహం...]

గిరి : (అకస్మాత్తుగా వాళ్ళని చూసి యెందుకోమరి నిల్చుండి పోతాడు) ఎవరు కావాలండీ?

సుంద: గంగాధరం గారిల్లు యిదేకదండీ?

గిరి : ఔనండీ!

సుంద: ఆయన వున్నారా?

గిరి : ఎందుకు?

సుబ్బా: అదేం ప్రశ్నండీ? అవసరంలేకపోతే, యెవరైనా వస్తారా!

గిరి : (విసుగ్గా) ఉన్నారు...కూచోండి...వచ్చేస్తారు...

(సుందరం, సుబ్బారావు కూర్చుంటారు 'థాంక్స్' అనుకుంటూ)

గిరి : (సోఫాలో కూచుంటూ) మనది యేవూరండీ?

సుం: ఈ వూరు కాదులెండి... 'చక్రధారి' అనే రచయిత యిక్కడే వుంటున్నాడు కదండీ?

గిరి : (త్రుళ్ళిపడినట్టు ఒక్కసారి నుంచుని) ఔ...ఔను గామోనండీ! నాకు అంతగా తెలీదు. మా మావఁయ్యను పిలుస్తానుండండి, (కుడివైపు గదిలోకి చరచరా పోతాడు)

(ఇంకా వుంది)



# విద్యుచ్ఛక్తి సరఫరా

1961 డిశంబరులో శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట తాలూకాలోని రాళ్లపాడు గ్రామానికీ, పాలకొండ తాలూకాలోని పొత్తిలి, రామభద్రరాజుపేట గ్రామాలకూ విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

ఇదే నెలలో విశాఖపట్నం జిల్లా యెలమంచిలి తాలూకా ఉప్మాక గ్రామానికి కూడా విద్యుత్ సరఫరా జరిగింది.

1961 నవంబరులో చిత్తూరు జిల్లాలోని దిగువ పేర్కొన్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభించింది

(1) దౌలతికానపల్లె (వాయల్పాడు తాలూకా). (2) పంతపల్లె (చిత్తూరు తాలూకా). (3) చిన్ననడింపల్లె ( చిత్తూరు తాలూకా).

1961 డిశంబరులో చిత్తూరు జిల్లాలోని ఈ క్రింద పేర్కొన్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కలిగించారు.

(1) అప్పలాయగుంట (పుత్తూరు తాలూకా): (1) ఎనుమల పాలెం (చిత్తూరు తాలూకా); (3) నడింపల్లె (చిత్తూరు తాలూకా); (4) అమ్మగారిపల్లె (చిత్తూరు తాలూకా) ( ) గోపాలపురం (చిత్తూరు తాలూకా); (6) రాచరంగయ్యగారిపల్లె (చిత్తూరు తాలూకా) (7) అరివిరెడ్డిపల్లి (చిత్తూరు తాలూకా) (8) బొంతివంక (చిత్తూరు తాలూకా); (9) వటనపల్లె (మదనపల్లె తాలూకా): (10) కృష్ణాపురం (మదనపల్లె తాలూకా); (11) బోడెవారి పల్లె (పుంగనూరు తాలూకా); (12) ఎడిగపల్లె (పుంగనూరు తాలూకా) (13) కోడిరెడ్డిపల్లె (పుంగనూరు తాలూకా).

కడప జిల్లాలోని దిగువ పేర్కొన్న గ్రామాలకు 1961 డిశంబరులో విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు:—

(1) పెల్లూరు (కడపతాలూకా); (2) ఖాద్రాబాద్ (జమ్మలమడుగు తాలూకా); (3) బక్రాపేట (జమ్మలమడుగుతాలూకా).

తెలంగాణా ప్రాంతంలో 1961 డిశంబరులో ఈ క్రింద పేర్కొన్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభించింది:—

(1) శివంపేట (అందోల్ తాలూకా, మెదక్ జిల్లా) (2) తూముకుంట (మేడ్చల్ తాలూకా హైద్రాబాదు జిల్లా) (3) షష్మాబాదు (కరీంనగరం తాలూకా, జిల్లా) (4) ఆకుతోటపల్లె కల్వకుర్తి తాలూకా, మహబూబ్‌నగరం జిల్లా) (5) మేడపల్లి (ఖమ్మం తాలూకా, జిల్లా) (6) బోతిరెడ్డిపల్లి (జహీరాబాదు తాలూకా మెదక్ జిల్లా) (7) మల్కాలపల్లె (మహబూబాబాద్ తాలూకా, వరంగల్ జిల్లా) (8) హోఅఖుద్ (జహీరాబాదు తాలూకా, మెదక్ జిల్లా) ఈ గ్రామానికి లోగడ తెలిపినట్టు 1961 నవంబరులో గాక డిశంబరులో విద్యుచ్ఛక్తి సౌకర్యం లభింపజేశారు.

కృష్ణా జిల్లా, నందిగామ తాలూకా పెండ్యాల గ్రామానికి 1962 జనవరిలో విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు.



# పారిశ్రామిక విశేషాలు

[ రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామిక వేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షిక క్రింద యివ్వబడుతున్నవి. ]

## కేంద్ర ప్రాజెక్టు

మందుల ఫ్యాక్టరీ నిమిత్తం సంపాదించిన స్థలం సమతలం చేయబడుతున్నది.

భారీ విద్యుచ్ఛక్తి పరికరాల ప్రాజెక్టుకు యెన్నిన స్థలాన్ని సమతలం చేసే పని కూడా నాగార్జునసాగర్ అధారిటీలు చేపట్టారు.

## ప్రైవేటు విభాగం

విశాఖపట్నంలో గమ్‌బూట్లు, చెప్పులను అడుగున మైక్రో సెల్యులోస్ రబ్బర్ అట్టడుగల యితర పాదరక్షలను, తోలు విభాగాలు లేని యితర చెప్పుల్నును తయారుచేసే ఫ్యాక్టరీ స్థాపనకై కేంద్ర ప్రభుత్వం లైసెన్సు యిచ్చినది.

హైదరాబాదులో విద్యుచ్ఛక్తి మాయిస్ట్‌నీ, బ్లాక్‌ల (పీటి యెత్తేశక్తి 500 కి. గ్రా.) తయారీకై ఫ్యాక్టరీ నెలకొల్పుటకై కూడ ఒక ప్రైవేటు పార్టీకి లైసెన్సు యివ్వబడినది.

## పరిశ్రమల స్థాపనకై సౌకర్యాలు

రాష్ట్రంలో కొత్త పరిశ్రమల స్థాపనను ప్రోత్సహించుటకై యిటీవల ప్రభుత్వం (జి ఓ ఎమ్ ఎస్. నెం 1568 ఆరోగ్యం. గృహవసతి, మునిసిపలు అడ్మినిస్ట్రేషను శాఖలో) ఆయా మునిసిపలు అధికారులతో సంప్రదించి కొత్త పారిశ్రామిక సంస్థలకు తక్కువ రేట్లకు నీటిని సరఫరా చేయుటకై ఉత్తరువు చేసినది. ఆ ప్రకారం, రోజుకు 50 000 గేలనకు మించే పరిశ్రమల మొత్తం సరఫరాలన్నిటికి 1 000 గేలన్లకు రూ. 2/– చొప్పున వసూలు చేయమని విజయవాడ, కాకినాడ, గుంటూరు, రాజమండ్రి పురపాలక సంఘాలకు చెప్పబడినది.

ప్రభుత్వం యెక్కువ ఖర్చుతో కూడిన రెండు నీటి సరఫరా పథకాలను కూడ–ఒకటి మంజీరవద్ద (హైదరాబాదుకు సమీపంలో) రెండవది విశాఖపట్నం వద్ద–ఆ ప్రాంతంలో కొత్త పరిశ్రమలకు నీటి సరఫరాను హెచ్చించుటకై చేపట్టినది.

కొన్ని కొత్త పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి తక్కువ రేట్లకు సరఫరా చేయబడుతున్నది. పైసౌకర్యాలు దీనికి తోడుగా చేయబడుతున్నది.

## బొగ్గు త్రవ్వకం పరిశ్రమ

సింగరేణి బొగ్గుగనుల (ప్రభుత్వ కంపెనీ) వద్ద వుత్పత్తి క్రమంగా హెచ్చుతున్నవి. 1961 నవంబరు నెల వుత్పత్తి 2,66 239 టన్నులు. అంతక్రితం సంవత్సరం యిదే కాలంలో యీ వుత్పత్తి 2 19,791 ట. లు మాత్రమే.

## పంచదార పరిశ్రమ

నిజాం పంచదార ఫ్యాక్టరీ లిమిటెడ్ విస్తరణ పూర్తి అయినది. చెఱకుఆట 6–12–61 న ఆరంభమైనది. ఈ ఫ్యాక్టరీ రెండు యూనిట్లు కలసి యిప్పుడు రోజుకు 4,200 టన్నుల చెఱకు పైగా ఆడగలవని భావించబడుతున్నది.

పంచదార ఫ్యాక్టరీ అన్ని యూనిట్లలోను కాస్టింగ్ సిస్టం ప్రవేశపెట్టబడినది. దీనివల్ల యీ ఫ్యాక్టరీలో అనుసరించబడే పారిశ్రామిక ఇంజనీరింగ్ పద్ధతులవల్ల యీ ఫ్యాక్టరీకి లాభించటమే కాక ప్రైవేటు, సహకార విభాగాలలో సశాస్త్రీయమైన నిర్వహణ విషయంలో మార్గ దర్శకత్వం కూడా లభించగలదని భావించబడుతున్నది.

నిజామాబాదు జిల్లా జానకంపేటలో నిజామాబాదు సహకార పంచదార ఫ్యాక్టరీకి 18–1–62 న కేంద్ర ఆహార, వ్యవసాయ మంత్రి శ్రీ యస్. కె. పాటిల్ శంఖుస్థాపన చేశారు.

??????

# ప్రశ్నలు - సమాధానాలు

!!!!!

శ్రీ బి లక్ష్మీనారాయణ, మట్వాడ, వరంగల్ జిల్లా.

ప్రశ్న:— 230. ఆంధ్ర ప్రదేశ్‌లో రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో కొత్తగా ఎన్ని విద్యా సంస్థలను నెలకొల్పారు ?

సమాధానం:— ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆంధ్ర ప్రదేశ్‌లో తెరిచిన విద్యా సంస్థల సంఖ్యా వివరాలు ఈ విధంగా వున్నాయి: ప్రాథమిక పాఠశాలలు 5496. కొత్త జూనియర్ బేసిక్ పాఠశాలలు 284, మాధ్యమిక పాఠశాలలు 541, పోస్ట్ బేసిక్ పాఠశాలలు 2, బేసిక్ శిక్షణ పాఠశాలలు 39, ప్రత్యేక వయోజన (స్త్రీల) పాఠశాలలు 6. కొత్త ఉన్నత పాఠశాలలు 381, కొత్త శిక్షణ కళాశాలలు 3, కొత్త మహిళా కళాశాలలు 4, కొత్త పురుషుల కళాశాల 1, వ్యాయామ విద్యా కళాశాల 1, ఇంజనీరింగ్ కళాశాలలు 2, పాలిటెక్నిక్ మైనింగ్ సంస్థలు 14, పారిశ్రామిక శిక్షణ సంస్థలు 3, జూనియర్ సాంకేతిక పాఠశాలలు 3.

శ్రీ వి. రంగరామచిన్నయ్య, వర్లి, బొంబాయి.

ప్రశ్న:— 231. నిజామాబాదు జిల్లా ఆర్మూర్ తాలూకాలో దోనకల్—మొరుటూడుల మధ్య పాలెం వాగుకు అడ్డంగా నిర్మించిన అడ్డకట్టు దారి చాలా క్రిందుగా వున్నది అందువల్ల వర్షాకాలంలో ఎస్. ఆర్. టి. సి. బస్సులు ఈ మార్గాన్ని దాటలేక పోతున్నవి. ఈ అడ్డకట్టు దారిని పెంచడానికి రాష్ట్ర ప్రభుత్వం యోచిస్తున్నదా ? అయితే ఆ పని ఎప్పుడు జరుగుతుంది ? అందుకు ఎంత మొత్తం కేటాయించారు ?

సమాధానం:— తృతీయ పంచ వర్ష ప్రణాళికా కాలంలో జగిత్యాల—ఆర్మూరు రోడ్డుపై 34 వ మైలు వద్ద ఒక వంతెనను నిర్మించడానికి ప్రతిపాదన జరిగింది. మూడవ ప్రణాళిక ప్రతిపాదనలో తాత్కాలికంగా రూ. 5 లక్షలు కేటాయించారు. ప్రస్తుతపు లో లెవల్ కాజ్‌వే స్థానే హై లెవల్ కాజ్‌వేను నిర్మించడానికి అంచనాలను పరిశీలించవలసివుంది.

శ్రీ ఎస్. ముకుందరావు, పోలపల్లె, ధర్మవరం తాలూకా, అనంతపురం జిల్లా.

ప్రశ్న:— 232 అనంతపురం జిల్లాలో క్షామ నివారణ చర్యలకు మంజూరు చేసిన మొత్తాలు, ఇప్పటి వరకు జరిగిన పని, సహాయక చర్యలవల్ల ప్రయోజనం పొందిన ప్రజల సంఖ్యా వివరాలను దయచేసి తెలియజేయండి.

సమాధానం:— ప్రతికూలమైన ఋతు పరిస్థితుల మూలంగా దెబ్బ

తిస్నందున 1961_62 వ సం లో అనంతపురం జిల్లాకు దిగువ మొత్తాలను కేటాయించారు:—

ప్రత్యేక సహాయక కార్యక్రమం

54. ఎ. క్షామ నివారణ (బి) సహాయ రోడ్డు పనులు, రూ. 9,50,000_ఇతర పనులు. మంచినీటి బావులను పూడిక తీయడం, రూ. 70,000 : (122 రోడ్డు పనులు అమలు జరుగుతున్నాయి. రోజుకు సగటున 1220 మంది కార్మికులు ఈ పనులు చేస్తున్నారు. అన్ని తాలూకాలలోనూ ఈ పనులు జరుగుతున్నాయి.)

(2) ఎగువ కాలువ పనులలో నిమగ్నులై వున్న కార్మికులకు సదుపాయాలు చేకూర్చడం, రూ. 25,000/-: (ఎగువ కాలువ, దాని పంట కాలువల త్రవ్వకం అరు స్థలాలలో చురుగ్గా జరుగుతున్నది. కార్మికులకు వసతి, రవాణా సౌకర్యాలను ఉచితంగా కల్పించారు. ఈ పనులను రోజుకు సగటున 4000 మంది కార్మికులు చేస్తున్నారు. ఇక్కడి శిబిరానికి సంబంధించిన కార్మిక కుటుంబాలకు చెందిన పిల్లలకూ, గర్భిణీ స్త్రీలకూ, చంటిపాప తల్లులకూ ఉచితంగా పాలు సరఫరా చేశారు. పనులు జరిగే స్థలాలకు ఎడ్ల బండ్ల పైనా, ప్రభుత్వ శకటాల పైనా మంచినీటిని చేరవేస్తున్నారు. వర్క్‌షాపులవద్ద కానీ లేదా వాటికి చాలా సమీప ప్రదేశంలో కాని కార్మికులకు చౌక డిపోల ద్వారా బియ్యం విక్రయిస్తున్నారు.

పశుగ్రాసం కొనుగోలు, రూ 60 000/- : పశుగ్రాసం కొరత ఏర్పడిన ప్రదేశాలలో పంపిణీ చేసే నిమిత్తం, నల్లమలై కొండలనుంచి 500 టన్నుల పశుగ్రాసాన్ని సరఫరా చేయడానికి ఆర్డరు చేశారు. గడ్డి రవాణా జరుగుతున్నది. దీని ధర సుమారు రూ. 100 లు కాగా రూ 48 లకు అమ్ముతారు, ఇందువల్ల జరిగే నష్టాన్ని ప్రభుత్వం భరిస్తుంది

రాష్ట్ర ప్రభుత్వం యిచ్చిన అప్పులు, అడ్వాన్సులు:— సబ్సిడీ బావులు; వేయి బావులకు రూ. 7,50,000 లు. ఇవి వివిధ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుకు పంపిణీ చేయబడినవి. ఈ విషయంలో తాజా ఆదేశాల ననుసరించి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు స్థాయి సంఘం వాటివి మంజూరు చేస్తుంది

అప్పులు అడ్వాన్సులు :

ఎల్. ఐ. ఎల్. వ్యవసాయం రూ. 3,00,000 లు. ఇది మామూలు కేటాయింపు రూ. 4 లక్షలకు తోడు. దరఖాస్తులు శీఘ్రంగా చూడబడుతున్నవి. సాగునీటి బావులను లోతు చేసే దరఖాస్తులకు ముందు ప్రాధాన్యంతో అప్పులు ఇవ్వబడుతున్నవి.

అప్పులు, అడ్వాన్సులు— (1) జీవనాధారపు అప్పులు: రూ. 25 000 లు, (2) పశుగ్రాసం అప్పులు రూ. 25,000 లు— ఇప్పుడు కొండ గడ్డి వచ్చినందున వెంటనే దానిని సబ్సిడైజుడు రేటుకు కొనుక్కొందుకు వీలుగా డబ్బు పంపిణీ చేయబడుతుంది.

చిన్న సాగునీటి వనరుల మరమ్మతు : రూ. 1,25 000, జనవరి మార్చి నెలల్లో చెరువులన్నీ యెండిపోయివుంటవి. ఆ పైన యిప్పుడు వ్యవసాయ కార్మికులకు పని వుండదు. కాబట్టి యీ పనిని యీ కాలంలో చేయాలి.

ప్రధాన మంత్రి రక్షణ నిధి : రూ. 2,000_దెబ్బతిన్న ప్రాంతాలలో అర్హులకు బట్టల సరఫరాకై వినియోగించబడినది.

భారతీయుల కరువు ధర్మ సంస నిధి నుంచి గ్రాంటు : రూ. 6,000 . దెబ్బతిన్న ప్రాంతాలలో అర్హులకు వస్త్రదానానికి, పేదల అన్నదాన కేంద్రాలకు రేషన్ల సరఫరాకు వినియోగించబడినది.

## పని కల్పించుటకై తీవ్రంగా నడుపబడిన మామూలు శాఖా సంబంధ కార్యక్రమాలు:

పబ్లిక్ వర్క్సు శాఖ హెచ్. ఎల్. సి. పనులు : రూ. 16.50 లక్షలు: పని జరుగుతున్నది. రోజూ దగ్గరగా 4,000 మందికి పని కల్పించబడుతున్నది.

ప. వ. శా. చెరువుల మరమ్మతు : గండిపడిన చెరువుల మరమ్మతు వగైరా — రూ. 3 75 లక్షలు : రోజూ దాదాపు వెయ్యిమంది పనిచేస్తున్నారు

వ్యవసాయ శాఖ భూసార పరిరక్షణ కార్యక్రమం: రూ. 1.60 లక్షలు, ఇది 5 తాలూకాలలో జరుగుతున్నది. దాదాపు 500 మంది పని చేస్తున్నారు. 31-3-62 నాటికి 8,000 ఎకరాలలో పని పూర్తి చేయాలని సంకల్పం.

సివిల్ సప్లయిస్ : మంజూరైన 350 చవుక ధర దుకాణాలలోను 291 తెరువబడినవి. 1961 లో 3,200 టన్నుల

బియ్యం, వెయ్యి టన్నులను యీ జిల్లాకు దిగుమతి చేయబడినవి. అవి చవుక ధర దుకాణాల ద్వారా అమ్మబడినవి. 1962 జనవరికి రెవిన్యూ బోర్డు (మన్‌మాడ్ నుంచి) 3,250 టన్నుల బియ్యాన్ని కేటాయించినది.

శ్రీ ఆర్. బి. లక్ష్మీసుందరరావు, భట్టిప్రోలు, గుంటూరు జిల్లా.

ప్రశ్న:— 233. చీరాల నూలు మిల్లు పనియెప్పుడు ప్రారంభిస్తుంది? దానికి యెన్ని కదుళ్ళు వుంటవి, యెంత ఖర్చు కాగలదు ?

సమాధానం:— చీరాలలోని చీరాల సహకార నూలు మిల్లు లిమిటెడ్ ఆరంభంలో 12,000 కదుళ్ళలో పని ప్రారంభించగలదని భావించబడుతున్నది. అది 1962 జూలై ఆరంభంలో పని ప్రారంభించవచ్చు. 12,000 కదుళ్ల గల నూలు మిల్లుకు సాధారణంగా రూ. 40—45 లక్షల మధ్య ఖర్చు కాగలదని అంటారు.

శ్రీ ఎమ్. ఆర్. వెంకటరెడ్డి, ఆర్. కె. వి, బహదూరువారిపేట, చిత్తూరు జిల్లా.

ప్రశ్న:— 234. చిత్తూరు జిల్లా పుత్తూరు తాలూకా కార్వేటినగరం బ్లాక్‌లోని ఆర్. టి. వి. బహదూరువారిపేటకు విద్యుచ్ఛక్తి బోర్డు విద్యుచ్ఛక్తి సరఫరాను మంజూరు చేసినదా ? ఆ పని యెప్పుడు మొదలుపెట్టబడుతుంది ?

సమాధానం:— పై గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా పథకాన్ని రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు 1961 అక్టోబరులో మంజూరు చేసినది. సొమ్ము అందుబాటులో వుండుటను బట్టి యీ పని కాలక్రమంలో తీసుకొనబడగలదు.

శ్రీ నల్లాదత్తాత్రేయులు, మోరి, రాజోలు తాలూకా, తూర్పు గోదావరి జిల్లా.

ప్రశ్న:— 235. కాకినాడలో నౌకాశ్రయం నిర్మాణ విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తుందా ?

సమాధానం:— కేంద్ర ప్రభుత్వ రవాణా, రాకపోకల సౌకర్యాల మంత్రిత్వ శాఖ యేర్పరచిన మధ్యరకం రేవు అభివృద్ధి సంఘం, ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించినంత వరకు కాకినాడ మచిలీపట్నం రేవులను దర్శించి, రేవులు, అందు ప్రాధాన్యతలపై తాను తయారు చేసిన వివేదికలో తృతీయ ప్రణాళికా కాలంలో ఒక్కొక్క రేవులోను జరుపవలసిన అభివృద్ధి పనులను గురించి సిఫార్సు చేసినది.

శ్రీ సి. శంకరరావు సిర్సిల్ల, కరీంనగరం జిల్లా.

ప్రశ్న:— 236 సాంఘిక సేవలో డిప్లమో సంపాదనకు యే అర్హత కావాలి ? ఈ సంస్థ మన రాష్ట్రంలో వున్నదా ?

సమాధానం:— లేదు

శ్రీ టి. జి రమణారావు, గుంతకల్లు.

ప్రశ్న:— 237 గుంటకల్లులో మున్సబు కోర్టు స్థాపనకు నిర్దేశించబడిన ప్రతిపాదనలను రాష్ట్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నదన్న విషయం వాస్తవమా ?

సమాధానం:— అటువంటి ప్రతిపాదనలేమీ ప్రభుత్వ పరిశీలనలో లేవు.

శ్రీ కోన మాధవరావు, మధిర తాలూకా.

ప్రశ్న:— 238 ఖమ్మం జిల్లా మధిర తాలూకాలో ఎర్రుపాలయం—భీమవరం రోడ్డు యెప్పుడు నిర్మించబడుతుంది ? ఈ పథకానికి యెంత సొమ్ము మంజూరు చేయబడినది ? పని యెప్పుడు ఆరంభమవుతుంది ?

సమాధానం:— ఎర్రుపాలాన్ని భీమవరంతో కలిపేందుకు సరాసరి ప్రతిపాదన యేమీ లేదు, ఎర్రుపాలెం నుంచి అచయపరాచికి వి.ఆర్. ప్రమాణాలలో రూ. 2.37 లక్షల ఖర్చుపై మూడవదశలో (1971—1976) నిర్మించాలని సంకల్పించబడింది భీమవరం నుంచి యీ మెయిన్ రోడ్డుకి ఒక చిన్న రోడ్డును నిర్మించవలసి వుంది. ఈ పనిని ఖమ్మం జిల్లా పరిషత్తు, (తరగతి వారీ విభజన ప్రకారం గ్రామ రోడ్డు అయినందున) సొమ్ము అందుబాటును బట్టి, చేపట్టాలి.

శ్రీ ఎమ్. కైలాసం, చాటూరు, జనగాం తాలూకా, వరంగల్లు జిల్లా.

ప్రశ్న:— 239 మాస్టర్ ప్లాన్ ప్రకారం తెలంగాణా ప్రాంతంలో యెక్కడ నుంచి యేయే ప్రదేశాలకు నిర్మించబడతవి ? పని యెప్పుడు ఆరంభమవుతుంది ? వాటి మార్గాలు చెప్పండి: కంకరరోడ్లా లేక బి. టి. రోడ్లా. వరంగల్లు జిల్లా రోడ్లు యేమైన ప్లానులో చేర్చబడినావా, వాటి వివరాలు :

సమాధానం:- మాస్టర్ ప్లాన్‌లో రాకపోకల సౌకర్యాలు ఒక్కొక్కటి 5 సంవత్సరాలు గల నాలుగు దశలలో మొత్తం 20 సంవత్సరాలలో అభివృద్ధిపరచబడతవి. ఈ అభివృద్ధి పిమ్మట అభివృద్ధి చెందిన ప్రాంతంలో గల ప్రతి గ్రామము మెయిన్ రోడ్డు నుంచి 1½ మైళ్ళ లోపు దూరంలోను, సగం అభివృద్ధి చెందిన ప్రాంతంలో 3 మైళ్ళ లోపు దూరంలోను, అభివృద్ధి చెందని ప్రాంతంలో 5 మైళ్ల లోపు దూరంలోను ఉంటాయి.

రోడ్డు వాటి ప్రాముఖ్యం, రద్దీలను బట్టి వివిధ తరగతులుగా విభజింపబడినవి. అభివృద్ధి, కొత్త నిర్మాణాలు వగైరా వివిధ దశలలో, వివిధ రకాల రోడ్లు తలపెట్టబడినవి. ఈ రోడ్ల నిర్మాణం, వివిధ ప్రణాళికా కాలాలలో ప్రభుత్వం కేటాయించే సొమ్మును బట్టి ఉంటుంది.

ఇక ప్రణాళికలో వరంగల్లు జిల్లాకు సంబంధించిన ప్రతిపాదనల విషయంలో, ప్రణాళికా కాలం 20 సంవత్సరాలలోను మొత్తం 2,380 మైళ్ళ 3 ఫర్లాంగుల రోడ్లను (ఇప్పుడున్న రోడ్లు 479 మైళ్ళ 7 ఫర్లాంగులు) నిర్మించాలని సంకల్పం. వివరాలు యివి:-

| తరగతి | సంకల్పించిన రోడ్లు | | ఉన్న రోడ్లు | |
|---|---|---|---|---|
| | మై. | ఫ | మై | ఫ. |
| జాతీయరహదార్లు | 110 | 4 | —— | |
| రాష్ట్ర రహదార్లు | 117 | 7 | —— | |
| జిల్లా పెద్ద రోడ్లు | 644 | 6 | 316 | 4 |
| జిల్లా యితర రోడ్లు | 821 | 0 | 69 | 5 |
| గ్రామ రోడ్లు | 686 | 2 | 93 | 6 |
| | 2380 | 3 | 479 | 7 |

మొత్తం 20 సంవత్సరాలకు యీ ప్రణాళిక మొత్తం ఖర్చు రూ. 1,826-22 లక్షలు.



# రాష్ట్రంలో ఖనిజ పరిశ్రమలు

రాష్ట్రంలో ఖనిజ సంబంధమైన పరిశ్రమల స్థాపనకు గల అవకాశాలను పారిశ్రామికుల దృష్టికి తేవటానికై 1962 ఫిబ్రవరి 1,2 తేదీలలో హైదరాబాదులో, రాష్ట్రంలో ఖనిజ పరిశ్రమలు అనే విషయంపై రెండు రోజుల చర్చ జరుపబడినది. దేశంలో గల వివిధ పరిశోధక లేబొరేటరీల నుంచి—నేషనల్ మెటలర్జికల్ లేబొరేటరీ, జమ్‌షెడ్‌పూర్, నేషనల్ కెమికల్ లేబొరేటరీ, పూనా అప్లైడు ఆర్థిక పరిశోధనా సంఘం, కొత్తఢిల్లీ—విశ్వవిద్యాలయాలు భారతదేశ భూగర్భ పరిశోధక సంస్థ, భారతదేశ గనుల సంస్థల నుంచి, రాష్ట్ర ప్రభుత్వ వివిధ శాఖల నుంచి దాదాపు 43 పత్రాలు వచ్చినవి. గనుల త్రవ్వకం పరిశ్రమలో నిమగ్నులైన వ్యక్తుల నుంచి 8 పత్రాలు వచ్చినందున యీ పరిశ్రమకు కూడ చాలవరకు ప్రాతినిధ్యం లభించినది. ఈ సందర్భంలో ఖనిజాలు. ఖనిజ సంబంధమైన వస్తువుల ప్రదర్శన ఒకటి ఏర్పాటు చేయబడినది.

పైచర్చ మూడు సమావేశాలలో జరిగినది. మొదటి దానిలో ముడియినుము, మాంగనీసు, క్రోమైటు, బొగ్గులను గురించి చర్చించబడినది. దీనికి సింగరేణి బొగ్గుగనుల కంపెనీ లిమిటెడ్ మేనేజర్ శ్రీ ఎన్. కె. నర్గాంకర్ అధ్యక్షత వహించారు.

రెండవ సమావేశంలో ఆస్బెస్టాస్, అభ్రకం, పింగాణీ రిఫ్రాక్టరీ ఖనిజాలు, సున్నపురాయి, ముగ్గురాయి ఖనిజపు రంగుల విషయం చర్చింపబడినది, దీనికి కేంద్ర జియోఫిజక్సు సంస్థ డైరెక్టరు డా. ఎమ్. ఎస్. కృష్ణన్ అధ్యక్షత వహించారు.

మూడవ సమావేశంలో బంగారము, వజ్రాలు, పలకలు, రసాయన యెరువులలో వినియోగింపబడు ఖనిజాల విషయం చర్చించబడినది. దీనికి శ్రీ ఎస్. ఎన్. సేన్—సూపరింటెండింగ్ భూగర్భ శాస్త్రజ్ఞులు, భారత భూగర్భ పరిశోధక సంస్థ, ఆంధ్ర ప్రదేశ్ సర్కిల్—అధ్యక్షత వహించారు

## సమస్యలు

ఈ చర్చల సందర్భంలో పేర్కొనబడిన కొన్ని సమస్యలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి:—

మాంగనీసుపరిశ్రమ వ్యాపారంపడిపోయినది. లభించేసరుకు తక్కువ శ్రేణిది కావడం, వాడుకలో వున్న యేపద్ధతివల్ల శ్రీకాకుళం ముడి సరకులో నుంచి అదనపు భాస్వరాన్ని తొలిగించుట సాధ్యం కాకపోవడం యిందుకు కారణం, మరికొంత కృషి సలిపితే యిందుకు తగిన పద్ధతి యేర్పడగలట్టు కనబడినది, ఈ ప్రాంతంలోని ముడిసరుకుకి దాదాపు 10 శాతం కృత్రిమ మాంగనీసు డయాక్సైడును కలిపిన యెడల అది డ్రై బ్యాటరీల తయారీకి వుపకరించగలదని ప్రయోగాలు రూఢిచేసినవి. ఈ విధంగా బ్యాటరీశ్రేణి మాంగనీసు డైయాక్సైడును దిగుమతి చేసుకొనే అవసరం తప్పిపోగలదు. ఈ విషయంలో మరికొంత శ్రద్ధచూపాలి.

బొగ్గును వినియోగించుకునే పరిశ్రమల స్థాపనావశ్యకత నొక్కి చెప్పబడినది. హెచ్చు బొగ్గు వుత్పత్తికై సింగరేణి బొగ్గు గనుల కంపెనీ చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు. సాధించిన ఫలితాలు పేర్కొనబడినవి. ఉక్కు రసాయన యెరువుల పరిశ్రమలను, లోటెంపరేచర్ కార్బొనైజేషన్ యూనిట్టుల స్థాపనలో బొగ్గు సరైన వాడకం ఆరంభం కాగలదని సూచించబడినది.

పింగాణీ ముడిపదార్థాల వనరుల విషయంలో క్షుణ్ణమైన విపులపరిశోధనలు ఆవసరమనీ అవి ఆ రంగంలో అభివృద్ధికి ప్రాతిపదిక కాగలవని భావించబడినది. నల్లసీసం పరిశ్రమ యెదుర్కొనే సమస్యలు చర్చించబడినవి. ఇంకా యిది దొరికే స్థలాలను వెదకడం, ముడిసరుకు శుద్ధికి చవుక పద్ధతులను కనిపెట్టడం అత్యవసరమని భావించబడినది. సున్నపురాతి పరిశ్రమ విషయంలో, సున్నపురాయి నిలవలు కలవనేదీమాతో వూరుకొనరాదని, యీ నిలవలను శ్రేణులవారిగా అంచనా వేయటమేకాక వాటిని భద్రపరచటానికి కూడ పూనుకొనాలని సూచించబడినది

రాష్ట్రంలోని ముగ్గురాతిని ఆడటంలో రేమండ్ మిల్లుశక్తిని యింకా యెక్కువగా వినియోగించుకోవాలనీ, కొన్ని పరిశ్రమలను నెలకొల్పాలని నొక్కి చెప్పబడినది. ముడి ముగ్గురాతిని జపాను, తదితర దేశాలకు యెగుమతి చేయడమూని, దానిని దేశంలో వాడకానికి నిలవ వుంచాలని నొక్కి చెప్పబడినది. ముగ్గురాళ్ల రంగును తొలగించుటకై పరిశోధన శాలల్లో జరిగిన ప్రయోగాలు విజయవంతమైనట్టు నివేదించబడినది. చిత్తూరు, అనంతపురం జిల్లాల బంగారు గనులను, రాష్ట్రంలోని వజ్రపు గనులను తిరిగి త్రవ్వించాలని గట్టిగా విజ్ఞప్తి చేయబడినది. పరిశోధన యిదివరకే ఆరంభమైనదని, ఫలితాలు నిరీక్షించ బడుతున్నవని పేర్కొనబడినది.

విశాఖపట్నంలో దొరికే ఆపటైట్‌ను వినియోగించి ఫ్యూజీడు భాస్వరం యెరువును తయారుచేయటానికి అవకాశం గలదని, యిది విజయవంతమైతే ఎర్రజాతి నేలలు సారవంతం కావటానికెంతో తోడ్పాటు జరుగుతుందని సూచించబడినది.

గనుల పరిశ్రమలో పనిచేసేవారి జీవన ప్రమాణాలను హెచ్చించుటయేమి, ఆ ప్రాంతాలలో రోడ్లు, రాకపోకల సౌకర్యాలు, ఆరోగ్య వసతులు అభివృద్ధి పరచుటయేమి అవసరమని నొక్కి చెప్పబడినది. సాంకేతిక శిక్షణా సౌకర్యాలు బాగా నే వున్నవి కాని యీ విషయంలో యింకా అభివృద్ధి సాధించుటకై ఒక నమూనా గని, పురావస్తు ప్రదర్శనశాల నెలకొల్పబడాలని సూచించబడినది.

## వస్తు సామగ్రి తయారీ

ఆంధ్రప్రదేశ్‌లో బహువిధమైన వుపయోగకరమైన ఖనిజాలు వున్నవని, అయితే ముఖ్యంగా యీ ఖనిజాలను త్రవ్వి ముడి సరుకును అమ్మటం వరకే యిక్కడ ఖనిజ పరిశ్రమ పరిమితమై వున్నదని ఆంధ్రప్రదేశ్ గనులు, భూగర్భశాస్త్రశాఖ డైరెక్టరు శ్రీ సయ్యద్ కాజిం తమ స్వాగతోపన్యాసంలో పేర్కొన్నారు. ఈ గనులవల్ల పూర్తి లాభం సంపాదించాలంటే వాటిని వివిధ విధాలుగా వినియోగించాలి. విశాఖపట్నంలో నూనె శుద్ధి కార్మాగారం వుండటం మన అదృష్టం. ఇతర ఖనిజాలను కూడ శుద్ధమూపాలుగా తయారుచేయడం వల్ల కలిగే లాభాలకు యిది నిదర్శనం.

"క్రిసొటైల్ రకం ఆస్బెస్టాస్ యెక్కువగా దేశంలోకల్లా ఒక్క మన రాష్ట్రంలోనే దొరుకుతుంది. మనరాష్ట్రం సరుకు మొత్తం దేశంలో దొరికే సరుకులో రమారమి సగం. కాని ఆస్బెస్టాస్ సిమెంటు తయారీలో స్వల్పంగా వాడబడే తక్కువ రకం ఆస్బెస్టాస్ తప్ప మిగిలినదంతా త్రవ్వినది త్రవ్వినట్టుగానే యెగుమతి చేయబడుతున్నది. ముగ్గురాయి దాదాపు అంతా ఆంధ్రప్రదేశ్‌లో దొరుకుతుంది. కాని దానిలో యేకొంతా రాష్ట్రంలో వినియోగించుకోబడదు. అభ్రకం, తదితర ఖనిజాల విషయంలో కూడా పరిస్థితి యింతే నిజానికి ఒక్క బొగ్గు విషయంలో తప్ప, మిగిలిన యే ఖనిజాలను యెక్కువగా త్రవ్వటం కాని, వాటికి సంబంధించిన పరిశ్రమలను పెద్ద యెత్తున నెలకొల్పుటకాని జరుగలేదు. ఖాళీ అయిన గనులను మళ్లీ నింపడం సాధ్యం కాదు కనుక గనులలో వ్యవహరించే వారికి ప్రత్యేక బాధ్యత వున్నది. మనం యే ఒక్క ఖనిజాన్ని వృథా చేయకూడదు. ఖనిజ పరిశ్రమలో చెత్తాచెదారాలు రాశిమానవు. వాటి వినియోగానికి కూడ మనం మనం మార్గాలను అన్వేషించాలి అభ్రకం గనుల త్రవ్వకంలో చంద్రకాంత, శిలాస్ఫటికాలతో కూడిన చెత్త అభ్రకం విస్తారంగా వుంటుంది, అలాగే ఫ్లాగ్‌స్టోన్ గనులవద్ద సున్నపు రాతి రజం రాసులకు రాసులు వుంటుంది.

## గనుల కార్పొరేషన్

పరిశ్రమల శాఖ కార్యదర్శి శ్రీ ఐ. జె నాయుడు తమ అధ్యక్షోపన్యాసంలో ఆంధ్రప్రదేశ్ గనుల కార్పొరేషన్ యేర్పాటు ప్రసక్తిని తెచ్చి యిలా అన్నారు. "ఈ సంస్థ గనుల త్రవ్వకం, వినియోగాల రంగంలో ప్రైవేటు విభాగానికి చోటు లేకుండా చేయటానికి వుద్దేశింపబడలేదు. అలాగని యెవరు అపార్థం చేసుకోకుందురు గాక. పైగా, ప్రైవేటు పారిశ్రామికులకు యీ విషయంలో ప్రోత్సాహం కలిగించడమే యీ సంస్థ వుద్దేశం. తీవ్రమైన పరిశీలనలు మున్నగునవి జరిపి యీ వనరులు ప్రైవేటు పారిశ్రామికుల కృషికి అర్హమైనంత పుష్కలమైనవని నిర్ధారణ చేయడం కూడ దీని పని. ఈ విషయంలో యితరులెవరికీ యేవిధమైన సంశయం వుండకుండా యీ ముఖ్య సందర్భంలో నేను స్పష్ట పరుస్తున్నాను.

"బొగ్గు వినియోగం విషయంలో, నేడు దేశంలో బొగ్గు మిక్కిలి ముఖ్యమైన వస్తువు అని మనందరికీ తెలుసు. మనం దిన పత్రికలను ముఖ్యంగా వాణిజ్యం లేక పరిశ్రమలకు సంబంధించిన వాటిని చూచినప్పుడు బొగ్గు పరిశ్రమకు చెందిన విషయాలను శీర్షికలలో చూస్తాము. సింగరేణి బొగ్గుగనుల కంపెనీ

లిమిటెడ్ బొగ్గు వుత్పత్తిని 27 లక్షల టన్నులనుంచి 57 లక్షల టన్నులకు—అనగా 30 లక్షల టన్నులు యెక్కువ—పెంచాలని ప్రయత్నం చేస్తున్నది.

"బొగ్గు వినియోగంపై ఆధారపడిన మెటలర్జికల్ పరిశ్రమ లేక యితర పరిశ్రమల స్థాపనకు తగినవనరులు మన రాష్ట్రానికి కలవు.

"డా. హుస్సేన్ జహీర్ నాయకత్వాన ప్రాంతీయ పరిశోధన లేబొరేటరీ లోటెంపరేచర్ కార్బొనైజేషన్ ప్లాంట్ రోజుకు 25 టన్నుల శక్తి కలది—పై జరుపుతున్న కృషి ధర్మమా అని కొన్ని మంచి ఫలితాలు తెలిసినవి సింగరేణి, ప్రక్కనగల యితర బొగ్గు గనులలో దొరికే రకం బొగ్గును వినియోగించవచ్చునని, దానిని మెటలర్జికల్ అజాగే పారిశ్రామిక ప్రయోజనాలకు పనికివచ్చే కోక్‌గా మార్చవచ్చునని నిర్ధారణ చేయబడినది. కేంద్రప్రభుత్వం దీనిని విశ్వశిస్తుందని. మేము యిదివరకే అడిగిన దుక్కు ఇనుము ఉక్కు ప్లాంటును మంజూరు చేస్తుందని ఆశిస్తాను. ఈ విషయంలో ప్రైవేటు, ప్రభుత్వ విభాగములు రెండిటికిని మేము యింకా ప్రయత్నాలు చేస్తూనే వున్నాము.

## ప్రభుత్వ సహాయం

రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్. పి. పాయ్ యీ చర్చకు సంబంధించిన ప్రారంభోపన్యాసంలో యిలా అన్నారు": "ఖనిజాల వాడకం మన రాష్ట్రానికి కొత్తేమీ కాదు పూర్వం. తక్కువ శ్రేణి సాంకేతిక పరిజ్ఞానం చాలిన రోజులలో, ఖనిజాల వాడకంలో మన రాష్ట్రం ప్రపంచంలో పెక్కు ప్రాంతాలకు నాయకత్వం వహించినది. లోహాలే కాక కోహినూరు వంటి జాతిరత్నాలుకూడా కృష్ణాతీరాన త్రవ్వబడినవే. రామగిరిలో బంగారుగనులు వర్ధిల్లేవి. డమాస్కస్ ఖడ్గాలు చేసిన ఉక్కు వరంగల్లు, బీదరులనుంచి వచ్చేదని పెక్కుమంది తలచడానికి తగు ఆధారం వున్నది. సింగరేణిలో బొగ్గు తప్పిస్తే మిగిలిన ఖనిజాల విషయంలో పై పైని త్రవ్వడం దొరికిన వాటిని తీసుకొనడం మాత్రమే జరుగుతున్నది. దేశం బొగ్గు వుత్పత్తిలో 6 శాతం కాబోలు మనం వుత్పత్తి చేస్తున్నాము. ఇప్పటి వరకు తెలిసిన బొగ్గు నిలవలు 10,000 లక్షల టన్నులను మించుతవి. మనం యింత వరకు సశాస్త్రీయమైన గనుల త్రవ్వకంలో అభివృదిని సాధించనేలేదు భూమినుంచి త్రవ్వి తీసుకున దానిని ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ననుసరించి సరిగా వినియోగించు కొనడమే లేదు. రాష్ట్రంలోపల బయటవున్న లేబొరేటరీలు చాల కృషిచేస్తున్నవి. పరిశ్రమలశాఖ కార్యదర్శి యిప్పుడే చెప్పినట్టు హైదరాబాదులోని ప్రాంతీయ పరిశోధక లేబొరేటరీ ఒక పైలట్ ప్లాంట్‌ను నెలకొల్పినది. ఇది లోటెంపరేచర్ కార్బొనైజేషన్, తదితరపద్ధతులపై పనిచేస్తున్నది, ఇక యిప్పుడు యీ పరిశోధనల ఫలితాలను వాణిజ్యరీతిని వినియోగించుకునేపని ప్రైవేటు పారిశ్రామికులది ముడియినుము విషయంలో,అదృష్టవశాత్తూ మనకు బొగ్గుకు ప్రక్కప్రక్కనే వుత్తమ రకం ముడి యినుము పుష్కలంగా దొరుకుతుంది. దురదృష్టవశాత్తూ మన రాష్ట్రంలో కోకింగ్ బొగ్గులేదు. కాని మనకు కల నాన్‌కోకింగ్ బొగ్గు వినియోగానికి పద్ధతులు కలవని ఆధునిక సాంకేతిక శాస్త్రం రూఢిచేసినది. మనకుకల ముడియినుము, బొగ్గులు నాసిరకానివి అయినప్పటికీ సున్నపురాతితోకలిపి ఉక్కుతయారీకివినియోగించవచ్చునని నేషనల్ మెటలర్జికల్ లేబొరేటరీలు జరిపిన పైలట్‌ప్లాంటు ప్రయోగాలు రూఢిచేసినవి. ప్రైవేటు పారిశ్రామికులు యీ ప్రయోగ ఫలితాలను వినియోగించుకోవాలి. ఈ రంగంలో యిదివరకే కొందరు పనిచేస్తున్నారు. వారికి నా శుభాకాంక్షలు. ఈ ముఖ్య పరిశ్రమ విషయంలో వలసిన సహాయం లభించగలదని ప్రభుత్వం తరపున నేను హామీ యిస్తున్నాను. ఇది మూల పరిశ్రమ దీని ప్రభావం రాష్ట్రంలోని యితర పరిశ్రమలపై వుంటుంది"

"ఆంధ్రప్రదేశ్ గనుల త్రవ్వకాలసంస్థ ప్రైవేటు విభాగంతో పోటీకి యేర్పడినదేమో నన్న సంశయాన్ని శ్రీ నాయుడుగారు నివారించటం ముదావహం. ఇంక యెక్కువగా యేమీ చెప్పను కాని రాష్ట్రంలోని ప్రైవేటు పారిశ్రామికుల సమస్యలను అవగాహన చేసుకొనుటకు యీ చర్చా సమావేశం యితోధికంగా తోడ్పడగలదని, రాష్ట్ర ఖనిజ పరిశ్రమ అభివృద్ధికి పరస్పర సహకారంతో పనిచేయవలసిన సందర్భాలను వెలికి తీయగదలని కోరుతున్నాను.

ఖనిజాలను వెలికి తీయుటయేకాక ఖనిజ వస్తువుల తయారీ మున్నగువాటికి యంత్రాగారాలను నెలకొల్పుట కూడ ఆంధ్రప్రదేశ్ గనులత్రవ్వకంసంస్థ ఆశయమై వున్నదని గనులు, భూగర్భశాస్త్ర శాఖడైరెక్టరు అభిరున చెప్పారు. ఈ సంస్థకృషి కొందరుగనుల యజమానులకు. గనుల త్రవ్వకాన్ని వుత్తమంగా జరిపించుటలోనే కాక వెలికి తీసిన ఖనిజాల అభివృద్ధి వినియోగాలలో కూడ మార్గదర్శకం కాగలదన్నారు.

ప్రణాళిక ద్వారా మీకు కలిగే ప్రయోజనాలు

# జన సమూహానికి విద్య



దాదాపు 5 కోట్ల మంది పిల్లలకి
(6 నుండి 11 సంవత్సరాల వయస్సు) ఉచిత ప్రాధమిక విద్య.
సాంకేతిక, ఉన్నత విద్యాభ్యాసానికి ఇతోధికమైన అవకాశాలు.
ఉపాధ్యాయుల శిక్షణకు విస్తృతావకాశాలు.
ఇదివరలో కంటె ఎక్కువగా స్కాలర్‌షిప్పులు—
వీటిద్వారా మీ పిల్లల విద్యాభ్యాసానికి చక్కని అవకాశాలు

ప్రణాళిక నిర్వహణకి తోడ్పడండి తద్వారా

మూడవ పంచవర్ష ప్రణాళిక | **ప్రతి ఒక్కరికీ ఆనందదాయకమైన జీవితం**

DA 61/719

# ముఖ్యఘట్టాలు

## రాష్ట్రంలో

21–1–1961

విజయనగరం సమీపంలోనున్న కోరుకొండవద్ద సైనిక పాఠశాలను తెరిచారు.

1–2–1262

"ఆంధ్రప్రదేశ్‌లో ఖనిజ పరిశ్రమలు" అనే విషయంపై హైద్రాబాదులో గోష్ఠి జరిగింది.

2–2–1962

రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి పరిస్థితిని గురించి ప్రభుత్వం పత్రికా ప్రకటన జారీ చేసింది విద్యుత్ సరఫరా విషయంలో ఆందోళన జెందనవసరము లేదనీ, ఉత్పాదక శక్తిని పెంచడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నదనీ ప్రభుత్వం తన ప్రకటనలో వివరించింది.

5–2–1962

హైద్రాబాదులోని రాష్ట్రసమాచార కేంద్రంలో మహిళావిభాగానికి శ్రీమతి సచార్ ప్రారంభోత్సవం చేశారు.

రాష్ట్రంలోని ఆరు రాజకీయ పక్షాల ప్రతినిధులు హైద్రాబాదులో సమావేశమై, సార్వత్రిక ఎన్నికలు శాంతియుతంగానూ, సాఫీగానూ జరగడానికి వీలుగా పదిసూత్రాలతోకూడిన "ప్రవర్తనా నిబంధనావళి"ని పాటించడానికి నిశ్చయించారు.

7–2–1962

హైద్రాబాదులో జరిగిన గ్రామీణాభివృద్ధి పథకాల ప్రాంతీయ సమావేశంలో 1962–63 వ సం. లో వ్యవసాయపు పనులులేని కాలంలో ఆంధ్రప్రదేశ్, కేరళ, మద్రాసు, మహారాష్ట్ర, మైసూరు రాష్ట్రాలలో అరవై గ్రామీణాభివృద్ధి పథకాలను ప్రారంభించడానికి సిఫార్సు చేసింది.

9–2–1962

హైద్రాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో "ప్రభుత్వరంగంలోని పెట్టుబడి" అనే విషయంపై మూడు రోజులపాటు జరిగిన గోష్ఠికి ప్రెసిడెంట్ కెన్నెడీ ప్రత్యేక సలహాదారు శ్రీ ష్లెసింజెర్ ప్రారంభోత్సవం చేశారు.

12–2–1962

రాష్ట్ర సమాచారశాఖ ప్రచురిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు మాసపత్రిక "ఆంధ్రప్రదేశ్" హిందీసంచికకు ప్రధాన కార్యదర్శి హైద్రాబాదులో ప్రారంభోత్సవం చేశారు.

13–2–1962

పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకాలో తమ్మిలేరు ప్రాజెక్టుకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు. దీనికి రూ. 121 లక్షలు ఖర్చవుతుంది. ఎర్రకాలవపై పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి, ఒక ఆనకట్టకు పునాది రాయి వేశారు.

15–2–1962

ఆంధ్రప్రదేశ్ గిరిజనుల విచారణ సంఘం ప్రభుత్వానికి తన నివేదికను సమర్పించింది.

17–2–1962

ఆంధ్ర గ్రామోద్యోగుల సంఘం కార్యవర్గ సభ్యులు సమావేశమై, జనవరి మొదటి తేదీ నుంచి తమ సంఘంవారు ప్రారంభించిన సహాయ నిరాకరణను విరమించుకొనడానికి నిశ్చయించారు.

19–2–1962

ఆంధ్రప్రదేశ్‌లో పోలింగ్ ఆరంభమైంది.

## భారతదేశంలో

24–1–1962

ఎమన్‌తో దౌత్య సంబంధాలు పెట్టుకోడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది.

25–1–1962

పదమూడవ రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా బిరుదులు పొందిన 55 మందిపేర్లను రాష్ట్రపతి ప్రకటించారు. వీరిలో ముగ్గురికి "పద్మవిభూషణ్" బిరుదు లభించింది.

25–1–1992

దేశమంతటా ప్రజలు ఉత్సాహోపేతంగా 13 వ రిపబ్లిక్

దినోత్సవం జరుపుకున్నారు.

29-1-1962

రెండవ వేతన నిర్ణాయక సంఘం చేసిన ఒక సిఫార్సును పురస్కరించుకొని భారత ప్రభుత్వం ప్రభుత్వోద్యోగులకు పిల్లల అలవెన్సు ఇచ్చే ఒక నూతన పథకాన్ని ప్రకటించింది.

31-1-1962

సిక్కుల ఫిర్యాదులను గురించి విచారణ జరిపిన దాస్ కమిషను ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది.

3-2-1962

భారత, సోవియట్ దేశాలు పరస్పరం సాంస్కృతిక సంబంధాలు నెలకొల్పుకోడానికిసంబంధించిన రెండు సంవత్సరాల ఒప్పందంపై ఈ ఉభయ దేశాల ప్రతినిధులు కలకత్తాలో సంతకాలు చేశారు.

6-2-1962

పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి దుర్గాపూర్‌లో ఏ. వి. బి. ప్రాజెక్టుకు లాంఛన ప్రాయంగా ప్రారంభోత్సవం చేశారు. సిమెంటు తయారుచేసే యంత్రాలు, గనుల పరిశ్రమలలో ఉపయోగించే భారీ పరికరాలు మొదలైన వాటిని ఉత్పత్తి చేసేందుకై భారత-బ్రిటిష్ దేశాలు దీనిని నెలకొల్పాయి.

8-2-1962

భారత సైనిక దళంలోని జనరల్ సర్వీస్ ఆఫీసర్ల వేతనాలను సవరించి నూతన స్కేళ్లను కేంద్రప్రభుత్వం ప్రకటించింది.

13-2-1962

శ్రీ ఏ. కే. చాందా అధ్యక్షతన నియమించబడిన మూడవ ఆర్థిక సంఘంవారు చేసిన సిఫార్సులను యూనియన్ ప్రభుత్వం ఆమోదించినట్లు ప్రకటించబడినది.

11-2-1962

ఇరవై లక్షల డాలర్లు విలువచేసే ఐక్యరాజ్యసమితి బాండ్లను కొనడానికి యూనియన్ ప్రభుత్వం నిశ్చయించినట్లు క్రొత్త ఢిల్లీలో అధికారికంగా ప్రకటించబడినది.

16-2-1962

దేశంలో మూడవ సార్వత్రిక ఎన్నికలు ఆరంభమయ్యాయి.

### విదేశాలలో

28-1-1962

సింహళం ప్రభుత్వాన్ని పడద్రోయడానికి అక్కడి పోలీసు, సైనిక దళాల సీనియర్ ఆఫీసర్లు పన్నిన కుట్రను భగ్నం చేసినట్టు ఆ ప్రభుత్వం ప్రకటించింది.

30-1-1962

ప్రభుత్వ వ్యతిరేకమైన చర్యలలో పాల్గొంటున్నాడనే నేరంపై పాకిస్తాన్ మాజీ ప్రధానమంత్రి శ్రీ హెచ్.యస్. సుహ్రవర్దీని పాక్ ప్రభుత్వం నిర్బంధించింది.

10-2-1962

గూఢచారి చర్యలలో పాల్గొన్నందరు రష్యా కూల్చివేసిన యు-2 విమానం పైలట్ ఫ్రాన్సిస్‌గేరీ పవర్స్‌ను సోవియట్ యూనియన్ విడుదల చేసింది. ఇందుకు ప్రతిగా అమెరికాలో గూఢాచారి చర్యలకు పాల్పడినందుకు శిక్షణ పొందిన సోవియట్ పౌరుడు రుడాల్ఫ్ అబెలెను అమెరికా విడిచిపెట్టింది.

20-2-19 2

జాన్ గ్లెన్‌ను అమెరికా అంతరిక్షంలోకి జయప్రదంగా పంపింది. అయిదు గంటల తరువాత ఆయన సురక్షితంగా క్రిందికి దిగాడు.



# గ్రంథ సమీక్ష

150 పుటలతో 3 రు. వెలతో వెలువడిన ఈ "హర్ష వర్ధనుడు" అన్న ఈ గ్రంథము శాస్త్రవిజ్ఞానము, చరిత్ర, తెలుగు ఉర్దూ అకాడమీ, హైదరాబాదువారి మూడవ ప్రచురణము. తెనుగులోను, ఉర్దూలోను ఇంజనీరింగు, రసాయన శాస్త్రము, భౌతిక శాస్త్రము జీవశాస్త్రము మొదలగు శాస్త్ర విషయములను గూర్చియు, చరిత్ర, అర్థశాస్త్రము, రాజ్యాంగ తంత్రము, పురాతత్వము మొదలగు సామాజిక శాస్త్రవిషయములను గూర్చియు గ్రంథములను ప్రచురించుటకై ఈ అకాడమీ స్థాపింపబడినది

అకాడమీ అధ్యక్షులు రాష్ట్రశాసన సభ 'స్పీకరు' పద్మభూషణ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు. పాలక వర్గమందు ప్రస్తుతము గుజరాత్ రాష్ట్రము గవర్నరు నవాబ్ మెహిదీనవాజ్ జంగ్, పద్మభూషణ శ్రీ మాడపాటి. హనుమంతరావు, ప్రొఫెసరు మామిడిపూడి వెంకట రంగయ్య, డాక్టరుసయ్యద్ మహమ్మద్ ఖాదిరీజోర్, డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, డాక్టరు ఎన్. వి. సుబ్బారావు మొదలగు వారున్నారు. గ్రంథములను పరిశీలించుటకై వేరువేరు సంపాదకీయ సంఘములు కలవు.

ఇంతవరకు ఈ అకాడమీ ఏడు పుస్తకములు ప్రచురించినది. దేశభాషలలో శాస్త్ర విషయములపై ప్రామాణిక గ్రంథములు లేని కొరత తీర్చుటకై, ఈ సంస్థ చేయుచున్నపని ఎంతయో అవసరము. ప్రశంసనీయము

తొలిపలుకులో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారు వ్రాసినట్లు, ఈ గ్రంథరచనకై శ్రీ కిళాబి రాఘవాచార్యులు అన్నివిధముల తగిన వారు. చారిత్రిక వ్యాసములు వీరివెన్నియో పత్రికలలో ప్రకటితమైనవి. వీరిది మరియొక గ్రంథము మద్రాసు ప్రభుత్వము వారి బహుమానము పొందినది అగు 'శ్రీ కృష్ణదేవరాయలు' ఈ అకాడమీ చేతనే ప్రచురింపబడినది.

ఉపోద్ఘాతములో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ పేర్కొన్నట్లు ఇంతవరకు మన దేశచరిత్రలో జరిగిన పరిశోధనకై మనము పాశ్చాత్యులకు ఋణపడియున్నాము. కాని వారు భారతీయేతరులగుటవలన వారు కావించిన కృషిలోను, వారికి దొరికిన సాధన సంపదను సమన్వయించుటలోను, సమన్వయించి తేల్చిన ఫలితములలోను చాల లోపములుండవచ్చును ఇప్పుడిప్పుడు అనేక భారతీయ పండితులు ఆ దోషములు సవరించి, మన సంప్రదాయము ననుసరించి విషయమును సమన్వయించి సిద్ధాంతములు చేయుచుండుటచేత, ప్రాచీన భారత నిజస్వరూపము వ్యక్తమగుచున్నది.

హర్షవర్ధనుని జీవితవిషయములో మాత్రము, మనకు సమకాలికులైన చీనా దేశ బౌద్ధ యాత్రికుడగు హ్యూయన్‌త్సాంగ్, ఆస్థానపండితుడైన బాణభట్టు రచనలు ప్రామాణికాధారములు. హర్షుని పాలనా కాలములో భారతీయ సంస్కృతీ వికాసము పరాకాష్ఠ నందుకొన్నదనుటలో సందేహము లేదు. ఈ కాలముననే సంస్కృత భాష బహుముఖముతో వ్యాప్తిచెందినది. బాణమయూరాదులగు కవులు, ఉజ్జయిని, తక్షశిల, నలంద, వల్లభీనగరాది విద్యాస్థానములు వర్ధిల్లిన కాలమిది.

గ్రంథకర్త ఆ కాలమును కనులకు కట్టినట్లు వర్ణించుటలో కృతకృత్యులైనట్టే చెప్పవచ్చును. ముఖ్యముగా "హర్షుని రాజ్యపాలనము" "మతము—మత సభలు". "విద్యాపోషణము—నాటక రచనము" మరియు "ఆర్థిక సాంఘిక పరిస్థితులు" అను ప్రకరణములు సామాన్య పాఠకులకు చాల ఉపయోగకరములు.

గ్రంథకర్త పుస్తకమును కొద్దిగా పాఠ్యగ్రంథ ధోరణి నడిపినట్లున్నది. శైలి గూడ అదే పంథాలో నున్నది. ప్రతి పుట అడుగున ఉదాహృత గ్రంథాల నుండి విరివిగా Quotations ఇవ్వబడినవి. సామాన్య పాఠకుల దృష్ట్యా ఇవన్నీ అనవసరమేమో అనిపిస్తుంది.

పుస్తకము అంత్యములో ఇవ్వబడిన అనుబంధాలు, ఇంకా లోతుగా విషయాన్ని పఠించాలనే కుతూహలము గల పాఠకులకు చాల ఉపయోగపడతాయి వీటిలో హర్షుని కాలమునాటి మధువన్ బన్‌స్ఖేరా శాసనములు, ఆకాలము గురించిన ఇతర గ్రంథములు సమకాలిక రాజ వంశాలు మున్నగునవి పేర్కొనబడ్డాయి. అన్నిటికన్నా, అందరినీ, అమితంగా ఆకర్షించేది నలందా విశ్వవిద్యాలయాన్ని గురించిన అనుబంధ వ్యాసము.

సుమారు నూట అరవై పుటలు గల చిన్న పుస్తకానికి అందులో చారిత్రక జీవిత గ్రంథానికి అంత్యములో పదానుక్రమణిక ఇవ్వడం అనవసరం.

పుస్తకాన్ని అందంగా ప్రచురించిన దానికై అకాడమీవారు అభినందనీయులు. ముఖచిత్రం విషయానికి తగినట్టు గాను, ఉదాత్తంగాను ఉన్నది. ముద్రణము బాగున్నది.

మన ప్రాచీన సంస్కృతిపై అభిమానం గల ప్రతి ఆంధ్రుడూ చదవతగ్గ గ్రంథము.

"రోహిణి"

# సత్వర పారిశ్రామికాభివృద్ధి

( 4 వ పేజీ తరువాయి )

తెలంగాణా ప్రాంతంలో ప్రయాణ సౌకర్యాలను హెచ్చించుటయే కాక ఆంధ్ర ప్రాంతంలో రవాణా జాతీయకరణను కూడ చేపట్టినది. ఈనాడు రాష్ట్రంలోని 20 జిల్లాలకు 12 జిల్లాలలో జాతీయ రవాణాసౌకర్యాలున్నవి

రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు 1-4-59 న యేర్పాటు చేయ బడినది. దీనికి పంపిణీ మార్గాలు మున్నగువాటి నిర్మాణం. నిర్వహణ వగైరాలకు సంబంధించిన కొన్ని పనులు విద్యుచ్ఛక్తి శాఖ నుంచి బదిలీ చేయబడినవి. ఈ బోర్డుకి పెట్టుబడి ఖర్చు క్రింద ప్రభుత్వం యిప్పటికి 10 కోట్ల రూపాయలను యిచ్చినది. దీనికి తోడు మరి రూ 3.10 కోట్లను బోర్డు ఓపెన్ మార్కెట్ అప్పు ద్వారా సంపాదించినది. పెట్టుబడి ఖర్చుకై డిప్రీషియేషన్ ఫండ్ విరాళాల నుంచి కూడ అది కొంత సొమ్ము తీసుకున్నది

## సాంకేతిక-ఆర్థిక పరిశీలన

రాష్ట్రపు వనరులను గురించి తెలుసుకొని, అన్ని విభాగాలలోను సాంకేతిక, ఆర్థిక సౌలభ్యాలను అంచనా వేసి, స్థూలమైన అవకాశాలను సూచించుటకై అప్లయిడ్ ఆర్థిక పరిశోధన జాతీయ సంఘం సాంకేతిక-ఆర్థిక పరిశీలనను జరిపినది ఈ సంఘం నివేదిక పూర్తి అయినది. అది త్వరలోనే ప్రచురింపబడును ఇది ప్రైవేటు పారిశ్రామికులకు మిక్కిలి వుపయుక్తం కాగలదు. ఎందువల్ల ననగా ముఖ్యంగా యీ నివేదికలో, ఇంజనీరింగ్ ప్రాసెస్ పరిశ్రమల రంగంలో ముప్పది "అభ్యర్థి" పథకాల విషయం కూడా వున్నది.

రాష్ట్రప్రభుత్వ యాజమాన్యం క్రింద గల లేక ప్రభుత్వానికి తగినంత భాగం గల పరిశ్రమల వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి.

ఆంధ్ర కాగితం మిల్లు (రాజమండ్రి) అమ్మకమునకు రాగా 1948 ఏప్రిల్‌లో మద్రాసు ప్రభుత్వం పాతిక లక్షల రూపాయలకు కొన్నది ఈ మిల్లు రోజుకు (24 గంటలు) 10 టన్నుల మధ్యరకం తూకం మెషిన్‌గ్రేడ్ కాగితాన్ని తయారు చేస్తుంది. దీనిని లాభసాటిగా నడుపుటకై దీని వుత్పత్తి శక్తిని రోజుకు 50-60 టన్నులకు లేక సంవత్సరానికి 15,000 టన్నులకు పెంచే కార్యక్రమం ఒకటి చేపట్టబడినది. రోజుకు 60 టన్నుల కాగితాన్ని తయారు చేసే యంత్రాలను ఒక ఫ్రెంచి సంస్థ నుంచి కొనుటకై యేర్పాటు చేయబడినది.

## బొగ్గు గనులు

సింగరేణి బొగ్గు గనులలో వున్న బొగ్గును త్రవ్వటకై 1928 లో చిన్న ప్రారంభం చేయబడినది. ఈ కంపెనీలో చెల్లించ బడిన మూల ధనంలో 58 3 శాతం రాష్ట్ర ప్రభుత్వానిది, 40 శాతం కేంద్ర ప్రభుత్వానిది. ఇది 1960 లో 25 లక్షల టన్నుల బొగ్గును వుత్పత్తి చేసినది. ద్వితీయ ప్రణాళికలో దానికి నిర్దేశించ బడిన లక్ష్యం (1957-62) 30 లక్షల టన్నులను అది సాధించ గలదు. తృతీయ ప్రణాళికకు దీని లక్ష్యం 58 లక్షల టన్నులు. దేశంలో యెక్కువ యంత్ర పరికరాలు గల బొగ్గు గనులలో యిది ఒకటి. కార్మికులకు ప్రోత్సాహం కలిగించే విషయంతో సహా అనేక అంశాల వల్ల యిక్కడ ఒక 'మాన్‌షిప్పు' కి జరిగే వుత్పత్తి క్రమంగా 0 25 టన్నుల నుంచి 0.46 టన్నులకు పెరిగినది.

హైదరాబాదు కెమికల్సు, రసాయన యెరువుల ఫ్యాక్టరీ రూ. 25 62 లక్షలలోను రూ. 12.85 లక్షల వాటా రాష్ట్ర ప్రభుత్వాని కున్నది. ఈ కంపెనీ తన కార్య కలాపాలను విస్తరించి గంధకి కామ్లమును, సూపర్ ఫాస్ఫేట్లను వుత్పత్తి చేయాలని సంకల్పించినది. ఈ విస్తరణ 1962 ఆఖరికి పూర్తి కావచ్చు. కేవలం ప్రభుత్వ విభాగానికి చెందిన యీ సంస్థలలోనే కాక, ప్రభుత్వానికి ప్రైవేటు విభాగానికి చెందిన దిగువ సంస్థలలో కూడా 50 శాతానికి తక్కువగా వివిధ స్థాయిలలో, వాటా లున్నవి: ఆల్విన్ మెటల్ వర్క్సు, సిర్పూరు కాగితం, సిర్‌సిల్కు, క్లాత్ మిల్సు లిమిటెడ్, వజీర్ సుల్తాను పొగాకు ఫ్యాక్టరీ, హైదరాబాదు. ఆస్బెస్టాస్ సిమెంటు ప్రొడక్ట్సు లిమిటెడ్, హైదరాబాదు, కన్‌స్ట్రక్షను కంపెనీ, లామినేటెడ్ ప్రొడక్ట్సు లిమిటెడ్, బయోకెమిక్ అండ్ సింథటిక్ ప్రొడక్ట్సు లిమిటెడ్ వగైరా.

ప్రగాటూల్సులో అత్యధిక భాగం వాటాలు కేంద్ర ప్రభుత్వానివి. వాటాలలో 35 శాతం రాష్ట్ర ప్రభుత్వానివి. ఈ కంపెనీకి పెద్ద విస్తరణ కార్యక్రమం కలదు. దీనికి రెండు కోట్ల రూపాయలు ఖర్చు కాగలవని అంచనా,

తగినంత సొమ్మును అప్పు యిచ్చుటద్వారా పెక్కు యితర పారిశ్రామిక సంస్థలకు కూడ ప్రభుత్వం తోడ్పడినది. ఈ అప్పులు పూర్వ హైదరాబాదు ప్రభుత్వం యేర్పరచిన పారిశ్రామిక ట్రస్ట్ ఫండ్ నుంచి, పరిశ్రమలకు ప్రభుత్వ సహాయ చట్టం క్రింద యివ్వబడినవి. రాష్ట్రాని కొసల స్థాపింపబడిన పెక్కు వాణిజ్య సంస్థలలో కూడా ప్రభుత్వానికి తగినన్ని వాటా లున్నవి ఆ సంస్థలు: అసోసియేటెడ్ సిమెంటు కంపెనీ, బొంబాయి, తాతా లోకో మోటివ్ అండ్ ఇంజనీరింగ్ కంపెనీ, బొంబాయి, రసాయన యెరువులు, కెమికిల్సు ట్రావన్కూర్ లిమిటెడ్ వగైరా,

రాష్ట్ర ప్రభుత్వం పెక్కు చిన్న తరగతి ఉత్పత్తి కేంద్రాలను కూడా నెలకొల్పినది. అట్టి కేంద్రాల స్థాపనకై వ్యక్తులను ప్రోత్సహించుటకేమి, పారిశ్రామిక కేంద్రాలలోను, తదితర చోట్ల అట్టి కేంద్రాలను స్థాపించిన వారికి సర్వీసింగ్ సౌకర్యాలను కల్పించుటకేమి ప్రభుత్వం యీ కేంద్రాలను నెలకొల్పినది

రాష్ట్ర ప్రభుత్వం ప్రైవేటు పారిశ్రామికులకు కూడా తగినంత ప్రోత్సాహ మిస్తున్నది. అయితే ఆ విషయాన్ని యిక్కడ విపులీకరించే సావకాశం లేదు.

### కేంద్ర ప్రాజెక్టులు

కేంద్ర విభాగం క్రింద పారిశ్రామిక ప్రాజెక్టులు కొన్నిటిని మన రాష్ట్రంలో నెలకొల్పి తద్వారా యిచ్చటి పారిశ్రామికాభివృద్ధి వేగాన్ని హెచ్చించుటకు తోడ్పడమని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని అడుగుతున్నది. అందువల్ల, మందుల తయారీ ప్రాజెక్టును, భారీ విద్యచ్ఛక్తి పరికరాల ప్లాంటును మన రాష్ట్రంలో నెలకొల్పుటకు వారు అంగీకరించారు

మన రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధి కెంతయినా అవకాశమున్నది. ప్రభుత్వ ప్రైవేటు విభాగాలు రెండిటిలోను పెట్టుబడిదారులకు అవకాశం వుంటుంది. రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుటకై ప్రభుత్వం కొన్ని ప్రత్యేక సౌకర్యాలను కల్పించ సంకల్పించినది, అనగా భూవసతి, చవుకగా విద్యుచ్ఛక్తి యేర్పాటు, అమ్మకం పన్ను రక్షణలు వగైరా ఈ రెండు విభాగాల మధ్య పోటీ వుండకూడదు. ఎందువల్ల ననగా ప్రభుత్వ విభాగం సౌకర్యాల వసతికి పునాది వేస్తుంది. ప్రైవేటు విభాగం వాటిని వినియోగించు కోవచ్చు, వినియోగించు కుంటుంది కూడా. ఈ రెండు విభాగాలు పరస్పర సహకారంతో పనిచేసిననాడు వ్యవసాయ రంగంలో యిదివరకే ప్రసిద్ధి కెక్కిన మన రాష్ట్రం పారిశ్రామిక రంగంలో కూడా వన్నె కెక్క గలదు

(ఆంగ్లవ్యాసమున కాంధ్రాను వాదం.)

## అఖిలభారత సంస్కృత సాహిత్య సమ్మేళనం

భారత దేశంలో గతనూరు సంవత్సరాలలోనూ ప్రభవించిన సంస్కృత విద్వాంసులూ, వారివారి గ్రంథాలనూ గురించిన వివరాలను తెలిపే శతవార్షికసంచికను, అఖిలభారత సంస్కృత సాహిత్య సమ్మేళనంవారుశ్రీ ప్రకటించదలచారు ఈ సంచికకై ఆంధ్రప్రదేశ్‌నుంచి సమాచారం సేకరించే నిమిత్తం ఇటీవల దిగువ కార్యనిర్వాహక వర్గసభ్యులలో ఈ సంస్థశాఖను హైద్రాబాదులో స్థాపించారు.

సంరక్షకుడు: శ్రీ ఆరావముదు అయ్యంగారు, అధ్యక్షుడు: డా. కె. రంగాచార్యులు. ఉపాధ్యక్షులు: డా. ఆర్యేంద్ర శర్మ, శ్రీ బి. వి. గయాప్రసాదశాస్త్రి, శ్రీ బి. వి. సుబ్బారాయుడు, ప్రధానకార్యదర్శి: శ్రీ బి. ఆర్. శాస్త్రి, సంయుక్త కార్యదర్శి: శ్రీ భీష్మదేవశాస్త్రి. కోశాధికారి: శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

శ్రీ ఎస్. రామేశన్, ఐ. ఎ. ఎస్., శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుతో సహా పదహారుగురు అధికార, అనధికార ప్రముఖులను కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకున్నారు



**Statement about ownership and other particulars about newspaper (Andhra Pradesh) to be published in the first issue every year after the last day of February.**

FORM—IV
*(See Rule 8)*

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Hyderabad |
| 2. | Periodicity of the Publication: | Monthly. |
| *3. | Printer's name<br>Nationality<br>Address: | Shri Yudhvir (Vir Milap Press)*<br>Indian.<br>Mukarramjahi Road, Hyderabad. |
| 4. | Publisher's Name<br>Nationality:<br>Address: | Director of Information and Public Relations.<br>Indian.<br>Mukarramjahi Road, Hyderabad-1. |
| 5. | Editor's Name<br>Nationality:<br>Address: | Narendra Luther, I.A.S.,<br>Indian.<br>Director of Information & Public Relations, Government of Andhra Pradesh, Mukarramjahi Road, Hyderabad-1. |
| 6. | Names and Addresses of individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital. | |

I, Sri Narendra Luther, Director of Information and Public Relations of Andhra Pradesh, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) Narendra Luther,

Signature of Publisher.

---

*The Director, Government Printing Press, Hyderabad is the Official Printer but he may name any other Printer when the Government Press cannot undertake printing of this Journal.




మేము ఏదైతే మీ ఉత్తరంలో చాలా ముఖ్యమైనదిగా భావిస్తామో: అంటే చిరునామా నన్నమాట — దానినే మీరు అసంపూర్తిగా వ్రాస్తే మమ్మల్ని సందిగ్ధావస్థలో పెట్టినవారౌతారన్నమాట. అసంపూర్తిగా చిరునామా వ్రాయడంవలన మీ ఉత్తరం వెళ్ళవలసిన దానికంటె ఎంతోదూరం ప్రయాణం చేయవలసి వస్తుంది!



చేరవలసినచోటుకి మీ ఉత్తరం నేరుగా వెళ్లాలంటే, స్పష్టంగా పూర్తిగా చిరునామా వ్రాయవలసి వుంటుంది.

మీకు ఇతోధికంగా సేవచేయడానికి మాతో సహకరించండి

DA 61/210 తంతి, తపాలా శాఖ

# ఆంధ్రప్రదేశ్‌లో సాధారణ ఎన్నికలు

## ఒక పరిశీలన

ప్రజాస్వామ్య వ్యవస్థలో, ప్రజలు తమ కోరికలను అమలుపరచ యత్నించే ప్రభుత్వ స్థాపనకై, కొంత కాలానికొకమారు తమ ప్రతినిధులను యెన్నుకొంటూ వుండాలి. ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని వుద్దేశించే భారత రాజ్యాంగం, అయిదు సంవత్సరములకొకసారి కొత్త ప్రభుత్వాన్ని యెన్నుకొందుకు ప్రజలకు హక్కునిస్తున్నది. ఎన్నికలు వయోజన ఓటు ప్రాతిపదిక పై జరుగుతవి. ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలలో మిక్కిలి పెద్దదైన భారత దేశ జనాభా ప్రపంచ జనాభాలో రమారమి ఆరవ వంతు వుంటుంది. ఓటు వేసే వారి సంఖ్య 2100 లక్షలు. దేశంలో మూడవ సాధారణ ఎన్నికలు యిటీవలనే ముగిసినవి. ఇదివరలో 1952, 1957 లలో రెండు సార్లు ఎన్నికలు జరిగి కొత్త ప్రభుత్వాలను యేర్పరచడం జరిగినది.

మూడున్నర కోట్ల జనాభా గలిగి, 190 లక్షల మంది ఓటర్లుగల ఆంధ్రప్రదేశ్‌లో 19-2-62 నుంచి మూడవ సాధారణ ఎన్నికలు ఆరంభమైనవి. ఇవి 293 మంది సభ్యులను రాష్ట్ర శాసన సభకు, 43 మంది సభ్యులను లోక్‌సభకు, అయిదు సంవత్సరాలు పదవిలో వుండుటకై, యెన్నుకొనుటకు వుద్దేశించబడినవి. అయితే, తెలంగాణా నియోజక వర్గాలలో యెన్నికలు సరిగ్గా అయిదు సంవత్సరాలకు జరుగగా, మిగిలిన ఆంధ్రప్రదేశ్ యీ యెన్నికలలో యేడు సంవత్సరాల పిమ్మట పాల్గొన్నది. ఎందువల్లననగా, 1955 లో ఆంధ్ర శాసనసభకు యెన్నుకొనబడిన 196 మంది సభ్యుల పదవీ కాలము, ప్రకాశం మంత్రివర్గం పతనాన్ననుసరించి, 1962 వరకు పొడిగించబడినది. గుర్తు పద్ధతిద్వారా ఓటు వేయడం యీ యెన్నికలలో క్రొత్తగా ప్రవేశపెట్టబడినది.

మన రాష్ట్రంలో 1962 ఫిబ్రవరి 19 న ఆరంభమైన యెన్నికలు ఫిబ్రవరి 25 న పూర్తి అయినవి. అన్ని నియోజక వర్గాలలోను ఓట్లలెక్క ఫిబ్రవరి 25 ననే ప్రారంభమైనది. మొత్తంమీద అన్ని నియోజక వర్గాలలోను ప్రజలు ఒడిదుడుకులు లేకుండానే ఓటు చేశారు. ఓటర్లు తమ ఓటు హక్కు వినియోగంలో చాల వుత్సాహం చూపారు.

రాష్ట్ర శాసనసభలో మొత్తం సభ్యుల సంఖ్య, ఆంగ్లో ఇండియన్ ప్రజలలోనుంచి గవర్నరు నామినేటు చేసే ఒక సభ్యునితో కలుపుకొని 302 ఉండేది. రాష్ట్ర సరిహద్దుల సర్దుబాటు ఫలితంగా ఒక స్థానాన్ని మద్రాసు రాష్ట్రానికి బదలీ చేసినందువల్ల

ఇప్పుడు రాష్ట్రశాసన సభలో సభ్యులసంఖ్య 301 కి తగ్గింది. ఆరుగురు కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నిక అయ్యారు. పోటీచేస్తున్న అభ్యర్థులలో ఒకరు చనిపోవడంవల్ల మెదక్ జిల్లా రామాయంపేట నియోజక వర్గంలో పోలింగ్ వాయిదా వేయబడింది.

ఈ ఎన్నికల్లో విజయవాడ దక్షిణ నియోజక వర్గంనుంచి పోటీచేసిన రాష్ట్రశాసనసభ స్పీకర్ పూజ్యులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారు ఫిబ్రవరి 26వ తేదీ ఉదయం దివంగతులయ్యారు. ఆయన చనిపోయిన 12 గంటల తర్వాత ఎన్నికల్లో శ్రీ కాళేశ్వరరావు నెగ్గినట్లు ప్రకటించబడింది

రాష్ట్ర శాసనసభలో వివిధ పార్టీల బలాబలాలు దిగువ విధంగా వున్నాయి.

| మొత్తం స్థానాలు | కాంగ్రెసు | కమ్యూనిస్టు | స్వతంత్ర | సోషలిస్టు | ఇండిపెండెంటు |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 300 | 178 | 51 | 19 | 2 | 51 |
| **లోకసభ ఫలితాలు:** | | | | | |
| 43 | 34 | 7 | 1 | ... | 1 |

ఆంధ్రప్రదేశ్‌లో నూటికి 64 వంతులమంది ఓటర్లు ఓటు చేశారు పోలైన ఓట్లలో 47.23 శాతం ఓట్లు కాంగ్రెసుకు లభించాయి. కాగా 19.35 శాతం ఓట్లు కమ్యూనిస్టులకూ, 20 42 శాతం ఓట్లు ఇండిపెండెంట్లకూ, 10.62 శాతం ఓట్లు స్వతంత్రపార్టీకి, 0 71 శాతం ఓట్లు సోషలిస్టులకు లభించాయి. జనసంఘం, రిపబ్లికన్ పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీలు ఒక్క స్థానాన్ని కూడా గెలుచుకోలేదు. ఈ మూడు పార్టీలకు వరుసగా నూటికి 1.03, 0 40, 0.23 వంతుల ఓట్లు లభించాయి.

రాష్ట్ర శాసనసభకు జరిగిన ఎన్నికల ఫలితాలన్నీ ప్రకటించబడిన తరువాత ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య తన మంత్రిమండలి రాజీనామాను 1962 ఫిబ్రవరి 28 వ తేదీన గవర్నరుకు సమర్పించారు. కొత్త మంత్రివర్గం ప్రమాణస్వీకారం చేసేవరకూ తమపదవులను కొనసాగించవలసిందిగా గవర్నరు ముఖ్యమంత్రిని అభ్యర్థించారు. రాష్ట్రశాసనసభలో సగం కంటే ఎక్కువ స్థానాలు గెలుపొందిన పార్టీ నాయకుడిని కొత్త మంత్రి వర్గం ఏర్పాటు చేయవలసిందిగా గవర్నరు ఆహ్వానిస్తారు.

## రచయితలకు మనవి

అనేక మంది రచయితలు తమ రచనలు పంపిన తరువాత ఒక్క నెలన్నా గడవకముందే తమ రచనలు ప్రచురించేది లేనిది తెలియజేయవలసిందిగా కోరుతూ ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాస్తున్నారు. రచన ప్రచురణార్హం అయ్యేది కానిది తెలపడానికి కనీసం మూడు నెలలైనా వ్యవధి కావాలి. ఈ మాత్రమైనా వ్యవధి లేకుండా సమాధానం వ్రాయడం సాధ్యపడదు ఈ విషయంలో రచయితలు కూడా మాతో సహకరించాలని కోరుతున్నాము.

ఎడిటర్,
ఆంధ్రప్రదేశ్ (తెలుగు)

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad. 1

# "ఆంధ్ర ప్రదేశ్ ప్రకటన రేట్లు"

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడుభాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾×8½" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలు, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్టుద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.

6. ప్రకటన ఎంతస్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈదిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార ప్రజాసంబంధముల శాఖ,
ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్-1

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సమాచార, ప్రజాసంబంధశాఖ, హైదరాబాదు

### ప ట్టి క

**ఇ ం గ్లీ షు**

| | | రూ. న. పై. |
|---|---|---|
| 1. అరకులోయ | .. | 0 — 60 |
| 2. ఆంధ్రప్రదేశ్—విశేషాలు | .. | 0 — 25 |

**తె లు గు**

| | | |
|---|---|---|
| 1. శ్రీ అల్లూరి సీతారామరాజు జీవితచరిత్ర | | 2 — 75 |
| 2. 'ప్రగతి గీతాలు' | .. | 0 — 25 |
| 3. మూడవ మెట్టు | .. | 0 — 25 |

**ఉ ర దు**

| | | |
|---|---|---|
| 1. ఆహారోత్పత్తి | .. | 0 — 12 |
| 2. గిరిజన సంక్షేమం | .. | 0 — 12 |
| 3. మత్స్యసంపద | .. | 0 — 12 |

పో స్టే జి అ ద న ం

ప్రతులను సమాచార, ప్రజా సంబంధ శాఖ

సమాచార కేంద్రంనుంచి పొందవచ్చు.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్‌డివిజన్లు, (1962 జనాభా లెక్కలు)

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... ... | 1,05,858 చదరపు మైళ్ళు |
| జనాభా | ... ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... ... | 20 |
| తాలూకాలు | ... ... | 185 |
| పట్టణాలు, నగరాలు | ... ... | 293 |
| జనసాంద్రత (ఒక చదరపు మైలుకు) | ... | 340 మంది |

## పంచవార్షిక పశుగణన–1961

| | | (వేలలో) |
|---|---|---|
| పశువులు | ... ... | 121.80 |
| గేదెలు | ... ... | 69.52 |
| గొర్రెలు | ... ... | 83.73 |
| మేకలు | ... ... | 42.55 |
| గుర్రాలు | ... ... | 73 |
| ఇతర జంతువులు | ... ... | 6.82 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| | 1959_60 | 1960_61 |
|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 |
| సగటున వేయిగ్రామాలకు గల బ్లాకులు | 10.66 | 15.52 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 15.52 |
| బ్లాకులక్రింద వున్నగ్రామాలు ... | 17,887 | 20,823 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | 1,87.31,000 | 20,701,000 |

## ఖనిజాల వుత్పత్తి

| | | 1959_60 | 1960_61 |
|---|---|---|---|
| బొగ్గు | ... ... | 2260,000 టన్నులు | 2596,000 టన్నులు |
| ముడిఇనుము | ... ... | 199,000 ,, | 236,000 ,, |
| మాంగనీస్ | ... ... | 16,000 ,, | 23,000 ,, |
| అభ్రకం | ... ... | 3,000 ,, | 3,000 ,, |
| సున్నపురాయి | ... ... | 766,000 ,, | 1,011,000 ,, |

